# ఆంధ్రప్రదేశ్

డిశంబరు, 1957.

సంపుటి 2 సంచిక 2

మార్గశీర్షము, శాలివాహనశకము - 1879

## విషయసూచిక



— చందా వివరాలు —

సాలుసరి రూ. 1-8-0 లేక ఒక రూపాయ 50 నయాపైసలు

విడిప్రతి 0-2-0 లేక 12 నయాపైసలు

ఆంధ్రప్రదేశ్ సమాచార పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి సిటిజన్‌ప్రెస్‌లో ముద్రింపబడినది.

# ముఖచిత్రం



అరకు లోయలోని చినలబుడు గ్రామంలో పాఠశాలలో చదువు నేర్చుకుంటున్న పిల్లలు.

## అరకు లోయ :

# గిరిజనులకు నవజీవన సదుపాయాలు

*అరకు లోయలో తొలిసారిగా బహుళార్థ సాధక అభివృద్ధి కార్యక్రమం అమలు జరుపబడుతూ వున్నది. ఫలితంగా అక్కడ నివసించే 34 వేల మంది గిరిజనులకు నవజీవన సదుపాయాలు కలుగబోతున్నవి.*

*యుద్ధకాలంలో ఈ లోయ బంగాళా దుంపలు పండించడానికి ఉపయోగించబడేది. ఆ తరువాత మైదాన భూముల ప్రజలకు నివాసం కల్పించడానికి ఇది ఎన్నిక చేయబడింది. వారికి నివేశన స్థలాలు కూడా కేటాయించబడ్డవి. కాని ఇప్పుడు ఈ లోయలో నివసించే ప్రజలకు - అనగా గిరిజనులకు ఆధునిక వ్యవసాయ విధానాల ద్వారా తదితర వృత్తులద్వారా వారి ప్రాంతాన్ని అభివృద్ధి పరచుకొనే పద్ధతులు బోధింపబడుతున్నవి. అరకు లోయ ప్రజలు చాలా వెనుకబడి వున్నారు. వారిలో చాలా మంది ఇంతవరకు రైలు బండిని కూడా చూచి ఎరుగరు. కాని ఇప్పుడు వారు నూతన జీవిత విధానాలను నేర్చుకుంటున్నారు. త్వరలో వారి జీవన ప్రమాణం తప్పకుండా పెరుగుతుంది.*

అరకులోయ జాతీయ విస్తరణ సేవాకేంద్రం (యస్. ఇ. యస్. బ్లాకు) 1956 మార్చి 4వ తేదీన ప్రారంభింప బడింది. ఆ తరువాత 1-4-1956 తేదీ నుంచి అది బహుళార్థ సాధక ప్రాజెక్టుగా పై స్థాయికి మార్చబడినట్లు పరిగణింప బడింది.

శృంగవరపు కోట తాలూకాలోని పాచిపెంట ఎస్టేటు ప్రాంతం యావత్తూ అరకు ఏజన్సీ బ్లాకు ప్రాంతంగా పరిగణింప బడుతున్నది. ఆ ఎస్టేటును ప్రభుత్వం 1948 సంవత్సరపు ఎస్టేట్ల రద్దు చట్టము ననుసరించి 20-8-1955 తేదీన స్వాధీన పరచుకొంది. అరకులోయ జాతీయ విస్తరణ సేవాకేంద్రానికి ఉత్తరదిశన పడమటి దిశన ఒరిస్సారాష్ట్రం, తూర్పున శ్రీకాకుళం జిల్లాలోని సాలూరు తాలూకా ఎల్లలుగా వున్నవి. దక్షిణాన చింతపల్లి తాలూకాలోని హుకుంపేట బహుళార్థ సాధక ప్రాజెక్టు బ్లాకు, శృంగవరపు కోట తాలూకాలోని విజయనగరం ఎస్టేటు (ఇప్పుడు దీనిని ప్రభుత్వం స్వాధీన పరచుకొంది)కు సంబంధించిన ఏజన్సీ ప్రాంతమూ వున్నవి. అరకులోయ బ్లాకుక్రింద ఎంతప్రాంతం వున్నదో సర్వే చేయబడలేదు. బహుశా దాదాపు 240 చదరపు మైళ్ళ విస్తీర్ణం వుంటుందని అంచెనా. ఇది అంతా ఏజన్సీ ప్రాంతం. ఇచట ఎక్కువగా గిరిజనులు నివసిస్తారు. ఈ ప్రాంతంలో 64 గ్రామాలు, 399 శివార్లు వున్నవి. జనాభా 33,723.

బ్లాకు ప్రధాన కేంద్రం అరకులోయ. ప్రధాన కేంద్రంలో ఈ దిగువ ప్రభుత్వ కార్యాలయాలు, సంస్థలు వున్నవి.

1. ప్రభుత్వ ఆసుపత్రి
2. వ్యవసాయ క్షేత్రం
3. మలేరియా నిరోధక పథకం
4. పట్టు పరిశ్రమ కేంద్రం
5. తంతి తపాలాఫీసు
6. స్త్రీజన సంక్షేమ కేంద్రం
7. మట్టిపాత్రల తయారీ శిక్షణ కేంద్రం
8. ప్రభుత్వ హైయర్ ఎలిమెంటరీ పాఠశాల
9. గిరిజన విద్యార్థులకు ప్రభుత్వ ఆసుపత్రి
10. పోలీసు ఔట్ పోస్టు
11. రెవిన్యూ ఆఫీసు
12. జూనియర్ డిప్యూటీ స్కూళ్ళ ఇనస్పెక్టర్



పొలం పని చేస్తున్న "కొండదొర" స్త్రీ

13. జూనియర్ ఇంజనీరు (భూసార పరిరక్షణ ఇంజనీరింగ్)
14. అసిస్టెంట్ ఎగ్రికల్చరల్ ఇంజనీరు (భూసార పరిరక్షణ—వ్యవసాయం)
15. జూనియర్ ఇంజనీరు, ఎలక్ట్రిసిటీ.
16. పశువైద్య అసిస్టెంట్ సర్జన్.
17. జూనియర్ ఇంజనీరు (రహదార్లు)
18. బ్లాక్ ఆఫీసు.

తాలూకా ప్రధాన కేంద్రమైన శృంగవరపు కోటనుంచి బ్లాక్ ప్రధాన కేంద్రం 37 మైళ్ళ దూరంలో వుంది. దీనికి దగ్గిర రైలు స్టేషను కొత్తవలస అది 53 మైళ్ళ దూరంలో వుంది. జిల్లా ప్రధాన కేంద్రమైన విశాఖపట్నం 71 మైళ్ళ దూరంలో వుంది. బ్లాకు ప్రాంతంలో గిరిజనులు హెచ్చుగా నివసించే గ్రామం అరకు. దాని పేరిటనే ఈ బ్లాకుకు అరకుబ్లాకు అని పేరు పెట్టబడింది. అరకు గ్రామం జనాభా 917. ఈ గ్రామంలో ఒక పోలీసు స్టేషను, ప్రభుత్వ ఎలిమెంటరీ పాఠశాల, బ్రాంచి పోస్టాఫీసు వున్నాయి.

అరకు గ్రామంలో ప్రతి శుక్రవారమూ, సుంకర మెట్టలో ప్రతి ఆదివారము సంతలు జరుగుతాయి. ఆ సంతలకు గిరిజనులు ఎక్కువగా వస్తారు. ముఖ్యంగా వేసవి సంతలకు గిరిజనులు అడవి ఉత్పత్తులను, అపరాలను, ధాన్యాలు మొదలగువాటిని తీసుకొని అమ్ముకోడానికి వస్తారు. మైదాన భూముల నుంచి వర్తకులు ఉప్పు, వస్త్రాలు, ఎండుచేపలు, కిరసనాయిలు మొదలగు సరుకులను అమ్మకానికి తెస్తారు. సాధారణంగా ఒక సరుకు నిచ్చి మరొక సరుకును పుచ్చుకొనే పద్ధతిద్వారా సంతలలో వ్యాపారం జరుగుతుంది. నగదు పెట్టికూడా సరుకులను కొంటారు.

అరకు బ్లాకుక్రింది ప్రాంతం చాలావరకు ద్విభాషా ప్రాంతం. గిరిజనులు తెలుగు, ఒరియా రెండు



*అరకులోయలో చట్టి గడ్డ వాగుపై నిర్మింపబడిన వంతెన*

భాషలూ మాట్లాడుతారు. అయితే వారిమాట అప భ్రంశంగా వుంటుంది.

ఈ ప్రాంతంలో ఈ దిగువకొండ జాతులవారున్నారు :

1. బగత 2. గడబ. 3. కొండకమ్మర. 4. కోటియ 5. కొండదొర 6. కొండకాపు 7. కోయ, 8. కోదు 9. మూకదొర 10. పోరజ 11. మాలి. 12. వాల్మీకి 13. సామంతులు 14. దొంబు 15. పైడి 16. ఘాసి 17. గౌడు.

## వ్యవసాయం

ఈ ప్రాంతంలో పండే పంటలుఇవి : వరి (మెట్ట, మాగాణి) రాగులు, మొక్కజొన్న, సాములు, వలిసె నూనెగింజలు.

అపరాలలో కంది, మినుము, బొబ్బర, సెనగ మొక్కచిక్కుడు, బటాణీ పండుతాయి. కొన్ని ప్రాంతాలలో నువ్వులు, ఆముదాలు పండుతవి. గోధుమకూడా పండుతుంది. పొగాకు, పసుపు, అల్లం, ఆవాలు, మిరపకాయలు, పిప్పళ్ళు కూడా ఈ ప్రాంతంలో పండుతాయి.

ఈ ప్రాంతంలో నివసించే గిరిజనులు బావుల నీటిని సేద్యానికి వినియోగించరు. ఈ మొత్తం ప్రాంతంలో ఐదుకుంటలద్వారా సాగునీరు సరఫరా అవుతున్నది. సేద్యానికి ఎక్కువగా వర్షపు నీటిపైననే ఆధారపడి వుంటారు.

ఈ బ్లాకు పది గ్రూపులుగా విభజించ బడింది. ప్రతి గ్రూపు యొక్క ప్రధాన కేంద్రంలో ఒక గ్రామ సేవకుడు వుంటాడు. ప్రతి గ్రామసేవకుడి క్రింద 20 మొదలు 25 చదరపుమైళ్ళ ప్రాంతం వుంటుంది.

## బ్లాకు కార్యక్రమ విశేషాలు

బహుళార్థ సాధక ప్రాజెక్టుకు అవసరమైన అద

నపు సిబ్బందికి తాత్కాలికంగా ఇండ్లు నిర్మింపబడినవి.

ఒక సమాచార కేంద్రం కూడా నెలకొల్పబడింది.

ప్రతిరైతు చీకుడు ఎరువును (కంపోస్టు) తయారు చేసుకునే టందుకు ఒక కార్యక్రమం ఆరంభింప బడింది. 1956-57 లో 542 కంపోస్టు గుంటలు త్రవ్వ బడ్డవి. 1957-58 సంవత్సరంలో 1957 ఆగస్టు నెలాఖరు వరకు 837 కంపోస్టు గుంటలు త్రవ్వ బడ్డవి. ఈ పద్ధతి త్వరిత గతిని వ్యాప్తి చెందుతున్నది.

అనేక గ్రామాలలో జపాను పద్ధతి వరిసేద్యం ప్రవేశ పెట్టబడింది. 362 ఎకరాలలో జపాను పద్ధతి ప్రకారం వరి వేయబడింది. మారుమూల గ్రామాలలో కూడా గిరిజనులు ఈ పద్ధతిని అవలంబిస్తున్నారు. వారికి రసాయనిక ఎరువులు ఉచితంగా ఇవ్వబడినవి. గ్రామ సేవకులుండే ప్రతిగ్రామ ప్రధాన కేంద్రాలలో నమూనా క్షేత్రాలు నెలకొల్పబడ్డవి.

వ్యవసాయశాఖ ఇచట ఒక కాలనీని నిర్మింపవలెనని తలపెట్టింది. అయితే తగు యోగ్యతగల మేస్త్రీ లభించనందు వల్ల ఈ పని ఆరంభింపబడలేదు.

## పశు సంరక్షణ

ఈ క్రింది స్థలాలలో సహాయక గ్రాంటుల కార్యక్రమం క్రింద ప్రైవేటు కోళ్ళ పెంపకపు కేంద్రాలు పెట్టబడినవి.

1. జడ్డి పనస 2. బోసుబెడ్డ 3. సుంకరమెట్ట 4. హట్టగూడ 5. దుంబ్రిగూడ.

కోళ్ళ గ్రుడ్లను పొదుగుటకై అరకు కాలనీలో ఒక భవనం నిర్మింపబడింది. ఈ యూనిటుకు ఒక ఇన్‌క్యుబేటర్ (గ్రుడ్లను పొదుగుటకు ఉపయోగపడే సాధనం) సప్లయి చేయబడింది. విదేశ కోళ్ళు, పశులు, మంచిజాతి గ్రుడ్లు కూడా సరఫరా చేయ



అరకులోయ దృశ్యం



అరకు కాలనీలో గిరిజనుల వసతిగృహం

బడుతున్నవి. 16 ఆర్. ఐ. ఆర్. కోళ్ళు, 1 కోడి పుంజులు వున్నవి.

ఈ దిగువ గ్రామాలలో దేశవాళీ కోడిపుంజులను తీసివేయడం ద్వారా కోళ్ళ పెంపకం స్థాయిని పెంపొందించే కార్యక్రమం చేపట్టబడింది.

1. హుట్టగూడా 2. చినలబుడు 3. మాదగడ 4. కంటభాంసిగూడా 5. బోసుబేడ 6 అరకు 7. దుంబ్రిగూడ 8. బెంజిపూరు 9. పద్మాపురం 10. పణిరంగిణి 11. కించుమండ.

ఈదిగువ స్థలాలలో పశువైద్య ప్రాథమిక చికిత్సా కేంద్రాలు తెరువబడినవి. పశువైద్యానికి సంబంధించిన ఎక్స్‌టెన్షన్ ఆఫీసరు, స్టాక్‌మెన్ కాంపౌండరు ప్రతివారం సంత జరిగే సందర్భంలో ఆ స్థలాలకువెళ్ళి చికిత్స చేస్తారు.

1. అరకు. 2. సుంకరమెట్ట.

గొర్రెలజాతి స్థాయిని పెంపొందించే ఉద్దేశంతో ఈ దిగువ గ్రామాలలో మాండ్యారకం పొట్టేళ్ళు, ఆడగొర్రెలు పంపిణీ చేయబడ్డవి.

1. పెద్దలబుడు
2. చినలబుడు
3. పణిరంగిణ
4. బోసుబేడ

స్థానిక గొర్రెలలో ఉన్ని నాణ్యామును పెంపొందింప జేసే ఉద్దేశంతో ఈ దిగువ గ్రామాలలో నీలగిరి గొర్రెలు పంపిణీ చేయబడినవి.

1. సుంకర మెట్ట
2. బొడ్డగూడ
3. బల్లుగూడ
4. గడయగూడ
5. బోసుబేడ

మాదగడ, అరకు, కిల్లోగూడ, గోరాపురం గ్రామాలలో 14 మాండ్యారకం గొర్రెలు, 7 ఆడ గొర్రెలు పంపిణీచేయబడ్డవి.

సింధీ ఎద్దులను, ఆవులను సప్లయి చేయవలసిందిగా విశాఖపట్టణం జిల్లా పశువైద్యాధికారి కోరినారు. ఈ సప్లయి ఇంకా జరగవలసివున్నది. అరకు గ్రామంలో పశువుల షెడ్డు ఒకటి నిర్మింపబడింది.

## ఆరోగ్యం, పారిశుధ్యం

బ్లాకు ప్రాంతంలో 68 పొగరాని పొయ్యిలు ఏర్పాటు చేయబడ్డవి. గతసంవత్సరం 109 ప్రైవేటు కక్కొసు దొడ్లు అమర్చ బడ్డవి. ఈ సంవత్సరం 17 పొగరాని పొయ్యిలు, 41 ప్రైవేటుకక్కొసు దొడ్లు నిర్మింపబడ్డవి.

ఈ దిగువ గ్రామాలలో ప్రసూతి, శిశు సంరక్షణ కేంద్రాలు ప్రారంభింపబడ్డవి:-

1. సొవ్వ 2. గన్నెల 3. దుంబ్రిగూడ 4. మాదగడ

పై కేంద్రాలను ఏర్పాటు చేయడానికి, ప్రసూతి సహాయక సిబ్బందికి నివాస వసతికొరకూ పై గ్రామాల ప్రజలు ఇండ్లను విరాళంగా ఇచ్చారు.

బ్లాకు ప్రాంతంలో ప్రాథమిక ఆరోగ్య కేంద్ర నిర్మాణం కొరకు ప్రతి పాదనలు చేయబడినవి.

## విద్య

ఈ క్రింది స్థలాలలో 10 వయోజన విద్యా కేంద్రాలు తెరువబడినవి:-

1. బోసుబేడ 2. బెండం 3. మాదగడ 4. చినలబుడు 5. పణిరంగణి 6. లోతేరు 7. గన్నెల 8. కోసంగి 9. గెడ్లబండ 10. సుంకరమెట్ట.

విద్యా విషయకంగా వెనుక బడివున్న ఈ దిగువ గ్రామాలలో 1956-57 సంవత్సరంలో 10 రోజుల పాటు పాఠశాలలు నిర్వహింపబడినవి :-

1. కిల్లోగూడ 2. మాదగడ 3. చినలబుడు 4. గెడ్లబండ 5. కోసంగి 6. బెండం 7. గన్నెల 8. లోతేరు 9. గోరాపురం 10. పణిరంగిణి.



అరకు గ్రామంలో గ్రంథాలయం



అరకు కాలనీలో మలేరియా నిరోధక కార్యక్రమం

ఈ సంవత్సరం ఈ క్రింది గ్రామాలలో మరి మూడు పాఠశాలలను పెట్టవలెనని తల పెట్టబడింది :-

1. సొవ్వ 2. లోగిలి 3. దుంబ్రిగూడ

లోతేరు గ్రామంలో భోజన వసతితో సహా ఒక రెసిడెన్షియల్ స్కూలు ప్రారంభింపబడుతుంది. అసిస్టెంటు ఇంజనీరు అంచెనాలను, పథకాలను సిద్ధం చేస్తున్నారు. స్కూలు భవన నిర్మాణం పని త్వరలో ఆరంభింపబడుతుంది.

బోసుబేడ పాఠశాలకు పక్కా భవనం నిర్మింపబడింది. చినలబుడులో మరో భవనం నిర్మింపబడుతున్నది. ఈ భవనానికి శ్రీ సి. యం. త్రివేది శంకుస్థాపన చేశారు.

## సహకారం

ప్రజలలో పొదుపరి తనమును పెంపొందింపజేయడానికై 1956-57 లో 454 హుండీపెట్టెలు పంపిణీ చేయబడినవి. 1957 ఆగస్టువరకు 207 పెట్టెలు పంపిణీచేయబడ్డవి.

అరకులోను, గుంటసీమలోను రెండు బహుళార్థ సాధక సహకార సంఘాలు ప్రారంభింపబడినవి. ఈ సంవత్సరం 120 మంది సభ్యులు చేర్చబడ్డారు. వారికి స్వల్పకాలిక ఋణాలు కూడా ఇవ్వబడుతున్నవి. స్టోర్సు కార్యక్రమాన్ని వారు చేపట్టి నడుపుతున్నారు. ఇంతవరకు రూ 11,940-లు పంపిణీ చేయబడ్డవి.

సుంకర మెట్టలోను. గుంట సీమలోను రెండు ఏజన్సీ ఉత్పత్తి మార్కెటింగు సంఘాలు ఏర్పాటు చేయబడ్డవి.

## సాంఘిక విద్య

చినలబుడులో ఒకటి, మాదగడ్డలో మరొకటి— ఈ విధంగా రెండు మహిళా సంఘాలు పని చేస్తూవున్నవి. ఈ రెండు కేంద్రాలకు రెండు కుట్టుమిష



*అరకు కాలనీలోని ప్రభుత్వ ఫలవృక్ష క్షేత్రంలో చేపల కొలనులు*

నులు ఇవ్వబడినవి. ఈ కేంద్రాలవారు ఇండ్లకు వెళ్ళి కుట్టుపని, పొగరాని పొయ్యిల ఉపయోగం మొదలగు వాటిని తెలియ జెబుతూ వుంటారు. మహిళా సంఘాలు అడ్డాకుల విస్తళ్ళు కుట్టేపనిని కూడా ప్రారంభించినవి. గిరిజన స్త్రీ పురుషులను మూడు పర్యాయాలు మైదాన ప్రాంతాలకు తీసుకు వెళ్ళి చూపెట్టడం జరిగింది. ఇవి వైజ్ఞానిక పర్యటనల వంటివి.

ఈ క్రింది గ్రామాలలో నవజవాన్ కిసాన్ క్లబ్బులు పని చేస్తూవున్నవి.

1. చినలబుడు 2. అరకుకాలనీ 3. కించుమండ 4. కిల్లోగూడ 5. అరకు గ్రామం 6. దుంబ్రిగూడ 7. కురిడి 8. గుంటసీమ 9. పెద్దలబుడు 10 జన్నంగూడ.

చినలబుడులో పాఠశాల పిల్లలు ఏర్పాటుచేసిన క్లబ్బువారు ఒక వ్యవసాయ కార్యక్రమాన్ని చేపట్టారు. వీరు ఆధునిక వ్యవసాయ పద్ధతులను అవలంబిస్తున్నారు. 1956-57 సంవత్సరంలో గ్రామ నాయకుల శిక్షణ శిబిరాలు 5 నిర్వహింపబడినవి. 16 మంది స్త్రీలు, 154 మంది పురుషులు-మొత్తం 170 మంది గిరిజనులు ఈ శిబిరాలలో శిక్షణ పొందారు. ప్రస్తుత సంవత్సరంలో గ్రామ నాయకుల శిక్షణ శిబిరాలు 3 ఏర్పాటు చేయబడ్డవి. 85 మంది గిరిజనులకు శిక్షణ ఇవ్వబడింది. బ్లాకు ఉద్యోగులు వారి ఉద్యోగవిధుల సందర్భంలో గ్రామాలకు వచ్చినప్పుడు శిబిరాలలో శిక్షణ పొందినట్టి గిరిజనులు వారికి సహాయపడుతున్నారు. అంతేగాక వారు నేర్చుకొన్న కొత్త పద్ధతులను ఆచరణలో పెడుతున్నారు కూడా.

అరకు గ్రామం, అరకు కాలనీలోని రెండు ఎలిమెంటరి పాఠశాలలు బేసిక్ పాఠశాలలుగా మార్చబడినవి.

## రాకపోకల ఏర్పాట్లు

అరకులోయ ప్రాంతంలో గుంటసీమలోయ పెద్దది. అది ప్రధాన కేంద్రం నుంచి 17 మైళ్ళ దూరంలో వుంది. దుంబ్రిగూడా నుంచి అలోయకు 7½ మైళ్ళ పొడవున కచ్చారోడ్డు వేయబడింది. దానివల్ల అలోయకు వెళ్ళడానికి మార్గం ఏర్పడింది. గిరిజనులు కాయ కష్టం చేసి ఆ రోడ్డు నిర్మాణానికి తోడ్పడ్డారు. ఇంకా అనేక చిన్నపాటి అప్రోచ్ రోడ్లు కూడా వేయబడ్డవి.

## గ్రామీణ చేతి పరిశ్రమలు

బ్లాకు ప్రాంతంలో 3 అడ్డాకు విస్తళ్ళ తయ్యారీ కేంద్రాలు ఈ దిగువ స్థలాలలో ప్రారంభింపబడినవి.

1. అరకు 2. బోసుబేడ 3. శరభగూడ

ఈ గిరిజన ప్రాంతంలో నూనెగానుగలు కూడా ప్రవేశ పెట్టబడుతున్నవి. పట్టుపరిశ్రమకై గిరిజన రైతులు తమ పొలాలలో మల్బరీ అంట్లను నాటుతున్నారు.

## ప్రజల తోడ్పాటు

ఈ బ్లాకు ప్రాంతంలో గిరిజనులు పేదవారు. అందుచేత వారు నగదు విరాళాలిచ్చి అభివృద్ధి పథకాలకు తోడ్పడ జాల లేక పోతున్నారు. అయితే పథకాలన్నిటికీ ఏదో విధంగా సహాయ పడాలనే అభిలాష వారిలో వుంది. మొదట ఆఫీసర్లను కలుసుకోవడానికి వారు వెనుకాడేవారు. కాని బ్లాకు ఉద్యోగులు వారిని తరచు కలుసుకొని వారికి అభివృద్ధి కార్యక్రమాలను గూర్చి తెలియ జెబుతున్నందు వల్ల వారు ప్రణాళిక ఉద్దేశాన్ని అర్థం చేసుకొని అభివృద్ధి పథకాలకు తోడ్పడడానికి ముందు కొస్తున్నారు. సాధారణంగా వారు ఉచితంగా కాయ కష్టం చేసి తద్వారా సహాయం చేస్తూవుంటారు. ఒక్కొక్కప్పుడు రాళ్ళు, ఇసుక మొదలైన వాటిని



అరకు కాలనీలో ప్రభుత్వ ఆసుపత్రి

కూడా సరఫరా చేస్తూ వుంటారు. పథకాలకు అవసరమైన స్థలాలను కూడా వారు విరాళంగా ఇస్తున్నారు. వివిధ పథకాలకు వారు చేసిన సహాయం ఈ దిగువ వివరింపబడింది :-

జాతీయ విస్తరణ సేవా కేంద్రం (యన్. ఇ. యస్. బ్లాకు) లో 1956 సెప్టెంబరు వరకు చేయబడిన సహాయం—

| నెల | రూ. |
|---|---|
| అక్టోబరు, 1956 | 1083 |
| నవంబరు, 1956 | 866 |
| డిశంబరు, 1956 | 619 |
| జనవరి, 1957 | 2997 |
| ఫిబ్రవరి, 1957 | 2498 |
| మార్చి, 1957 | 4518 |
| ఏప్రిల్, 1957 | 400 |
| మే, 1957 | 3850 |
| జూన్, 1957 | 2139 |
| జులై, 1957 | 3495 |
| ఆగస్టు, 1957 | 936 |

## కేటాయింపు, ఖర్చు వివరాలు

| క్రమ సంఖ్య. | మొత్తం కార్యక్రమంలో ఆమోదింపబడిన పద్దు | పథక కాలానికి మంజూరు చేయబడిన మొత్తం | 1-4-'56 నుంచి 31-3-'58 వరకు కేటాయింపబడిన మొత్తం | 1-4-'56 నుంచి 25-9-'57 వరకు అయిన వ్యయం | శేషము |
|---|---|---|---|---|---|
| | | రూ. | రూ. | రూ. | రూ. |
| 1. | ప్రాజెక్టు ప్రధాన కేంద్రం | 788000 | 281078 | 125374 | 155704 |
| 2. | అ. వ్యవసాయం | 72000 | 19962 | 10807 | 6065 |
| | ఆ. పశు సంరక్షణ | 77110 | 26540 | 8405 | 18135 |
| 3. | నీటి పారుదల, భూ పరిరక్షణ, భూములను సాగుకు లాయకు చేయడం | 400000 | | | |
| 4. | ఆరోగ్యం, గ్రామీణ పారిశుధ్యం | 200000 | 86125 | 21398 | 64727 |
| 5. | విద్య | 75000 | 41080 | 3221 | 3785 |
| 6. | సాంఘిక విద్య | 75000 | 40577 | 11239 | 29740 |
| 7. | రాక పోకలు | 400000 | 186661 | 36938 | 149723 |
| 8. | గ్రామీణ చేతి పరిశ్రమలు | 200000 | 109389 | 8721 | 1026227 |
| 9. | సహకారం | 200000 | 122000 | | 122000 |
| 10. | గ్రామీణ గృహవసతి | 217000 | 18750 | | 18750 |
| 11. | వివిధములు | 50000 | | | |
| | వెరశి మొత్తం | 2700000 | 932563 | 324233 | 708330 |

## మట్టి పాత్రల శిక్షణ కేంద్రం

ఈ ప్రాంతంలో శ్రేష్ఠమైన బంక మన్ను లభిస్తుంది. కాని మట్టి పాత్రలను తయారు చేసే కుటుంబాల సంఖ్య 20 మాత్రమే. వీరుకూడా దీనిని ప్రధాన వృత్తిగా పెట్టుకోరు. వ్యవసాయం చేసుకొంటూ అప్పుడప్పుడు ఈ వృత్తిని అవలంబిస్తారు. అందుచేత ఆ ప్రాంతానికి కావలసిన పాత్రలను వారు అందించ జాలరు. బ్లాకు ప్రాంతం వెలుపలి కుమ్మరి వారు కుండలను, ఇతర మట్టి పాత్రలను సంతలకు తీసుకెళ్ళి అమ్ముతూవుంటారు. అందుచేత స్థానికంగా లభించే బంక మన్నును వినియోగించుకొని స్థానిక పనివారలు మంచి ఆదాయం పొందే విధంగా వారికి శిక్షణ ఇవ్వడం మంచిదని భావింపబడింది.

అరకులోయలో 7-3-1956 తేదీన మట్టిపాత్రల శిక్షణ కేంద్రం ప్రారంభింపబడింది. వివిధ గ్రామాల నుంచి 15 మంది అభ్యర్థులను ఎన్నికచేసి వారికి ఒక సంవత్సరం పాటు శిక్షణ ఇవ్వబడింది. కుండలు, ధాన్యం నిలువ చేసే గరిసెలు, బానలు, పొయ్యిలు, త్రాగే నీళ్ళుపోసుకొనే అందమైన పాత్రలు (వాటికి తిప్పేపంపు కూడా వుంటుంది), జాడీలు, చిన్న బొమ్మలు మొదలగు వాటిని చేసే విధానం అభ్యర్థులకు నేర్పబడుతుంది. వారికి రంగులు వేయడం, నగిషీపని కూడా నేర్పబడుతుంది.

1-5-1957 తేదీనుంచి 12 మందిగల మరొక జట్టుకు శిక్షణ ఇవ్వ బడుతున్నది. గత సంవత్సరం ఈ శిక్షణ తరగతులలో చేరడానికి వెనకా ముందాడిన కుమ్మరి పనివారు ఈ సంవత్సరంచేరి ఎంతో లాభపడ్డారు. ఈ సంవత్సరం నలుగురు శిక్షణ పొందడానికి వొచ్చారు.

ఆంధ్రప్రదేశ్ ప్లానింగ్ మంత్రి ఈయేడు జూన్ నెలలో ఈ కేంద్రాన్ని సందర్శించి, అభ్యర్థులకు



అరకు గ్రామంలోని గిరిజనులకు చిన్న మొత్తాల పొదుపు ఉద్యమం వివరించి చెప్పబడుతున్నది.



*అరకు కాలనీలో గిరిజన బాలికలు చదువు నేర్చుకుంటున్నారు.*

ఇటుకలు, పెంకులు చేయడం నేర్పడం మంచిదని, ఇప్పుడనేక నిర్మాణాలు తలపెట్టబడు తున్నవి గనుక వాటి అవసరం ఎక్కువగా వుందనీ అన్నారు. అందు చేత ప్రస్తుత జట్టుకు ఇటుకలు, పెంకులు చేయడం కూడా నేర్పబడు తున్నది.

### బహుళార్థ సాధక సహకారసంఘం

గిరిజనుల సంక్షేమంకోరకై బహుళార్థ సాధక పైలట్ ప్రాజెక్టువారు కేంద్ర ప్రతిపాదిత పథకంగా ఈ సంఘాన్ని వ్యవస్థీకరించారు. ఈ సంఘం పనిని 1957 ఫిబ్రవరి 5వ తేదీన సహకార సంఘాల డిప్యూటీ రిజిస్ట్రారు శ్రీ పి. శ్రీరాములు ప్రారంభింప జేశారు.

ఈ సహకార సంఘం మేనేజిమెంటు సహకార శాఖ సీనియర్ ఇనస్పెక్టర్‌కు అప్పగించ బడింది. సంఘం మేనేజింగ్ కమిటీలో 7గురు సభ్యులున్నారు. వారిలో ముగ్గురు గిరిజనులు. మిగిలినవారు గిరిజనాభ్యున్నతికై కృషి చేస్తున్న ఉద్యోగులు. సహకార సంఘాల సీనియర్ ఇనస్పెక్టర్, కమిటీకి ఎక్సు అఫీషియో కార్యదర్శిగా వ్యవహరిస్తాడు.

ఈ సంఘం ఏర్పాటై ఇప్పటికి 9 నెలలయింది. ప్రస్తుతం దీని సభ్యత్వం 756. దీనికి చెల్లింపబడిన వాటా మూలధనం రూ. 3,619 (1957 అక్టోబరు 31 తేదీవరకు). ఈ సంఘం రిజర్వునిధికి మూల ధనానికి, పేదలైన గిరిజనులకు వాటా మూల ధనానికీ కేంద్ర ప్రభుత్వం రూ 6,000 ల సబ్సిడీ ఇచ్చింది.

పేదలైన గిరిజనులకు తక్కువ వడ్డీపై అప్పులివ్వడం, కిరసనాయిలు, ఉప్పు, అగ్గిపెట్టెలు, వస్త్రాలు మొదలగు జీవితావసరవస్తువులను చౌకధరలకు లభింప జేయడం, వారి వ్యవసాయోత్పత్తులు తగు ధరలకు అమ్ముడుబోయ్యే అవకాశాలను కల్పించడం, ఆ విషయంలో గిరిజనుల ఏజంటుగా సంఘం

వ్యవహారించడం——ఇవి ఈ సహకార సంఘం ప్రధాన లక్ష్యాలు.

సంఘంయొక్క ప్రథమ లక్ష్యం రూ. 200లకు మించిపోయింది. రూ. 11,500లు గిరిజనులకు అప్పులుగా ఇవ్వబడ్డవి. జీవితావసర వస్తువుల సరఫరా లక్ష్యంకూడా పూర్తిచేయ బడింది. డిశంబరు నెలాఖరులో పంటకోతలు జరుగుతవి. అప్పుడు గిరిజనుల వ్యవసాయోత్పత్తులకు మార్కెటింగ్ సౌకర్యాలు కల్పించ బడుతాయి.

విరివిగా ప్రచారం, గిరిజనుల కష్టనిష్టురాల విచారణ, వారి సమస్యల పరిష్కారానికి తగు విధంగా సహాయం చేయడం—ఈ పనులవల్ల సహకార సంఘం గిరిజనుల జీవన స్థాయిని పెంచ గలుగుతుంది.

## ప్రభుత్వ ఆసుపత్రి

అరకు లోయలోని ప్రభుత్వ ఆసుపత్రి ప్రస్తుతం తాత్కాలిక భవనంలో పెట్టబడివుంది. మూడు షెడ్లు వున్నవి. ఒక్కొక్క షెడ్డులో నాలుగు గదులున్నవి. ఒక షెడ్డు రోగుల పరీక్షలకు, మందులివ్వడానికీ, స్టోర్సుకూ, ఆపరేషనులకూ ఉపయోగింపబడుతున్నది. గిరిజన ప్రాంతంలో ఈ ఒక్క ఆసుపత్రిలోనే రోగులు నివసిస్తూ చికిత్సపొందడానికి సౌకర్యమున్నది. ఇందులో 25 మంచాలున్నవి. 13 మగవాళ్ళకు, 12 స్త్రీలకూ, పిల్లలకూ కేటాయింపబడినవి. ప్రసూతివిభాగంలో కాన్పులకు ప్రత్యేకంగా గదివుంది. అందులో రెండు మంచాలున్నవి. ఈ ఆసుపత్రి చిన్న కొండపై ఆరోగ్య కరమైన ప్రశాంత పరిసరాలలో వుంది.

పరిసర ప్రాంతాలనుంచి ప్రతిరోజూ 70, 80 మంది రోగులువచ్చి చికిత్స పొందుతూ వుంటారు. ఆసుపత్రిలోవుండి చికిత్సపొందేవారు సగటునరోజూ





అరకులోయలోని ప్రభుత్వ ఫలవృక్షక్షేత్రంలో జామచెట్లపై ఏయిర్ లేయరింగు పద్ధతిప్రకారం అంట్లు తయారు చేయడం.



*అరకు కాలనీలోని పాఠశాలలో చదువు నేర్చుకుంటున్న పిల్లలు.*

20, 24 మంది వుంటారు. వారికి ఆహారం, వస్త్రాలు ఉచిత రీతిగా ఇవ్వబడుతాయి.

ఈ సంవత్సరం విశాఖపట్నం రెడ్ క్రాస్ సొసైటీవారు వెచ్చటి కంబళ్ళను, ఉన్ని దుస్తులను ఇతర ఉపకరణములను ప్రసూతి విభాగానికి ఇచ్చి సహాయ పడ్డారు. లెడ్డర్లే లెబరేటరీస్ వారు రూ 300ల విలువగల మందులిచ్చారు. ఇవి ఆసుపత్రిలో నివసించే రోగులకు ఉపయోగ పడుతవి. ఈ ఆసుపత్రిలో ఆధునికమైన ఔషధములు, పరికరాలు సమకూర్చబడి వున్నవి. ఆధునిక పద్ధతుల ప్రకారం చికిత్సకు అన్ని సదుపాయాలు ఇందులో వున్నవి.

## భూసార పరిరక్షణ

అరకులోయలో 4200 ఎకరాల భూమిని సాగు కులాయకు చేయడానికై ఒక పథకం తలపెట్టబడింది. ఈ పథకానికి 17-5-1956 తేదీన రెవిన్యూ శాఖ మంజూరీ ఇచ్చింది. పథకం ఉద్దేశాలు ఇవి :-

1. ఈ లోయలో భూమి ఏటవాలుగా వుండడంచేత భూమి తరచు కోసుకుపోతూ వుంటుంది. అలా కోసుకుపోకుండా నిరోధించడం.
2. పొలాలలో కట్టలు వేయడంద్వారా భూమి కోతను నిరోధించి వ్యవసాయాన్ని కట్టుదిట్టం చేయడం. ప్రస్తుత భూములు కోతవల్ల సరిగా పండవు గనుక గిరిజనులు వాటిని వొదిలేసి తరచు పోడు వ్యవసాయంచేస్తూ వుంటారు. అట్టి పోడు వ్యవసాయాన్ని స్థిరవ్యవసాయంగా చేయడానికై కాలువలు ఏర్పాటు చేయడం.
3. జోలాపుట్ రిజర్వాయరు మేట వేసుకు పోకుండా నిరోధించడం.

ఈ పథకానికి రూ 6.55 లక్షలుఖర్చు అవుతాయని అంచెనా. దీనిని వ్యవసాయ విద్యుచ్ఛక్తి శాఖలు ఉమ్మడిగా అమలు జరుపుతాయి. పొలాలలో కట్టలు

వేయడం, కాలువలు ఏర్పాటు చేయడంవంటి భూమి, క్షోతనిరోధక పనులను రూ 4.55 లక్షల ఖర్చుతో వ్యవసాయశాఖ నిర్వహిస్తుంది. పాహేలగడ్డ నది ఒడ్లను కాపాడడానికై అంచులపై వనములను పెంచడం. వాకలుదున్నడం వంటి ఇంజనీరింగు సంబంధమైన పనులను రూ 1.99 లక్షల ఖర్చుతో విద్యుచ్ఛక్తిశాఖ నిర్వహిస్తుంది. ఈ పనులు ఇప్పుడు అమలు జరుగుతున్నవి.

## గ్రుడ్లను పొదిగించే కేంద్రం

కోళ్ళ పెంపకం విషయంలో జిల్లాయొక్క అవసరాలను తీర్చడానికై ఈ కేంద్రం 4 కోడిపుంజు



అరకు గ్రామంలోని సంతకు వచ్చిన గిరిజనుడు



అరకు లోయలో ప్రభుత్వ ఫలవృక్ష క్షేత్రం

వ్యక్తి మలేరియా వ్యాధివల్ల బాధపడుతూవుండే వాడు. కాని మలేరియా నిరోధక సిబ్బంది నిర్విరామ కృషివల్ల అరకులోయ, దాని పరిసర ప్రాంతాలు మైదానప్రాంతాల వలెనే ఆరోగ్యవంతమైనవి. స్థానిక జనం ఆరోగ్యవంతులైనారు. కష్టించి పని చేయగలుగుతున్నారు. ఇప్పుడు వారి జీవన ప్రమాణం హెచ్చింది. ఈ పథకం ముఖ్యంగా మలేరియా వ్యాధిని నిరోధించడానికే ఉద్దేశింప బడినప్పటికీ, ఈగలు, నల్లులు, దోమల సంహారానికి కూడా కృషి చేస్తున్నది. ఇందువల్ల పశువులు కాపాడబడుతున్నవి. ఇదికూడా రైతులకు ఒక విధంగా మేలు కలుగ జేస్తున్నది.

## పట్టు పరిశ్రమ

1947 సంవత్సరంలో వ్యవసాయ శాఖ 1.20 ఎకరాలలో మల్బరీ చెట్లు వేసి పట్టు పురుగులను పెంచ నారంభించింది. ఆ కృషి ఫలదాయకమని తేలింది. 1948లో ఈ పరిశ్రమ పరిశ్రమల శాఖపరం చేయబడింది. భూమిని బట్టి, శీతోష్ణ పరిస్థితిని బట్టి ఈ లోయ పట్టు పరిశ్రమకు అనువైనది.

## క్షేత్ర ఫలితాలు

1949 సంవత్సరం నుంచి ఇంతవరకు సాధింప బడిన ఫలితాలు ఇవి:—

## క్షేత్ర వైశాల్యం : 1.20 ఎకరాలు

| సంవత్సరం | ఉత్పత్తి ఆకుల పరిమాణం (పౌనులు) | పురుగుల గ్రుడ్ల అండములు | ఉత్పత్తి పట్టుకాయల పరిమాణం (పౌనులు) |
|---|---|---|---|
| 1949-50 | 1676 | 148 | 38 |
| 1950-51 | 2596 | 300 | 117 |
| 1951-52 | 2150 | 175 | 105 |
| 1952-53 | 5500 | 473 | 234 |
| 1953-54 | 5256 | 460 | 300 |
| 1954-55 | 5360 | 584 | 257 |
| 1955-56 | 5593 | 510 | 280 |
| 1956-57 | 8362 | 800 | 541 |
| 1-4-1957నుంచి 30-9-1957 వరకు | --- | 435 | 285 |

### విస్తృతీకరణ

అయితే 1.20 ఎకరాల క్షేత్రం ఈ పరిశ్రమకు చాలదని భావింప బడింది. అందుచేత పోషణ శాలకు ఎదురుగా 4.68 ఎకరాల భూమిని తీసుకొని అందులో 1955-56 సంవత్సరంలో 3 ఎకరాలలో మల్బరీ చెట్లు నాటబడ్డవి. ఇందువల్ల ఎక్కువ పట్టు పురుగు కాయలను పెంచడానికి వీలయినది.

క్షేత్రంలోని పట్టు పురుగు కాయలనుకోసి, సిల్కునూలును మిగిలిన చెదారమును హిందూపురం పంపడ మవుతుంది. అక్కడినుంచి వాటిని బెంగుళూరు వర్తకులకు అమ్మివేస్తారు.

తమ భూములలో మల్బరీ చెట్లను పెంచవలసిందని తమ ఇండ్లలో పట్టు పురుగులను పెంచవలసిందనీ గిరిజనులు ప్రోత్సహింప బడుతున్నారు. ఇది వారికి అదనపు వృత్తిగా ఉపకరిస్తుంది. ఇంత వరకు ఎనిమిది గ్రామాలలోని 25 మంది రైతులు మొత్తం 26 ఎకరాల భూమిలో మల్బరీ చెట్లను పెంచుతున్నారు.

### అంజోడలో పట్టుపరిశ్రమ

అరకులోయకు నాలుగుమైళ్ళ దూరంలోవున్న అంజోడలో 100 ఎకరాలలో మల్బరీ చెట్లను పెంచ వలెనని తలపెట్ట బడింది. ఇంతవరకు 10 ఎకరాలలో చెట్లు నాటబడ్డవి. పట్టు పురుగులను పెంచడానికి పట్టు పురుగు కాయలనుంచి పట్టునూలునుతీసి చుట్టలుగా చుట్టడానికీ భవనం కట్టవలెననీ, ఈ కృషిని ప్రైవేటు రంగంలోకూడా విస్తృతంగా జరిపించవలెననీ తలపెట్ట బడింది.

### చినలబుడులో బహుముఖ కార్యక్రమాలు

అరకులోయనుంచి ఈ గ్రామం మూడుమైళ్ళ దూరంలోవుంది. బహుళార్థ సాధక ప్రాజెక్టు కార్యక్రమంక్రింద మొత్తం పది పాఠశాలలు తెరువ బడినవి. వాటిలో చినలబుడు ఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాల ఒకటి. 1956 జూన్ 1వ తేదీన 20 మంది గిరిజన బాలురతో ఈ పాఠశాల ప్రారంభింప బడింది. వారంతా కోటియ, దొంబు, పరజ, కబాడీ కులాలకు చెందినవారు. ఏడాదిలోనే పాఠశాలలో పిల్లలసంఖ్య 60 అయింది. వారిలో 44 మంది బాలురు. 16 మంది బాలికలు. వారంతా ఒకమైలు దూరంలోవున్న గ్రామాలనుంచి వొచ్చి చదువు నేర్చుకుంటున్నారు.

ఈ పాఠశాలయొక్క మరొక విశేషమేమిటంటే పిల్లల హాజరీ సగటున 24 వుంటుంది. గ్రామస్తులు పాఠశాల భవనం నిర్మించారు. పిల్లలు ఆడుకోవడానికి ఆటస్థలాన్నికూడా వుంచారు. ఆ తరువాత "విద్య, సాంఘికవిద్య" నిధినుంచి ఈదిగువ వస్తువులు పాఠశాలకు సప్లయి చేయబడ్డవి.

కంట్రిబ్యూషన్ పద్ధతిపై పాఠశాల పిల్లలందరికీ దుస్తులు సప్లయి చేయబడుతాయి.

వ్యవసాయదారుల సంఘమొకటి ఏర్పాటు చేయబడింది. ఆ సంఘంద్వారా గ్రామంలో అభివృద్ధి కార్యక్రమాలు అమలుజరుప బడినవి.

మహిళాసమితి ఒకటి స్థాపించబడింది. ఈ సమితి అల్లకం, కుట్టుపని, విస్తళ్ళు కుట్టడం మొదలగు పనులను నిర్వహిస్తూ వుంటుంది. బ్లాకు నిధులనుంచి ఒక కుట్టుమిషను, తదితర పరికరాలు సప్లయి చేయ బడినవి. మహిళాసమితి కార్యక్రమాలను సువ్యవ

స్థితం చేయడానికై గ్రామస్తులు ఒక ఇల్లు కట్టించారు.

స్త్రీ పురుషులకు వయోజన పాఠశాలలు తెరువబడినవి. వాటికి ప్రతిరోజు సగటున 20 మందివచ్చి చదువు నేర్చు కుంటున్నారు.

వ్యవసాయదారుల సంఘం సహకారంతోను, శిక్షణపొందిన గ్రామనాయకుల తోడ్పాటుతోనూ ఈ గ్రామంలో దిగువ కార్యక్రమాలు చేపట్టబడినవి:-

1. కాఫీతోటలు వేయడం. 2. చెరకుపైరు వేయడం. 3. కేబేజి,బీట్ రూట్, టర్నిప్, నోల్ ఖోల్ కోసుపూవువంటిఇంగ్లీషు కూరగాయలను తోటలలో పండించడం.

చాలా కాలంనుంచి ఈ గ్రామంలో విత్తనాలు చల్లి వరిపైరు పండించడం రివాజుగావుంది. ఇప్పుడు దానికి బదులుగా జపాను పద్ధతి వరిసేద్యం ప్రవేశ పెట్టబడింది. ఇందుకు గత సంవత్సరమే ప్రదర్శన కొరకై ప్లాట్లు వేయబడ్డవి. ఇంతకు పూర్వం రైతులకు పచ్చిఆకు ఎరువు, కంపోస్టు ఎరువుల ప్రయోజనము, ఉపయోగము తెలియవు. ఇప్పుడు రైతులు వీటి ఉపయోగము తెలుసుకొన్నారు. గిరిజనులు పచ్చిఆకు ఎరువును పండించి పొలాలలో వేయడానికి పూనుకుంటున్నారు.

గ్రామంలో ప్రతిఇంటికి ఒక కంపోస్టు ఎరువు గుంట, ఒక పెరటితోట, పెరడులోనే ఫలవృక్షములు ఏర్పడు తున్నవి.

దేశవాళీ గొర్రెల నాణెమును పెంపొందింపజేయడానికై మాండ్యా పొట్టేళ్ళు స్థానికుల కివ్వబడినవి. తెల్లకోళ్ళు సప్లయిచేయ బడుతున్నవి. ఇప్పుడు గ్రామంలో దేశవాళీ కోడిపుంజు ఒక్కటి కూడా కనిపించదు

గ్రామస్తులందరూ కృషిచేసి గ్రామం వరకూ మూడు ఫర్లాంగుల అప్రోచ్ రోడ్డు వేసుకున్నారు. ఒక చబూతరా కూడా నిర్మింపబడింది.

పాఠశాలకు శాశ్వతమైన భవనమును నిర్మించేటందుకై వ్యవసాయదారుల సంఘం సభ్యులు రాళ్ళు, ఇసుక, తదితరసామగ్రి సేకరిస్తున్నారు. పాఠశాలకు పోయి చదువు కొనే వయస్సులోవున్న పిల్లలనందరినీ పాఠశాలకు పంపడానికీ, వయోజనులందరినీ వయోజన పాఠశాలకు పంపడానికీ వ్యవసాయ దారుల సంఘం కృషి చేస్తూవుంది. కొందరు గ్రామస్తులు సహకార సంఘంలో సభ్యులుగా చేరారు. కొన్ని ప్రైవేటు కక్కొసుదొడ్లు, మగస్ బొయ్యిలు ఏర్పాటు చేయబడినవి. ప్రతి వారం పారిశుధ్య కార్యక్రమం అమలు జరుపబడుతూవుంది. శిశువులకు స్నానం చేయించడం కూడా జరుగుతున్నది. మొత్తంపై ఈ గ్రామంలో వ్యవసాయదారుల సంఘం కృషివల్ల బహుముఖంగా కార్యక్రమాలు అమలు జరుగుతూవున్నవి. "సాంఘిక విద్యా కార్యక్రమం" క్రింద ఈ గ్రామం "పూర్తి కార్య క్రమ గ్రామం" అని చెప్పవచ్చు.

సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ వారు ఆశ్రమ పాఠశాలను స్థాపించారు. ఇది అరకులోయ నుంచి ఆరు మైళ్ళ దూరంలో వుంది. ఇందులో 50 మంది చదువు కుంటున్నారు. భోజన వసతి సదుపాయాలు కూడా ఇక్కడ సమ కూర్చబడినవి. ఈ పాఠశాల 3-4-1956 తేదీన ప్రారంభించబడింది. వసతి గృహం 3-6-1956 తేదీన తెరువబడింది. సిబ్బంది జీతాలు కూడా కలుపు కొని మొత్తం నెలసరి ఖర్చు రూ 850లు అవుతూన్నది. పెరటి తోటల పెంపకం, ఉద్యాన కృషి, మల్బరీ తోటల పెంపకం ఇక్కడి ఇతర వ్యాపకాలు.

గ్రామ సేవకుడు వుండేప్రతి ప్రధాన కేంద్రంలో పై పద్ధతుల ప్రకారం ఒక్కొక్క గ్రామాన్ని అభివృద్ధి పరచాలని కృషి చేయబడుతూవుంది.

## ప్రకృతి సౌందర్యం

అరకులోయలో 20 గ్రామాలున్నవి. లోయ పొడవు 8 మైళ్ళు, వెడల్పు 3 మైళ్ళు. ఈ లోయ సముద్రమట్టానికి 3,200 అడుగుల ఎత్తుపైవున్నది. అరకులోయకు వెళ్ళదలచుకున్నవారు విశాఖపట్నం నుంచి అయితే 7 మైళ్ళు, విజయనగరం నుంచి 60 మైళ్ళు బస్సుపై ప్రయాణం చేయవలసి వుంటుంది.

విశాఖపట్నం నుంచి అరకులోయకు ప్రయాణం ఒక మహత్తరమైన అనుభవం. దారి అంతా దట్టమైన అడవి, కొండలు, లోయలతో వుంటుంది.

అచ్చటచ్చటా సెలయేళ్ళు, జలపాతాలు కన్పిస్తాయి. వంపుసొంపులుగావుండే ఆ రోడ్డు పై బస్సు ఎత్తెక్కుతూపోతూవుంటే ఎంతో ఆనందంగా వుంటుంది. పొయ్యేకొద్దీ దృశ్యాలు మారుతూ వుంటాయి. ఒక చోట కొద్దిమాత్రపు అడవి, మరొక చోట కాఫీ, పలకుల తోటలు వుంటాయి. చల్లని గాలి వీస్తూ వుంటుంది. చలికాలం మరీచలిగా వుంటుంది. కనుక ప్రయాణీకులు ఏలి కోట్లు వేసుకోవలసి వస్తుంది.

ఇచటి ప్రకృతి సౌందర్యం ప్రయాణీకులకు మరపురాని అను భూతులను కలిగిస్తుంది.

అరకులోయలో ప్రయాణీకులు దర్శించ వలసిన స్థలాలు ఇవి:—

ప్రభుత్వ ఫలక్షేత్రం, ఇది 26 ఎకరాల తోట. ఇందులో నిమ్మ, నారింజ, జామ, ద్రాక్ష, అరటి, లీచి, మామిడి, అనాస, బొప్పాయి, దానిమ్మ, అనన్నాస్, బేరి, శప్తాలుపండు, ఆపిల్, మొదలగు పండ్లచెట్లున్నాయి. సంవత్సరం పొడుగునా కేబేజీ కోసుపువ్వు,నోల్ ఖోల్, కేరట్,బీట్ రూట్ మొదలగు ఇంగ్లీషు కూరగాయలు పండించ బడుతూవుంటాయి. ఈ తోటలో కాఫీ, సించోనా, పైరత్రం, యూక్లిప్టస్ మొదలగు సస్యములు కూడా వేయబడుతవి. కూలీజనం ఈ తోటలో పనిచేస్తూవుంటే ఆ దృశ్యం చూడ దగింది. ఆ కూలీలలో కొందరు తగు శిక్షణ పొందిన వారు వున్నారు.

## జిల్లా జలపాతం

ఈ జలపాతం ఇనస్పెక్షన్ బంగళాకు 2 మైళ్ళ దూరంలో వుంది. ప్రయాణీకులు జలపాతానికి వెళ్ళి అక్కడ ప్రకృతి సౌందర్యాన్ని చూచి హాయి అనుభవించవచ్చు.

వ్యవసాయశాఖ ఒక డేరీ (పాడికేంద్రం) నడుపుతున్నది: దాని ఉత్పత్తి రోజుకు 80 పౌనులు. ఇక్కడ ప్రయాణీకులకు పాలు, పెరుగు, కూరగాయలు సమృద్ధిగా లభిస్తాయి. ఇక్కడ మేలు జాతి పశువులు కన్పిస్తాయి. ఈ లోయలో సగటు వర్షపాతం 50 అంగుళాలు. మే, జూన్, జూలై, ఆగస్టు నెలల్లో వర్షం కురుస్తుంది. ప్రయాణీకులు ఈ లోయను దర్శించడానికి మే నెల నుంచి నవంబరు నెల వరకు అనువుగా వుంటుంది.

అరకులోయలో ఫిబ్రవరి నెలలో చలికాలం మొదలవుతుంది. ఆ తరువాత మే నెలాఖరు వరకు వాతావరణం ఆనందకరంగా వుంటుంది. ఈ కాలంలో ఆకాశం నిర్మలంగా వుంటుంది. పగళ్ళు సాధారణంగా చల్లగా వుంటాయి మార్చి, ఏప్రిల్ నెలల్లో మాత్రం పగలు ఎండలు తీవ్రంగా వుంటాయి.

## సంతలు

అరకులో ప్రతి శుక్రవారం, సుంకర మెట్టలో ప్రతి ఆదివారం సంత జరుగుతుంది. గిరిజనులు తాము అడవులలో సేకరించిన వాటిని ఆ సంతలకు తీసుకొచ్చి అమ్ముతారు. ఆ సంతలకు ఎక్కువగా అల్లం, చింతపండు, మిరపకాయలు, వలిసెనూనె గింజలు, పనస, కమలా ఫలాలు, ఇతర కూరగాయలు వొస్తాయి.

లోయ చుట్టూ వుండే పర్వత పంక్తి ఒక్కొక్క చోట ఒక్కొక్క ఎత్తున వుండి, చూడడానికెంతో రమణీయంగా కన్పిస్తుంది.

# ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా

ఆంధ్రప్రదేశ్‌లో రోడ్డు రవాణా క్రమేణా జాతీయం చేయవలెనని తలపెట్టబడింది. తెలంగాణాలో ఇది వరకే జాతీయం చేయబడింది. తెలంగాణాలో జాతీయం చేయబడిన రోడ్డు రవాణాకు ఇరవై అయిదు సంవత్సరాల చరిత్ర వుంది. 1932 లో ప్రభుత్వం 27 పెట్రోలు బస్సులతో ఇక్కడి రోడ్డు రవాణా సర్వీసును ఆరంభించింది. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సందర్భంలో హైద్రాబాదు రాష్ట్రం మూడు ప్రాంతాలుగా విడగొట్టబడింది. రాష్ట్ర విభజనతో పాటు బస్సు సర్వీసు కూడా మూడు భాగాలుగా విభజింప బడింది. అలా విభజింపబడే సమయానికి రోడ్డు రవాణా శాఖకు మొత్తం 775 బస్సులున్నవి. ఈ నాడు తెలంగాణాలో 576 బస్సులు, 28 లారీలు, టాంకర్లు వున్నవి. ప్రయాణీకులకు సౌకర్యాలు కల్పించే విషయంలో కూడా రవాణా శాఖ ఎంతో ప్రగతిని సాధించింది.

1956 నవంబరులో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ జరుగడంతో హైద్రాబాదు రాష్ట్ర రోడ్డురవాణా ఆంధ్రప్రదేశ్ రోడ్డురవాణాగా మారింది. హైద్రాబాదు రాష్ట్రపు జాతీయం చేయబడిన రోడ్డురవాణా సర్వీసు దాదాపు పాతిక శతాబ్దంనుంచి ప్రయాణీకులకు సేవ చేస్తూ వున్నది. కేవలం సేవద్వారానే ఈ సర్వీసు ఇచటి ప్రజల ఆదరాభిమానాలను చూరగొన్నది. ఈ ప్రాంతంలో రవాణా విషయమొచ్చే సరికి ఎవరినోట విన్నా ఆర్. టి. డి (రోడ్డుట్రాన్సుపోర్టు డిపార్టుమెంటు) అనే పేరే వినవస్తుంది. ఈ మూడక్షరాలు అందరి సుపరిచితమై పొయ్యాయి. జాతీయం చేయబడ్డ రోడ్డు రవాణా విషయంలో ఆంధ్రప్రదేశ్‌తో తులదూగగల రాష్ట్రాలు భారతదేశంలో బహుశా లేవేమో.

హైద్రాబాదులో ప్రభుత్వం అధ్వర్యాన రోడ్డురవాణా 1932 జూన్‌లో ఆరంభమైంది. మొదట ఈ సర్వీసు నిజాం రైల్వేశాఖ అధ్వర్యాన పనిచేస్తూ వుండేది. క్రమేణా ఈ సర్వీసు ప్రయాణీకులకు అత్యంతావశ్యకమైనదిగా పరిగణింప బడడమేగాక నిజాంస్టేట్ రైల్వేకూ, హైద్రాబాదు ప్రభుత్వానికిమంచి ఆదాయాన్నిచ్చే సంస్థగాకూడా అభివృద్ధి చెందింది.



హైద్రాబాదు నగరంలో నిజాంకాలేజీ ముందరి బస్సు షెల్టర్

## సాఫీగా జరిగినమార్పు

రోడ్డురవాణా శాఖను రూపొందించడంలో రైల్వే వారు మూడు లక్ష్యాలను దృష్టి యందుంచుకున్నారు. (1) ప్రజలకు అవసరమైన ప్రయాణ సౌకర్యాలను కలుగ జేయడం. అయితే లాభం ప్రధానంకాదు. (2) రోడ్డు రవాణాకూ, రైలురవాణాకూ పోటీలేకుండా చూడడం. (3) ప్రజలవద్దనుంచి, ప్రభుత్వం వద్దనుంచి ప్రైవేటు సంస్థలు లాభాలు పొందకుండా నివారించడం. ఈ

ఉద్యోగులతో హైద్రాబాదు రాష్ట్రప్రభుత్వం బస్సుల రవాణా జాతీయంచేసే తమ విధానాన్ని ప్రకటించడంతోనే ప్రైవేటు బస్సు యజమానులు ఆందోళన పడ్డారు. అయితే క్రమేపీ యదార్థాలను గమనించి వారంతటవారే ఎట్టి ప్రతిబంధకాలు కల్పించకుండా, ప్రభుత్వం బస్సురవాణాను స్వాధీన పరచుకోవడానికి ఎటువంటి ఆటంకాలూ పెట్టకుండా తమ వ్యవస్థలను రద్దు చేసుకొని జాతీయ కరణకు దోహదం చేశారు. ప్రైవేటు వ్యవస్థలను ప్రభుత్వం స్వాధీన పరచుకొనే సందర్భంలో రోడ్డుపై ఉపయోగింప దగిన బస్సులను, యంత్ర పరికరాలను మాత్రమే ప్రభుత్వం కొనడం జరిగింది. అంతేగాని ప్రైవేటు సంస్థలకు ఎట్టి పరిహారమూ ఇవ్వడం జరుగలేదు. కాకపోతే ప్రైవేటు ఆపరేటర్ల క్రింద పనిచేస్తున్న సిబ్బందిలో అర్హులైన వారిని, రోడ్డురవాణా శాఖలో ఉద్యోగం చేయదలచుకున్న వారిని ఉద్యోగాలలోకి తీసుకోవడమైంది. ఈ విధంగా ప్రభుత్వం ప్రైవేటు సంస్థల గుత్తాను స్వాధీన పరచుకోవడం ఎట్టి ఒడుదుడుకులు లేకుండా చాలా సాఫీగా జరిగిందని చెప్పడంలో అతిశయోక్తి ఏమీలేదు. పైగా బస్సు సర్వీసులను జాతీయం చేయాలన్న ప్రభుత్వ ప్రతిపాదనకు ప్రజామోదం వెంటనే లభించింది. ఎందుచేతనంటే ప్రైవేటు బస్సులకంటె జాతీయం చేయబడిన బస్సులు వేళ తప్పకుండా నడవడంలో, నమ్మకంగా ప్రయాణీకులకు సేవ చేయడంలో, సౌకర్యాల విషయంలో, చార్జీలవిషయంలో మంచిపేరు సంపాదించాయి. మొత్తం పైరేట్ల విషయంలోను, సర్వీసు విషయంలోను జాతీయం చేయబడ్డ బస్సులే మెరుగని ప్రజాభిప్రాయం వ్యక్తమైంది. సర్వీసు ప్రమాణం తప్పకుండా మెరుగని అంతా అన్నారు. బస్సులు పెద్దవి. బస్సుల డిజైను బాగావుంది. ప్రయాణీకులకు సీట్లు అవీ సౌకర్యవంతంగా వున్నవి. బస్సులను నడిపే విధానంకూడా బాగావుంది. బస్సుల ఇంజనులు దృఢమైనవి. ఎప్పుడుపడితే అప్పుడు ఆగిపోయేవికావు. డీసెల్‌నూనె ఇంజనులు. బస్సుల బాడీలు లోహంతో అందంగా, దృఢంగా నిర్మింప బడినవి. ప్రయాణీకులు సామానులు పెట్టుకోవడానికి తపాలా ఉత్తరాలకూ, బస్సు సిబ్బంది కూర్చోవడానికి చక్కగా అన్నీ అమర్చివున్న బస్సులు. బస్సులకు పెద్దగా మరమ్మతులు చేయవలసి వచ్చినా లేక ఓవర్ హాలింగు చేయవలసి వచ్చినా హైద్రాబాదులో పెద్ద సెంట్రల్ డిపోవుంది. అక్కడికే బస్సులు పంపబడేవి. సెంట్రల్ డిపోగాక, జిల్లాలలో అక్కడక్కడా బస్సు డిపోలున్నవి. వాటిలో బస్సులకు చిన్నపాటి మరమ్మతులవీ చేయడం, మామూలుగా బస్సులను శుభ్రపరచడం ఇత్యాదివి జరుగుతూ వుంటాయి. బస్సుల టైంటేబిల్పు ప్రకటించబడటం మొదలైంది. ఆ టైములప్రకారం బస్సులు నడుస్తున్నాయి. ప్రయాణికులను వేళకు రైళ్ళ కందించడంకూడా మొదలైంది. రాష్ట్రంలో రైల్వేకూ, రోడ్డు సర్వీసుకూ చక్కని సహకారమున్నది. రైలుద్వారా రోడ్డుద్వారా సమిష్టిగా కోరినవారికి ప్రయాణాలు ఏర్పాటు చేయబడేవి. వీటన్నిటివల్ల ఆర్. టి. డి సర్వీసు ప్రజలకెంతో సౌకర్యవంతంగా అమరి పోయింది. అంతేగాకుండా లాభాలు లేవని చెప్పి ప్రైవేటు సంస్థలు వొదిలి పెట్టేటువంటి రూట్ల సర్వీసులనుకూడా జాతీయం చేయబడ్డ రోడ్డు రవాణాశాఖ చేపట్టింది. దీనివల్ల రైల్వేకుకూడా ప్రయోజనమే కలిగింది. రాష్ట్రంలో అన్ని ప్రాంతాలకూ తరతమ విభేదంలేకుండా బస్సు ప్రయాణ సౌకర్యం కలిగింది.

## రైల్వేనుంచి రోడ్డురవాణా విభజన

మొదట మొదట ఈ రోడ్డు రవాణా సర్వీసును నిజాంస్టేట్ రైల్వేయొక్క కమర్షియల్ డిపార్టుమెంటు నిర్వహిస్తూ ఉండేది. ఆ డిపార్టుమెంటుకు అధిపతి చీఫ్ కమర్షియల్ మేనేజరు. ఆయన క్రింద డిస్ట్రిక్టు ట్రాఫిక్ సూపరింటెండెంట్ వుండేవాడు. ఆయన ఈ రోడ్డు రవాణాకు సంబంధించిన అధికారి. 1932 నుంచి 1936 వరకు రోడ్డురవాణా ప్రయోగ చర్యగానేవుంది. 1936 లో మొట్టమొదటసారిగా పెద్ద పెట్టున విస్తృతీకరణ జరిగింది. రోడ్డురవాణా వ్యవస్థ నిజాంస్టేట్ రైల్వేకు ఒక శాఖగా అభివృద్ధి చెందింది. రైల్వేయొక్క



మార్గమధ్యంలో బస్సుషెల్టర్

## జాతీయం చేయబడిన రోడ్డు రవాణా సర్వీసులు

ఉద్యోగుల సంఖ్యను తెలిపే గ్రాఫ్ పటము.




ఇతర డిపార్టుమెంటుల వలెనే రోడ్డురవాణా డిపార్టు మెంటుకూడా పనిచేయ నారంభించింది. నిజాంస్టేట్ రైల్వేయొక్క జనరల్ మేనేజరు, స్టేట్ రైల్వేబోర్డు ఈ శాఖపై పర్యవేక్షణచేస్తూ వుండేవారు ఇలా కొంతకాలం ఈ రోడ్డురవాణాశాఖ పనిచేసింది. ఆ తరువాత 1950 ఏప్రిల్ 1వ తేదీన ఇది రైల్వేనుంచి విడదీయ బడింది. ఇందుకు కారణం అప్పుడు దేశంలో రాజ్యాంగ విషయకంగా కొన్నిమార్పులు వొచ్చాయి. ఫెడరల్ ఫైనాన్షియల్ ఇంటెగ్రేటెడ్ స్కీము ననుసరించి కేంద్ర ప్రభుత్వానికి సంబంధించిన వ్యవహారాలను కేంద్రప్రభుత్వం స్వాధీన పరచుకొన్నది. వాటిలో రైల్వే ఒకటి. కాని రోడ్డురవాణా రాష్ట్ర ప్రభుత్వానికి సంబంధించింది. అందుచేత దీనిని రైల్వేనుంచి విడదీయ అవసరమైంది. అయినా కొంతకాలంపాటు ఇండి రైల్వేయే ఈ సంస్థను ఏజన్సీ పద్ధతిపై నిర్వహించి టోనసైజేషన్ స్కీము ప్రకారం నిజాంస్టేట్ రై సెంట్రల్ రైల్వేలో చేరిపోవడంతో 1 11 1951 తేదీను రోడ్డురవాణాశాఖ యాజమాన్యాన్ని హైదరాబా ప్రభుత్వం స్వీకరించింది. 1950 సంవత్సరపు రో రవాణా కార్పొరేషనుల చట్టము ననుసరించి ఏర్పా ఒక రోడ్డు ట్రాన్సుపోర్టు కార్పొరేషన్ ద్వారా దీ నడుపడమే హైదరాబాదు ప్రభుత్వం లక్ష్యంగా పె కుంది ఈ నిర్ణయము ననుసరించే కొత్తగా ఏర్పాటై రోడ్డు ట్రాన్సుపోర్టు కార్పొరేషన్ క్రింద య

పూర్వపు షరతుల ప్రకారం ఇకముందుకూడా తనుతను ఉద్యోగాలు చేసుకోవలసిందనీ, లేదా రిటైర్‌మెంట్ పూర్తి లాభాలతో పింఛను పుచ్చుకోవలసిందనీ, ఈ రెండిటిలో ఏది చేయవలసిందీ వారే నిర్ణయించుకోవాలనీ ఉద్యోగులకు తెలియజేయబడింది

అయితే ఒక కార్పొరేషన్ ద్వారా రోడ్డురవాణాను నడిపించాలన్న హైద్రాబాదు ప్రభుత్వ సంకల్పం నెరవేరలేదు. ఫలితంగా ఈ వ్యవస్థ హైద్రాబాదు ప్రభుత్వంలో ఒక శాఖగా ఏర్పాటైంది. దాని పేరు రోడ్డుట్రాన్స్‌పోర్టు డిపార్టుమెంటు (రోడ్డురవాణాశాఖ ఆర్. టి. డి.) ప్రభుత్వ నియమనిబంధనలన్నీ, ఈ శాఖకుకూడా వర్తింపచేయబడ్డవి. అయితే ఇది కేవలం ప్రభుత్వ శాఖగా వ్యవహరిస్తూ పనిచేయడం సంతృప్తికరంగా లేదన్న విషయం త్వరలోనే గుర్తింపబడింది. అందుచేత రాష్ట్ర రవాణా కార్పొరేషనులు ఎలా పనిచేస్తున్నదీ తెలుసుకోవడానికి ప్రయత్నాలు చేయబడ్డవి. ఆర్. టి. డి. ప్రభుత్వ శాఖగా వుండడం బాగాలేదని అనుభవంమీద తెలియవచ్చింది. రోడ్డు ట్రాన్సుపోర్టు కార్పొరేషనును నెలకొల్పడంకన్న ప్రభుత్వంతో ప్రత్యక్ష సంబంధంలేని ఒక స్వతంత్ర వ్యవస్థగా దీన్ని రూపొందించడం మంచిదని భావింపబడింది. కనుకనే ఆర్థిక వ్యవహారాలను చూచేందుకు ఒక రోడ్డురవాణా సలహాసంఘం ఏర్పాటు చేయబడింది. ఈ సంఘం (బోర్డు) 1954 మేలో ఏర్పాటైంది.

## జాతీయం చేయబడిన రోడ్డు రవాణా సర్వీసులు

పైసాలలో ఒక్కొక్క మైలుకు లభించే వెరసి ఆదాయాన్ని సూచించే గ్రాఫ్ పటము




ఆర్థిక సంవత్సరాలు,

యస్. యస్. హెచ్. జాఫరిచే తయారు చేయబడినది



సంగారెడ్డి బస్సు షెల్టర్

ఈ సంఘం వల్లకూడా ఆశించినంత ఫలితం కలుగదనీ, చివరకు 1950 సంవత్సరపు రోడ్డు రవాణా కార్పొరేషనుల చట్టము ననుసరించి పనిచేసే కార్పొరేషను మాత్రమే ఈ వ్యవస్థను చక్కగా నిర్వహించగలదని ప్రభుత్వం అభిప్రాయపడింది. అయితే ఈ అభిప్రాయం ప్రకారం ప్రభుత్వం వ్యవహరించ జాలక పోయింది. కారణ మేమంటే అంతలో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం నివేదిక వచ్చింది. ఆ నివేదికలో హైద్రాబాదు రాష్ట్రాన్ని విభజించాలని సిఫారసు చేయబడింది. దాని వల్ల ఆర్. టి. డి. ని కూడా మూడు భాగాలుగా విభజించవలసివచ్చింది. హైద్రాబాదు రాష్ట్ర విభజనవల్ల మిగిలిన తెలంగాణా ప్రాంతాన్ని ఆంధ్రలో కలిపి వేయనుండడం చేత కొత్త మార్పేమీ చేయకుండా పరిస్థితిని యధా తథంగా వుంచి, నూతన్నంగా ఏర్పడ బోయ్యే ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వానికే నిర్ణయాన్ని వదలి పెట్టాలని ప్రభుత్వం అభిప్రాయ పడింది. 1954 మే లో ఏర్పాటు చేయబడిన సలహా సంఘం 1956 నవంబరులో రద్దు చేయబడింది. అంటే హైదాబాదు రాష్ట్ర విభజనతో సంఘం కూడా రద్దు అయిందన్న మాట. ప్రస్తుతం ఆర్. టి. డి. శాఖ ఆంధ్రప్రదేశ ప్రభుత్వపు శాఖ క్రిందవున్నది. కార్పొరేషను ఏర్పాటుకు ప్రయత్నాలు జరగవలసివున్నవి.

## బస్సుల సంఖ్య హెచ్చింపు

1932 లో జాతీయం చేయబడిన బస్సులు నడవడం ఆరంభమైనప్పుడు వున్న బస్సులు మొత్తం 27. అవి అల్బియన్ బస్సులు. పెట్రోలుతో నడిచేవి. ఒక్కొక్క బస్సులో 25 మంది ప్రయాణీకులు కూర్చోవడానికి వీలుండేది. క్రమంగా బస్సుల సంఖ్య హెచ్చింపబడింది. పెట్రోలుకు బదులుగా డీసెల్ నూనె వాడకంలోకి తేబడింది. 1936 లో ఈ విస్తృతీ కరణ పెద్ద పెట్టున జరిగింది. అప్పుడు 254 ప్యాసింజర్ బస్సులు వేయబడ్డవి. 1939 లో బస్సుల సంఖ్య 384కు హెచ్చింది. లారీల సంఖ్య 80. అయితే 1939 లో రెండవ ప్రపంచయుద్ధం ఆరంభం కావడంతో ప్రయాణీకుల బస్సు సర్వీసులను విస్తృతీ కరించడానికి ఆటంక మేర్పడింది. అయితే ఆ యుద్ధం వొచ్చేసరికి ఆహారధాన్యాలను సమర్థవంతంగా, సకాలానికి ప్రజలకు అందజేయవలసిన బాధ్యత ప్రభుత్వం పై పడింది. అందువల్ల ఆహారధాన్యాల రవాణా కోసం లారీల సంఖ్య 237కు హెచ్చింపబడింది. యుద్ధం ముగియగానే పాత బస్సులను పూర్తిగా తొలగించి వాటికి బదులు కొత్త బస్సులను వేసి, సీట్ల సంఖ్యను పెంచవలెనని పథకాలు వేయబడినవి. ఒక్కొక్క దానిలో 56 మంది కూర్చోనేటువంటి 30 డబుల్ డెక్ బస్సులు, ఒక్కొక్క దానిలో 36 మంది కూర్చోగల 100 సింగిల్ డెక్ బస్సులు కొనబడి 1946—47 లో సర్వీసులో ప్రవేశపెట్టబడ్డవి. కాని అంతలోనే రాష్ట్ర స్థితిగతులు మారాయి. ఎట్టి అభివృద్ధిని సాధించడానికి వీలుగాక పోయింది. 1948 సెప్టెంబరులో హైదాబాదులో పోలీసు చర్య జరుగవలసిన స్థితివచ్చింది. ఆ



కరీంనగర్ బస్సు షెల్టర్

## జాతీయం చేయబడిన రోడ్డు రవాణా సర్వీసులు

బస్సులలో గొనిపోబడిన ప్రయాణీకుల సంఖ్యను తెలిపే గ్రాఫ్ పటము.




ఆర్థిక సంవత్సరాలు

యస్. యస్. హెచ్. జాఫరిచే తయారు చేయబడినది.

తరువాత 1949 లో బస్సుల సంఖ్య 567 కు హెచ్చింది. ఆ తరువాత క్రమేణా పాత బడి పోయిన బస్సులను తొలగించుకుంటూ బస్సుల సంఖ్య 775 చేయబడింది. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సందర్భంలో ఆర్. టి. డి. శాఖను మూడు భాగాలుగా విభజించవలసి వచ్చిన సమయానికి వున్న పరిస్థితి ఇది. అలా విభజన జరిగిన తరువాత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆర్. టి. డి.కి 526 బస్సులు మిగిలాయి. ఈ నాడు బస్సుల సంఖ్య 576. లారీలు 28. వీటిలో టాంకర్లు కూడా వున్నవి. ఇవి డిపార్టుమెంటల్ పనికి ఉపయోగించ బడుతున్నవి. త్వరలో మరి 30 బస్సులు రానున్నవి.

### రేట్ల మార్పు

ఆర్. టి. డి. బస్సులను మొదట ప్రవేశ పెడుతున్నపుడు ఒక్కొక్క ప్రయాణీకునికి మైలుకుహాలీ 6 పైసల చొప్పున (కల్దారు 5.14 పైసలు) చార్జీ వసూలు చేయబడేది. ఈ రేటు అప్పటి ప్రైవేటు బస్సుల రేటు కంటే తక్కువే. ఆ తరువాత 1942 సెప్టెంబరు 1 వ తేదీనుంచి మైలు 1 కి హాలీ 9 పైసల (కల్దారు 7.71 పైసల) చొప్పున వసూలు చేయబడింది. అంటే రేటు హెచ్చింపబడిందన్న మాట. అయితే ఆర్. టి. డి. పై వస్తూ వున్న ఆదాయం సంతృప్తికరంగా లేదన్న కారణం వల్ల

ఈ హెచ్చింపు జరగలేదు. అనవసరంగా రోడ్డుద్వారా ప్రయాణం చేయకుండా ప్రయాణీకులను నిరుత్సాహ పరచడానికే ఈ హెచ్చింపు తలపెట్టబడింది. ఇలా హెచ్చింపడానికి మరో కారణం కూడా వుంది. యుద్ధ కాలంలో పాత బస్సులను తీసివేసి కొత్త బస్సులను వేయడం అసాధ్యమైన పనిగా తోచింది. పైగా రోజు రోజుకూ రోడ్డు ద్వారా ప్రయాణం చేసేవారి సంఖ్య హెచ్చుతూ పోయింది. ఈ విధంగా చార్జీలను పెంచడం వల్ల ప్రయాణీకుల సంఖ్య కొంత కాలంవరకు తగ్గిన మాట నిజమే గాని మళ్ళీత్వరలోనే రేట్లు పెంచడానికి ముందు ఎంత మంది ప్రయాణం చేసేవారో అంతమంది రోడ్డు ద్వారా ప్రయాణం చేయ నారంభించారు. మైలుకు 9 హాలీ పైసల చార్జీ 1948 సంవత్సరం మధ్య వరకూ అలాగే అమలులో వుంది. అయితే హైద్రాబాదులో కల్లోల రాజకీయ పరిస్థితి ఏర్పడడం తోటే పెట్రోలియం మొదలగు సరుకులను రాష్ట్రం లోకి దిగుమతి చేసుకోవడం దుస్సాధ్యమైంది. వాటి దిగుమతి పై విధి నిషేధాలు పెట్టబడ్డవి. అందుచేత ఒకవైపు బస్సు సర్వీసులు తగ్గించబడ్డవి. మరొక వైపు సిబ్బందిని మాత్రం యథా తథంగా వుంచి వారికి పనిలేక పోయినా పూర్తి జీతాలు ఇవ్వవలసిన స్థితి వొచ్చింది. దీనితో ఆర్. టి. డి. శాఖ పెద్ద ఆర్థిక చిక్కులో పడింది. దానితో ప్రయాణీకులను రోడ్డుద్వారా ప్రయాణం చేయవద్దని నిరుత్సాహ పరిచే ఉద్దేశంతోనూ, బస్సుసర్వీసు నడవడానికి అనుదినమూ పెరిగిపోతున్న ఖర్చుల దృష్ట్యా రాబడిని కూడా హెచ్చించుకోవడానికి 21 6-1948 తేది నుంచి చార్జీమైలు 1 కి హాలీ 18 పైసలు (కల్దారు 15.43 పైసలు) చేయబడింది. అంటే చార్జీ మొదటికంటె రెట్టింపు చేయబడిందన్న మాట. పోలీసు చర్య తరువాత 21-12 1948 తేది నుంచి మైలు 1కి హాలీ 12 పైసలు (కల్దారు 10. 18 పైసలు) చొప్పున వసూలు చేయ బడింది. అంతేగాని హాలీ 9 పైసలకు తగ్గింపబడలేదు. ఆర్. టి. డి. శాఖ ఆర్థికంగా కోలుకొనేటట్టు చేయడానికే ఇలా చేయబడింది. అప్పటి నుంచి నేటి వరకూ మైలుకు కల్దారు 10. 18 పైసల చొప్పున వసూలు చేయబడుతున్నది. ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణాలో గాక ఇతర ప్రాంతాలల్లో కూడా బస్సులు జాతీయం చేయ బడడంతో మైలుకు 5 నయాపైసాల చొప్పున (అంటే 9. 6 పైసలు) రేటును ప్రవేశ పెట్టవలెనని తల పెట్ట బడింది.

అవిభక్త హైద్రాబాదు రాష్ట్రంలో ఆర్. టి. డి. శాఖ మూడు భాగాలుగా విభజింపబడక పూర్వం బస్సు రూట్ల (మార్గముల) మొత్తం సంఖ్య 197. ఈ రూట్ల మొత్తం నిడివి 5940.7 మైళ్ళు. కాని మరాట్వాడా, కర్నాటక ప్రాంతాలు బొంబాయి మైసూరు రాష్ట్రాలకు పోవడంతో బొంబాయి రాష్ట్రానికి 48రూట్లు, మైసూరు రాష్ట్రానికి 24 రూట్లు ఇచ్చి వేయబడ్డవి. వాటి మొత్తం నిడివి వరుసవారీగా 1490.2 మైళ్ళు, 849.2 మైళ్ళు. అవిపోగా తెలంగాణా ప్రాంతపు ఆర్. టి. డి.కి 125 రూట్లు మిగిలాయి. వీటి మొత్తం నిడివి 3601.3 మైళ్ళు. ఈ విధంగా రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణలో ఆంధ్ర ప్రదేశ్ కు వచ్చిన ఆర్.టి.డి. శాఖ ఆర్థికంగా వ్యవస్థారీత్యా కోలుకోవలసి వున్నది. అయితే ఆంధ్ర జిల్లాలకు కూడా ఈ ఆర్.టి.డి. సర్వీసును విస్తరింపజేసినట్లయితే ఆంధ్ర ప్రదేశ్ రోడ్డు రవాణా శాఖ భారతదేశంలో అన్నిటికంటె ప్రాచీన మైనదేగాక ఒకానొక పెద్ద సంస్థగాకూడా అభివృద్ధి చెందడానికి దోహదం కలుగుతుంది. దీనికి 2000 బస్సులు వుండగలవు.

విభజనకు పూర్వం ఆర్.టి.డి. సగటున ప్రతిరోజు 65073 మైళ్ళపై బస్సులను నడుపుతూ వుండేది. కాని 1 11 1956 తేదీ నుంచి ఈ సంఖ్య 44227 మైళ్ళు అయింది. ఈ నిడివిలో చాలా భాగం అంటే 10633 మైళ్ళ నిడివి సర్వీసు హైద్రాబాదు సికింద్రాబాదు నగరాలలోనే వుంది. ఈ నగరాలలో 134 బస్సులు నడుస్తూ వుంటాయి. జిల్లా రూట్లపై 331 బస్సులు నడుస్తూ వుంటాయి. జిల్లా బస్సులు ప్రతి రోజూ 33594 మైళ్ళ నిడివి ప్రయాణం చేస్తూ వుంటవి.

విభజనకు పూర్వం ఆర్.టి.డి. బస్సులపై ప్రతిరోజూ సగటున 178,000 మంది ప్రయాణీకులు చేరవేయ



హైద్రాబాదులోని సెంట్రల్ బస్సుడిపో

బడుతూ వుండేవారు. కాని 1.11.1956 తేదీనుంచి 149,000 మంది ప్రయాణీకులు చేరవేయబడుతున్నారు. నగరంలో ఎక్కువగా ప్రయాణీకులు వుండే రూట్లపై జన సమ్మర్దం ఎక్కువగా వుండే వేళల్లో మూడు నిమిషాలకొక్క బస్సు చొప్పున నడుస్తూ వుంటుంది. నగర సర్వీసుల సగటు వేగం గంటకు 10 మైళ్ళు. జిల్లా బస్సుల సగటువేగం గంటకు 18 మైళ్ళు. జిల్లాలలో ప్రయాణీకులు ఎక్కువగా వుండే రూట్లపై గంటకొక్క బస్సు చొప్పున బస్సులు నడుస్తూ వుంటాయి. కొన్ని రూట్లపై ఎక్స్‌ప్రెస్ బస్సులుకూడా నడుపబడుతూ వున్నవి వాటికి అదనంగా చార్జి వసూలు చేయబడడం లేదు. నగర బస్సులలో ఒక ప్రయాణీకుడు బస్సు ఎక్కాడంటే సగటున 3 మైళ్ళ దూరం ప్రయాణం చేస్తాడు. కాని జిల్లాలలోని ప్రయాణీకుడు సగటున 12 మైళ్ళు మొదలు 16 మైళ్ళ వరకు ప్రయాణం చేస్తాడు. బస్సులు వేళకు తప్పకుండా సాధ్యమైనంతవరకు కృషి చేయబడుతూ వస్తున్నది. ఈ విషయంలో ఆర్.టి.డి. బస్సుల స్థాయి ఉన్నతంగానే వుందని చెప్పాలి. గత సంవత్సరం నూటికి 97.48 ట్రిప్పులు టైము ప్రకారం నడిచాయి. నూటికి 99.9 వంతుల మేరకు ప్రయాణీకులను నిర్ణీత రైళ్ళకూ, ఇతర బస్సులకూ అందించడం జరిగింది. బస్సులు కూడా చెడిపోకుండా సంతృప్తికరంగా ప్రయాణీకులను వారి గమ్యస్థానాలకు చేరవేస్తూవున్నవి. 10,000 మైళ్ళ ప్రయాణంలో ఒక పర్యాయం మాత్రమే బస్సు చెడిపోవడమంటూ జరిగింది.

## ప్రయాణీకులకు సౌకర్యాలు

ప్రయాణీకులకు ఆర్.టి.డి. శాఖ లుగ చేసిన సౌకర్యాలలో నగరంలో, జిల్లాలలోని రూట్లపై ప్రయాణీకులు వేచివుండటానికై కట్టబడిన షెల్టర్లు ప్రత్యేకంగా చెప్పదగినవి. జిల్లా ప్రధాన కేంద్రాలలోను, ముఖ్యమైన ట్రాఫిక్ జంక్షనులలోనూ పెద్ద షెల్టర్లు నిర్మింపబడ్డవి. అవిగాక తెలంగాణా ప్రాంతం మొత్తంలో దారి మధ్యన అక్కడక్కడా మొత్తం 388 షెల్టర్లు నిర్మింపబడ్డవి. పెద్దపెద్ద బస్సు స్టేషనులలో ప్రయాణీకులకు పంఖాలు, షవర్ బాత్ స్నాన గదులు, ఇతర ఆధునిక సౌకర్యాలతో చక్కని విశ్రాంతి శాలలు నిర్మింపబడ్డవి. ఈ బస్సు స్టేషనులలో ఉపాహారశాలలు, పండ్లకొట్లు, పుస్తక విక్రయ శాలలు ఏర్పాటు చేయ బడినవి. ఇవి కాంట్రాక్టర్లచే నడుపబడుతూ వుంటాయి. ట్రాఫిక్ కేంద్రాలన్నిటిలో వేసవిలో ప్రయాణీకులకు త్రాగే చల్లని నీరు లభించే ఏర్పాట్లు చేయబడుతవి.

ఈ బస్సులపై వార్తాపత్రిక పార్సళ్ళు నామ మాత్రపు నెల సరిరేట్లపై రవాణా చేయబడుతాయి.



నగరంలో బస్సుస్టాండ్

ప్రయాణీకులు వెంట లేకపోయినా, వారిలగేజీ గమ్య స్థానానికి చేరవేయ బడుతుంది. మనుష్యులు వెంటలేక పోయినా టిఫిన్ క్యారియర్లు నామమాత్రపు నెల సరిరేట్ల ప్రకారం రవాణా చేయబడుతవి. ప్రయాణీకులు సీట్లు రిజర్వు చేసుకోవడానికి, మామూలు టికెటు చార్జి లకు దాదాపు సగం రేట్లచొప్పున ఆర్. టి. డి. బస్సులను కిరాయాపై కంట్రాక్టుకు తీసుకోవడానికి అవకాశా లున్నవి ఉత్సవాలు జాతరలు మేలాల సందర్భంలో ప్రత్యేక బస్సులు నడుపబడుతూ వుంటాయి. విద్యార్థు లకు బస్సు ప్యాసులు ఇవ్వబడతాయి. 12 ఏండ్లలోపు విద్యార్థులకు మామూలు చార్జీలో $\frac{1}{8}$ వంతుచొప్పున. పన్నెండేండ్లకంటె మించిన వయస్సుగల విద్యార్థులకు $\frac{1}{4}$ వంతుచొప్పున మాత్రమే ప్యాసులపై చార్జి వసూలు చేయబడుతుంది. ప్రభుత్వ సచివాలయం, రెవిన్యూబోర్డు, హైకోర్టు మున్నగు సంస్థలలో పనిచేసే ఉద్యోగులకు కూడా ఇటీవల కన్సెషన్ రేటుపై బస్సుప్యాసులు ఇవ్వ బడుతున్నవి.

అంతర్ రాష్ట్ర బస్సులను నడుపడానికై ఆంధ్రప్రదేశ్ ఆర్. టి. డి. శాఖ బొంబాయిరాష్ట్ర రోడ్డురవాణా కార్పొరేషన్‌తోనూ, మైసూరురాష్ట్ర రోడ్డురవాణా తోనూ ఇచ్చి పుచ్చుకునే ఏర్పాట్లు చేసుకొన్నది. ఈ ఏర్పాటు ఫలితంగా ఆంధ్రప్రదేశ్ బస్సు సర్వీసులు బొంబాయిరాష్ట్ర ప్రాంతంలో 34.6 మైళ్ళ రూట్‌పై నడుస్తూ వుంటాయి. రోజూ 216.8 మైళ్ళు ఈ బస్సులు ప్రయాణం చేస్తాయి. అలాగే బొంబాయిరాష్ట్ర రోడ్డు రవాణా కార్పొరేషన్ యొక్క బస్సులు ఆంధ్రప్రదేశ్ ప్రాంతంలో 30 మైళ్ళ రూట్‌పై రోజూ 194.6 మైళ్ళు

నడుస్తూ వుంటాయి. ఇలాగే ఆంధ్రప్రదేశ్ బస్సు సర్వీసులు మైసూరురాష్ట్రి ప్రాంతంలో 80.5 మైళ్ళ రూట్‌పై నడుస్తూ ఉంటాయి. ఇవి రోజూ 720 మైళ్ళు ప్రయాణం చేస్తాయి. మైసూరు రోడ్డురవాణా సర్వీసులు ఆంధ్రప్రదేశ్ ప్రాంతంలో 59.4 మైళ్ళ రూట్‌పై రోజూ 885.8 మైళ్ళు నడుస్తూ వుంటాయి.

నగరంలోని బస్సులలో మొత్తం సీట్లకు సగటున 48.6 శతనిష్పత్తి ప్రకారం ప్రయాణీకులు వుంటారు. జిల్లా సర్వీసులలో సగటున 62.6 శతనిష్పత్తి ప్రకారం వుంటారు. బస్సులు నడవడానికి మైలు 18 175.8 పైసల చొప్పున ఖర్చు అవుతుంది (1955-56 ఆర్థిక సంవత్సరపు అంకెలనుబట్టి). ఆంధ్రప్రదేశ్ రోడ్డురవాణా బస్సులు నడవడానికి ప్రతి మైలుకయ్యే ఖర్చు నిర్వహణ, మరమ్మత్తు, టైర్లు మొదలగు వాటి విషయంలో తక్కువగానే వుంటుందని చెప్పాలి. ఇందుకు కారణం ఈ వ్యవస్థలో కొన్ని నిర్ణీత నిర్వహణ ప్రమాణాలు కచ్చితంగా పాటింప బడడమే. ఖర్చుల విషయంలో పోల్చిచూస్తే సిబ్బంది కివ్వబడే జీత ఖర్చుమాత్రమే హెచ్చుగా వుంటుంది. ఇందుకు కారణమేమంటే ఆంధ్రప్రదేశ్ రోడ్డురవాణా సిబ్బందియొక్క జీతాలు ఆర్. టి. డి. నిజాంస్టేట్ రైల్వేలో ఒక భాగంగా వుండగా కేంద్ర ప్రభుత్వ స్కేళ్ళ ప్రకారం నిర్ణయించ బడినవి. 1957 జూలై 1వ తేదీ తరువాత నియమింపబడిన సిబ్బందికి

## జాతీయం చేయబడిన రోడ్డు రవాణా సర్వీసులు

ఒక్కొక్క మైలుకు అయ్యే ఖర్చు వివరాలను తెలిపే గ్రాఫ్ పటము (పైసాలలో)




ఆర్థిక సంవత్సరాలు

యస్. యస్. హెచ్. శాఖచే తయారు చేయబడినది.

# జాతీయం చేయబడిన రోడ్డు రవాణా సర్వీసులు

పెట్టుబడి ఖర్చుపై వచ్చే నికరాదాయం శతిని తెలిపే గ్రాఫ్ పటము




ఆర్థిక సంవత్సరాలు

యస్. యస్. హెచ్. జాఫరీచే తయారు చేయబడినది.

మాత్రం కొత్తస్కేళ్ళు ఇవ్వబడినవి. ఈ కొత్తస్కేళ్ళు కొంచెం తక్కువగానే వున్నవి.

## సిబ్బంది

విభజనకు పూర్వం ఆర్. టి. డి. లో వివిధ శాఖలలో 5862 మంది ఉద్యోగులు పనిచేస్తూ వుండేవారు. 1 11-1956 తేది తరువాత ఈ సంఖ్య 4,581 అయింది. వారిలో ఎక్కువ భాగం, అంటే దాదాపు మూడో వంతు డ్రైవర్లు, కండక్టర్లు. ఈ సిబ్బందికి గల ప్రత్యేక సౌకర్యాలు కూడా చెప్పదగి వున్నవి. 1-11-1956 తేదికి పూర్వం నుంచి ఆర్. టి. డి. లో పని చేస్తూవున్న ఉద్యోగులు రైల్వే నియమాల ప్రకారం ఉచితంగా రైల్వే ప్యాసులు, కన్సెషన్ టికెట్లు పొందే హక్కు కలిగి వున్నారు. అంతే గాక ఉచితవైద్య సహాయం, నామ మాత్రపు అద్దెలకు చక్కని నివాస గృహముల వసతి, సిబ్బంది పిల్లలకు విద్యా విషయక సహాయం, స్టాఫ్ బెనిఫిట్ ఫండ్, మ్యూచువల్ బెనిఫిట్ ఫండ్ కోపరేటివ్ క్రెడిట్, పారిశ్రామిక క్యాంటీనులు, డిపోలలో రేడియోలు, ఇతర వినోద సౌకర్యాలు మొదలగు సదుపాయాలన్నిటినీ ఆర్. టి. డి. సిబ్బంది అనుభవిస్తున్నారు.

రాష్ట్ర రెండవ పంచవర్ష ప్రణాళిక :-

# 1957-58 సంవత్సరపు వ్యవసాయోత్పత్తి కార్యక్రమం

*దేశంలో మళ్ళీ ఆహార సమస్య అందరి దృష్టిని ఆకర్షిస్తూ వున్నది. అధికోత్పత్తి ఈ నాటి అవశ్యకత అని అంతా గుర్తిస్తున్నారు. ఆంధ్ర ప్రదేశ్ భారతదేశ ధాన్యాగారమని ప్రసిద్ధి చెందినది. అందుచేత దేశ ఉత్పత్తికి అధికంగా దోహదం చేయవలసిన బాధ్యత ఈ రాష్ట్రంపై వున్నది.*

*రాష్ట్ర వ్యవసాయోత్పత్తిని హెచ్చించే లక్ష్యంతో రూ. **145.30** లక్షల ఖర్చు అంచనాతో **1957-58** సంవత్సరంలో అమలు జరుపవలెనని **117** పథకాలు సిద్ధం చేయబడ్డవి. వీటిలో **62** పథకాలు ఆంధ్ర ప్రాంతానికి సంబంధించినవి. వాటికి రూ. **101.46** లక్షలు ఖర్చు అవుతాయి. మిగిలిన **55** పథకాలు తెలంగాణాకు సంబంధించినవి. వాటికి రూ. **43.84** లక్షలు ఖర్చు అవుతాయి. మొత్తం ఖర్చు రూ. **145.30** లక్షలలోనూ రూ. **93.52** లక్షలు కేంద్రంనుంచి లభిస్తాయి — రూ. **59.17** లక్షలు గ్రాంటుల రూపంగా లభ్యమవుతాయి.*

## ఆంధ్రప్రాంతం పథకాలు

### జపాను—భారత దేశాల మిశ్రమరకాలు

వరి ధాన్యం ఉత్పత్తిని పెంచవలెనంటే ఎక్కువ పంట దిగుబడినిచ్చే జపాను వడ్ల రకాలను భారతదేశపు మేలు రకాలతో మిశ్రమం చేసి, కొత్త రకాలను రూపొందించడం అవసరం. ఇప్పుడు 1500 విధముల మిశ్రమ రకాలు పరిశోధింప బడుతున్నవి. ఈ పరిశోధనపథకం సామర్లకోటలోని వ్యవసాయ పరిశోధనా కేంద్రంలో 1956-57 లో ప్రారంభింపబడింది. ఇదివరకే ఉత్పత్తి చేయబడినట్టి F. 6 రకం సేద్యాన్ని ఇంకను పరిశీలించ డానికై 1957-58 సంవత్సరంలో రూ 0.04 లక్షలు కేటాయింపబడ్డవి.

### చేదుడు నీటి కట్టుతో వరిపంట

ఇప్పుడు కొన్ని ప్రాంతాలలో నీటిని పైకి చేది పొలాలకు పారించడం ద్వారా వరి పండించ బడుతున్నది. ఇది చాల కష్టమైన పని. ఖర్చుకూడా ఎక్కువే. కడప, కర్నూలు అనంతపురం, చిత్తూరు, నెల్లూరుజిల్లాలలో చేదుడు నీటి కట్టు సేద్యం క్రింద 4,22,000 ఎకరాల భూమివుంది. ఇటువంటి ప్రాంతాలకు నిర్ణీత కాలానికి హెచ్చు పంట దిగుబడినిచ్చే మేలు రకం వరి రకాలను రూపొందించవలెనని తలపెట్టబడింది. ఈ పథకాన్ని అమలు జరప డానికై 1957-58 సంవత్సరానికి రూ 0.07 లక్షలు కేటాయింపబడ్డవి.

### మేలు రకం జొన్నలు

లాములోని వ్యవసాయ పరిశోధనా కేంద్రంలో జొన్నల వర్ధనపు పనిని ప్రారంభించడానికి తలపెట్ట బడింది. ఆ ప్రదేశం నుంచి, రాష్ట్రం వెలుపలి అటువంటి ప్రదేశాలనుంచీ సామగ్రి సేకరణకూ, సర్వేపనికి విత్తనాలను చల్లడానికీ వాతావరణ స్వభావమును పరిశీలించడానికీ, ఒక్కొక్క మొక్కను ఏర్పాటు చేయటకు తగురీతిగా ఎన్నిక చేయడానికీ ప్రస్తుత సంవత్సరం రూ. 0.05 లక్షలు కేటాయింపబడ్డవి.

### విత్తనాల పంపిణీ

రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో వ్యవసాయోత్పత్తిని అధికం చేసే ఉద్దేశంతో దేశంలోని ప్రతి ఒక్క సామూహిక అభివృద్ధి బ్లాకులోను, ప్రతి జాతీయ విస్తరణ సేవా కేంద్రంలోను ఒక విత్తనాల క్షేత్రాన్ని, ఒక విత్తనాల స్టోర్‌ను ఏర్పాటు చేయవలెనని ఒక పథకం సిఫారసు చేయబడింది. ప్రస్తుత సంవత్సరంలో 62 విత్త

నాల క్షేత్రాలను, 62 విత్తనాల స్టోరులను ఏర్పాటు చేయవలెనని తలపెట్టబడింది. మేలురకం విత్తనాల ఉత్పత్తి, పంపిణీపని ఇదివరకే అమలులో వుంది. ఆ కార్యక్రమాన్ని ఇకముందు కూడా కొన సాగించవలె నని సంకల్పించబడింది. రెండవ ప్రణాళిక కాలంలో ప్రస్తుతమున్నట్టి వ్యవసాయ పరిశోధన కేంద్రాలలో మొత్తం 20 ఎకరాలలో బీజ విత్తనములను పండించి, ఆ విధంగా బీజ విత్తనాల ఉత్పత్తి అధికం చేయ బడు తుంది.

1957-58 సంవత్సరంలో 6957 టన్నుల వరి విత్త నం, 1884 టన్నుల జొన్న విత్తనం, 4,281 టన్నుల వేరుసెనగ విత్తనం, 405 టన్నుల పప్పుధాన్యం విత్త నాలు, 166 టన్నుల పచ్చిఆకు ఎరువు విత్తనం పంపిణీ చేయబడుతాయి.

## పట్టణ కంపోస్టు

ఒక టన్ను కంపోస్టు ఎరువు వేసి అదనంగా 1/40 టన్ను ఆహారధాన్యం పండించవచ్చునని అంచెనా వేయ బడింది. అందుచేత రెండవ ప్రణాళిక కాలంలో మునిసి పాలిటీలలోను, మేజర్ పంచాయితీలలోను కంపోస్టు ఎరువు ఉత్పత్తి పంపిణీలను హెచ్చించవలెనని తల పెట్ట బడింది. 1957-58 సంవత్సరంలో 100,000 టన్నుల కంపోస్టు ఉత్పత్తి పంపిణీ కార్యక్రమం కొరకై రూ 3.00 లక్షలు కేటాయింపబడ్డవి.

## అద్దె-కొనుగోలు పద్ధతిపై ట్రాక్టర్లు

అద్దె కొనుగోలు పద్ధతిపైజరుగుతున్న ట్రాక్టర్లపంపిణీ పథకం క్రమేణా వ్యాప్తి చెందుతున్నది. ట్రాక్టర్లను కొనగల ప్రైవేటు వ్యవసాయ దారులను ప్రోత్సహించే ఉద్దేశంతో1957-58 సంవత్సరంలో 75 ట్రాక్టర్లను కొని వాటిని అద్దె కొనుగోలు పద్ధతిపై వ్యవసాయ దార్లకు పంపిణీ చేయవలెనని తలపెట్టబడింది. ఒక్కొక్క ట్రాక్టర్ వల్ల 400 ఎకరాలకు లాభం కలుగుతుంది. అదనంగా ఎకరానికి 1/4 టన్ను చొప్పున ఉత్పత్తి జరు గుతుంది.

గుంటూరు జిల్లాలోని బాపట్లలో ట్రాక్టర్ వర్కు షాప్ ఒకటి నెలకొల్పబడింది. రాష్ట్రంలో వ్యవసాయ శాఖ అజమాయిషీ క్రింద వుండే ట్రాక్టర్లను, ఇతర వ్యవసాయ సంబంధమైన యంత్రములను అవసరమైన ప్పుడు మరమ్మతు చేయడం ఈ వర్కుషాపు పని. దీనికి 1957-58 సంవత్సరానికి రూ. 0.16 లక్షలు కేటాయింప బడ్డవి.

## మిరపకాయల ఉత్పత్తి

ఆంధ్ర ప్రాంతంలోని మెట్ట ప్రదేశాలలో 100,000 ఎకరాలలో మిరపకాయ పండుతుంది. లాములోని వ్యవసాయ పరిశోధన కేంద్రంలో ఒక ముఖ్యమైన మిరప రకం రూపొందించబడింది. దీనిని రెండవ గ్రేడు మిరప అంటారు, దీనివల్ల పంట దిగుబడి ఎక్కువగా వుంటుంది. అంతేగాక ఇది తామర పురుగు తెగులుకు కూడా తట్టు కొని నిలువ గలుగుతుంది. అందుచేత దీని విత్తనానికి మంచి గిరాకీవుంది. ఈ రాష్ట్రంలోని ముఖ్యమైన వాణిజ్య పంటలలో మిరపకాయ ఒకటి. విదేశాలకు మిరపకాయలను ఎగుమతి చేయడానికి ఈ రాష్ట్రానికి ఎప్పుడూ కోటాలు కేటాయింపబడుతూవుంటాయి. ఈ మేలురకం విత్తనాన్ని అధికంగా పండించి పంపిణీ చేయ డానికై గుంటూరు జిల్లాలోని లాములో 30 ఎకరాల భూమిలోను, కృష్ణా జిల్లాలోని గన్నవరంలో 30 ఎక రాలలోను ఒక పథకం అమలు జరుపబడింది. 6000 ఎక రాలకు ఈ విత్తనాన్ని లభింపజేసి, 600 టన్నుల మిరప కాయలను ఉత్పత్తి చేయడానికై 1957-58 సంవత్సంలో రూ 0.05 లక్షలు కేటాయింపబడ్డవి.

## ఉల్లి పరిశోధనా కేంద్రం

భారత దేశంలో ఉల్లిగడ్డ పండే మొత్తం భూమిలో ఆరో వంతుభూమి ఆంధ్ర ప్రదేశ్‌లో వుంది. ఆంధ్రలో పండే పంట ఇక్కడ మార్కెట్లకు సరిపోవడమే గాక దూర ప్రాచ్య దేశాలకు, మధ్య ప్రాచ్య దేశాలకూ ఎగుమతి చేయబడుతున్నది. కడప జిల్లాలోని యర్ర గుంటకోట పరిశోధనా కేంద్రంలో ఉల్లి పంటకు సంబంధించిన వివిధ ప్రయోగాలను జరుపడానికై ప్లాట్లు (మళ్ళు) వేసి తగు రీతిగా కార్యక్రమం కొన సాగించడానికి 1957-58 సంవత్సరంలో రూ. 0.25 లక్షలు కేటాయింప బడ్డవి.

## భూములకు ఫాస్ఫేటిక్ వాడకం

ఫాస్ఫేటిక్ ఎరువులను వేస్తే పంట దిగుబడి, నాణ్యము ఎలా వుండేదీ తెలుసుకోవడానికి, నత్రజని పీల్పు, వివిధ పంటలకు అవసరమైన ఎరువుల వివరాలు మున్నగు వాటిని తెలుసుకోవడానికీ బాపట్లలోని వ్యవసాయ కళాశాలలో ఒక పథకం అమలు జరుపబడుతున్నది. ఈ పథకం కొరకై 1957-58 సంవత్సరానికి రూ. 0.07 లక్ష కేటాయింపబడ్డవి.

## తెగుళ్ళ నివారణ

ఈ పథకం ముఖ్యోద్దేశం పైరులకు పడే తెగుళ్ళను రోగాలను పెద్దపెట్టున నిరోధించడానికై వ్యవసాయ

శాఖ డిమాన్‌స్ట్రేటర్లకు తగినన్ని చేతి చిమ్మట గొట్టాలను, డస్టర్లను సప్లయి చేయడం, వ్యవసాయ శాఖ డిపోలకు విద్యుచ్ఛక్తివల్ల పనిచేసే చిమ్మటాలను లభింప జేయడం. రూ. 2.50 లక్షల ఖర్చుతో 4 వ్యానులను, 30 పవర్ స్ప్రేయర్లను, 100 చేతి చిమ్మటలను, 100 చేతి డస్టర్లను, రసాయనిక పదార్థములను కొనవలెనని తలపెట్టబడింది. రసాయనిక పదార్థముల ఖరీదు రైతులనుంచి రాబట్ట బడుతుంది గనుక ఈ పథకానికి 1957-58లో అయ్యే ఖర్చు రూ. 3.95 లక్షలదాకా వుంటుంది.

## అంబాజీ పేటలో కొబ్బరి చీడ నిరోధక కేంద్రం

కొబరి చెట్లకు "నెఫాంటిస్ సెరినోపా" అనే చీడ పడుతూ వుంటుంది. ఈ చీడను తినే పురుగు ఒకటి వుంటుంది. అట్టి పురుగులను పెంచే కేంద్రం తూర్పు గోదావరి జిల్లాలోని రాజోలులో వుంది. దానికి ఇండియన్ సెంట్రల్ కోకోనట్ కమిటీ (భారతీయ కేంద్ర కొబ్బరి పంట మండలి) వారు ఆర్థిక సహాయం చేస్తూన్నారు. ఆంధ్ర ప్రాంతంలో 82,000 ఎకరాల భూమిలో కొబ్బరి చెట్లు వున్నవి. రాజోలులోని పరాన్నభుక్కు కీటక కేంద్రం ఆంధ్ర ప్రాంతమంతటికీ కొబ్బరి చీడను తినివేసే కీటకములను సరఫరా చేయలేక పోతున్నది. కాబట్టి తూర్పు గోదావరి జిల్లాలోని అంబాజీ పేటలో మరొక కీటక కేంద్రమును నెలకొల్పవలెనని తలపెట్టబడింది. ఇందుకై 1957-58 సంవత్సరానికి రూ. 0.10 లక్ష కేటాయింప బడ్డవి.

## పండ్ల చీడలు

పండ్ల చెట్లకుపడే చీడలవల్ల చాలా ఉత్పత్తి దెబ్బ తింటున్నది. అందుచేత ఆధునికమైన క్రిమి సంహారక ఔషధములతో ఈ చీడలను నివారించడానికి విస్తృతంగా పని జరగవలసిన అవసరం ఎంతైనా వుంది. ముఖ్యంగా రాయలసీమ ప్రాంతంలో పండ్లకు పడే పురుగు, మామిడి తోటలుండే ప్రాంతాలలో మామిడి పంటకు నష్టం కలిగించే మరొకరకం పురుగు ఈ సందర్భంలో పేర్కొన దగినవి. ఈ పథకం కొరకై 1957-58 సంవత్సరానికి రూ. 0.16 లక్ష కేటాయింపబడ్డవి ఈ పథకం కోడూరు లోని పండ్ల పరిశోధనా కేంద్రంలోను, కోడూరులోని మైరిపేటు పండ్ల తోటలలోను, బాపట్లలోని వ్యవసాయ కళాశాల క్షేత్రంలోను అమలు జరుపబడుతుంది.

1957-58 సంవత్సరంలో పండ్లు, కూరగాయలు అధికంగా పండించేటందుకై రూ. 5.84 లక్షలు కేటాయింపబడ్డవి. కొత్తగా 1000 ఎకరాల భూమిలో పండ్ల తోటలు వేయబడుతాయి. రూ. 4.50 లక్షలు అప్పులుగా ఇచ్చి ప్రస్తుత సంవత్సరంలో పాత తోటలను పునరుద్ధరింప జేయడం జరుగుతుంది.

## ప్రత్తి పంట విస్తరణ పథకం

ఈ పథకము ననుసరించి రెండవ పంచవార్షిక కాలంలో 20,000 బేళ్ళ (ఒక్కొక్కటి 392 పౌనులు) ప్రత్తిని ఉత్పత్తి చేయవలెనని తలపెట్టబడింది. ఇందుకై 1957-58 సంవత్సరానికి రూ. 0.47 లక్ష కేటాయింప బడ్డవి.

1956-57 సంవత్సరంలో ముంగారి ప్రత్తి అభివృద్ధి పథకం క్రింద రూపొందించబడిన రకాలను మిశ్రమ పైరు పద్ధతి ప్రకారం ప్రయోగించి చూడడానికై అయిదు సంవత్సరాల పాటు ఒక పథకం మంజూరు చేయబడింది. ప్రస్తుత సంవత్సరానికి రూ. 0.20 లక్ష కేటాయింపు జరిగింది.

## చెరకు

రాష్ట్రంలోని ముఖ్యమైన వ్యవసాయ పంటలలో చెరకు ఒకటి. చక్కెర పరిశ్రమకూడా ఈ రాష్ట్రంలో బాగా అభివృద్ధి జెందింది. అనకాపల్లి చెరకు పరిశోధనా కేంద్రంలో జరిగే పరిశీలనా కార్యక్రమాన్ని విస్తృతీకరించవలెనని తలపెట్టబడింది. ఈ పథకం 1956-57లో అమలు జరుపబడింది. చెరకు గడలను కోసిన తరువాత మొలచే మొక్కలు, నీటికట్టు, ఎరువుల వాడకం, వీటికి సంబంధించిన విధానములు ఈ కేంద్రంలో తగు విధంగా పరిశీలన చేయబడుతాయి. ఇందుకై 1957-58 సంవత్సరానికి రూ. 3.79 లక్షలు కేటాయింపబడ్డవి.

రాష్ట్రంలో చెరకు ఉత్పత్తి జరిగే ముఖ్యమైన తాలూకాలలో అభివృద్ధి కార్యక్రమం ద్వారా చెరకు గడ దిగుబడిని, రసం నాణెమును పెంపొందించుటకు తలపెట్టబడింది. వీలైన చోట్ల కొత్త భూములలో చెరకు పైరు వేయడంద్వారా అదనంగా చెరకు పండించ బడగలదు. ఈ పథకం 1956-57 సంవత్సరంలో ఆరంభింపబడింది. 1957-58 సంవత్సరానికి రూ. 2.59 లక్షలు కేటాయింప బడ్డవి.

## ట్రాక్టర్ ఆపరేటర్లకు శిక్షణ

ఆయిల్ ఇంజన్ పంపుసెట్లు, ఎలక్ట్రిక్ మోటారు పంపుసెట్లు, ట్రాక్టర్లను మరమ్మతులు చేయడానికి ప్రస్తుతం గ్రామీణ ప్రాంతాలలో అర్హులైన మెకానిక్కులు లేరు. కనుక వ్యవసాయ శాఖ ఆపరేటర్లు 24 మందికి, ఇతరులు 72 మందికి 1957-58 సంవత్సరంలో అదోని, బాపట్లలో గల ట్రాక్టర్ వర్కుషాపులలో శిక్షణ ఇవ్వవలెనని తలపెట్టబడింది.

## ప్రాంతీయ జొన్న కేంద్రాలు

ప్రస్తుతం ఆంధ్రప్రాంతంలో జొన్న పైరును అభివృద్ధి పరిచే వ్యవసాయ పరిశోధన కేంద్రాలు 4 మాత్రమే వున్నవి. జొన్నపైరు ప్రాంతీయమైనది. ప్రస్తుత పరిశోధనా కేంద్రాలు పరిమిత ప్రాంతానికే పనిచేస్తూ వున్నది. అందుచేత జొన్న అభివృద్ధి పనిని ప్రాంతీయ ప్రాతిపాదికపై జరిపి, ఎక్కువ పంటనిచ్చే జొన్న రకాలను రూపొందించవలెనని తలపెట్టబడింది. ఇందుకై 6 జొన్న కేంద్రాలు నెలకొల్పబడుతవి. ఇందుకై 1957-58 సంవత్సరానికి రూ. 0.64 లక్ష కేటాయింపబడింది.

## మేలురకం రాగులు

గుంటూరు జిల్లాలో సముద్ర తీరంలో 20,000 ఎకరాలలో రాగులు పండించ బడుతున్నవి. ప్రధాన తరుణంలో వర్షంవల్లనే పైరు బ్రతుకుతుంది. ఆ తరువాత పొలాన్ని నీటితో తడుపవలసి వుంటుంది. ప్రస్తుతం ఈ ప్రాంతంలో మేలు రకం రాగులు లేవు. అందుచేత ఈ ప్రాంతంలో పండించడానికి ఏరకం రాగులు మంచివో ఎన్నిక చేసే పనిని బాపట్లలోని వ్యవసాయ కళాశాల క్షేత్రంలో జరుపవలెనని తలపెట్టబడింది. ఈ పథకంకొరకై 1957-58 సంవత్సరానికి రూ. 0.04 లక్ష కేటాయింపబడింది.

## గిడ్డంగుల నిర్మాణం

ప్రస్తుతం గుంటూరు జిల్లాలోని చిలకలూరి పేట, చింతలపూడి, పరుచూరు, సత్తెనపల్లి, నంబూరు, రేపల్లె, మేడికొండూరు, వంగోలు, త్రోవగుంట, టంగుటూరు, వినుకొండ గ్రామాలలో తగుగిడ్డంగి వసతిలేదు. ఈ గ్రామాలలో ప్రతి సంవత్సరం ఎంతో ధాన్యం, ఇతర సరుకుల క్రయవిక్రయం జరుగుతూ వుంటుంది. గిడ్డంగులు లేకపోవడంచేత రైతులు తమ పంటలను తక్కువ ధరలకు అమ్మి రావలసిన లాభాన్ని పొందలేక పోతున్నారు. అందుచేత రెండు గిడ్డంగులను నిర్మించడానికై పొగాకు మార్కెటింగ్ కమిటీ వారికి 1957-58 సంవత్సరంలో రూ. 4 లక్షల అప్పు ఇవ్వవలెనని తలపెట్టబడింది.

## జనుము అభివృద్ధి

నార పైరులలో ఖీముని పట్నం జనుము లేక గోగు ముఖ్యమైన పంట. ఇది 1 1/2 లక్షల ఎకరాలలో పండించ బడుతున్నది. మేలు రకాల జనుము, గోగులను రూపొందించినట్లయితే అందువల్ల వ్యవసాయదారులకు, వర్తకులకు, మొత్తం రాష్ట్రానికే మేలు కలుగగలదు. ఈ పనిని గుంటూరు జిల్లాలోనిలాము వ్యవసాయ పరిశోధనా కేంద్రంలో జరిపించుటకు తలపెట్టబడింది. అందుకై 1957-58 సంవత్సర ప్రణాళికకు రూ. 0.09 లక్ష కేటాయింపబడ్డవి.

## వ్యవసాయ ప్రయోగాలు

రెండవ పంచవర్ష ప్రణాళిక ముగిసేనాటికి కొన్ని నీటి పారుదల ప్రాజెక్టుల నిర్మాణం పూర్తి అవుతుంది. ఆ ప్రాజెక్టుల వల్ల లభించే నీటితో రైతులు సాధ్యమైనంత హెచ్చుగా లాభం పొందడానికై ప్రణాళికా కాలానికి ముందే సకాలంలో భూములను బట్టి పైరుల నీటి అవసరాలు, వాటికి వేయవలసిన ఎరువుల విషయంలో రైతులకు సలహాలివ్వడానికై భారతీయ వ్యవసాయ పరిశోధనా మండలి తలపెట్టింది. ఈ సమాచారాన్ని మొదట మండలివారు సేకరిస్తారు. అందుకై వారు రైతుల భూముల్లో నమూనా ఎరువుల ప్రయోగాలు జరుపడానికి ఒక పథకాన్ని సిద్ధం చేశారు. 1957-58 సంవత్సరంలో ఆంధ్ర ప్రాంతంలోని 11 జిల్లాలలోని 22 తాలూకాలలో 1188 ప్రయోగాలు జరుపబడుతవి.

## ఇంజనీరింగు విభాగం

మన దేశంలో అభివృద్ధి చెందిన రాష్ట్రాలన్నింటిలో వ్యవసాయ ఇంజనీరింగుకు సంబంధించిన పరిశోధనా విభాగాలు ఇదివరకే పనిచేస్తూవున్నవి. అందుచేత బాపట్ల వ్యవసాయ కళాశాలలోని ఇంజనీరింగు పరిశోధనలో ఒక విభాగాన్ని నెలకొల్పవలెనని తలపెట్ట బడింది. ఇప్పుడు కళాశాల క్రింద వున్నట్టి వర్కుషాపు రీమోడల్ చేయబడి, ఫ్యాక్టరీల చట్ట నిబంధనలకు అనుగుణంగా రూపొందించబడుతుంది.

## జీడి మామిడి అభివృద్ధి

ప్రస్తుతం ఆంధ్ర ప్రాంతంలో జీడిమామిడి క్రింద 5969 ఎకరాల భూమి వుంది. 2,000 టన్నుల జీడి పప్పు పండుతున్నది. ఆంధ్రలో జీడి మామిడి పండే ప్రాంతం చాలా వుంది. కాని అది అంతా వృథాగా పడివుంది. అందుచేత రెండవ ప్రణాళిక కాలంలో అదనంగా 15,000 ఎకరాల భూమిని జీడి మామిడి క్రిందికి తేవలెనని తలపెట్టబడింది. ఈ పథకం కొరకై 1957-58 సంవత్సరానికి రూ. 0.34 లక్ష కేటాయింపబడింది.

## సబ్బవరంలో పండ్ల పరిశోధనా కేంద్రం

కొత్త భూములను, నిట్రపువాలుగా వుండే పర్వత భూములను బాగుపరచి వాటిలో పండ్ల తోటలను

వేయడం, మామిడి మొదలగు పండ్లచెట్ల జాతుల పంట దిగుబడిని హెచ్చించడం ఈ పథకం ముఖ్యోద్దేశమై వున్నది. ఇందుకై సబ్బవరంలో పండ్ల పరిశోధనా కేంద్రమును నెలకొల్పవలెనని తలపెట్టబడింది. ఈ కేంద్రం ఈ ప్రాంతంలో లాభసాటియైన మేలురకపు పండ్ల చెట్లు ఏవో తెలుసుకోవడానికి తగు పరిశోధనలు జరుపగలదు.

## అరటి పరిశోధనా కేంద్రం

ఇంతవరకు ఆంధ్ర ప్రాంతంలో 20,000 ఎకరాలలో అరటి తోటలున్నవి. ఇందులో ఎక్కువ భాగం సర్కారు జిల్లాలలోనే వున్నవి. రాయలసీమలో కూడా అరటి పంట క్రమేణా వృద్ధి అవుతూ వున్నది. ఇంకను విస్తృతంగా ఈ పంటను వేయడానికి ఆంధ్రలో తగు అవకాశం వుంది. ఈ ప్రాంతమును శాస్త్రీయమైన, లాభకరమైన పద్ధతుల ప్రకారం అభివృద్ధి పరచడానికై ముందుగానే తగు ప్రణాళిక వేసుకునేందుకై పశ్చిమ గోదావరి జిల్లాలో ఒక అరటి పరిశోధనా కేంద్రమును నెలకొల్పవలెనని తలపెట్టబడింది. ఈ కేంద్రం స్థానిక పరిస్థితులను అనుగుణంగా కొత్త అరటి రకాలను, ఉత్తమమైన సేద్య పద్ధతులను, ఎరువు వాడకపు పద్ధతులకు రూపొందిస్తుంది. ఈ పథకం కొరకై 1957-58 సంవత్సరానికి రూ. 0.19 లక్ష కేటాయింప బడింది.

## తిరుపతిలో పరిశోధనా కేంద్రం

తిరుపతి కొండలు ఒక విధంగా ఆర్ద్రమైన వాతావరణం కలిగి వున్నవి. ఈ ప్రదేశం సముద్ర మట్టానికి 3000 అడుగుల ఎత్తున వున్నది. ఇచటి సగటు వర్షపాతం 40 అంగుళాలు. ఈ ప్రాంతంలో ఎటువంటి పండ్లు ఉత్పత్తి కాగలవో తగు విధంగా పరిశీలన చేయ బడలేదు. కనుక అర్థికంగా లాభసాటియైన పండ్లు కాఫీ, తేయాకు మొదలగు పానీయ పదార్థములు సుగంధ ద్రవ్యములను పండించడానికి మంచి ప్రదర్శక కేంద్రంగా ఉపయోగపడే పరిశోధన కేంద్రమును ఇచట ఏర్పాటు చేయవలెనని సంకల్పించబడింది. అట్టి పంటలను రాష్ట్రంలోని తదితర ప్రాంతాలకు విస్తరింప జేయడానికి కూడా ఈ కేంద్రం ప్రయోజనకారి కాగలదు.

## చెరుకు పైరు విత్తనం

ప్రస్తుతం బాగా వ్యాప్తిలోవున్న నం. 41 రకం చెరకు విత్తనం అనేక కారణాలవల్ల కొన్ని ప్రాంతాలలో సరియైన పంట దిగుబడిని ఇవ్వలేకపోతున్నది. పైగా పండిన పంటకూడా చెడుగా వుంటున్నది. అందుచేత అట్టి ప్రాంతాలలో ఆ రకం విత్తనానికి బదులు రోగం, చీడరానట్టి విత్తనాన్ని వేయించవలెనని సంకల్పించ బడింది. శ్రీకాకుళం జిల్లాలో బొబ్బిలిలోవున్న ప్రాంతీయ కేంద్రంలోను, పశ్చిమ గోదావరి జిల్లాలో సామర్ల కోటలో వున్న ప్రాంతీయ కేంద్రంలోను ఒక్కొక్క చోట అర ఎకరంలో మంచిరకం చెరకు విత్తనాన్ని పండించి, దానితో ప్రతి ప్రాంతంలో రెండు వేల ఎకరాలకు విస్తరించే విధంగా చెరకు విత్తనాన్ని ఉత్పత్తి చేయవలెనని ఒక కార్యక్రమం సిద్ధంచేయ బడింది.

## నూనె గింజల పరిశోధన కేంద్రం

ఈ పథకం క్రింద విశాఖపట్నం జిల్లాలో తగు స్థలంలో ఒక నూనె గింజల పరిశోధన కేంద్రమును స్థాపించవలెనని తలపెట్టబడింది. ఈ కేంద్రం నువ్వులు, వేరుసెనగ మొదలగు నూనె గింజల ఉత్పత్తి విషయంలో కోస్తా జిల్లాల అవసరాలను తీర్చగలదని ఆశింప బడుతున్నది.

## పశ్చిమ రకపు ప్రత్తి

ఆంధ్ర ప్రాంతంలో ఎక్కువ భూమిలో పశ్చిమ రకపు ప్రత్తి (వెస్టర్న్ కాటన్) పండించబడుతున్నది. 1 1/2 లక్షల ఎకరాలలో లక్ష్మి ప్రత్తికూడా పండించ బడుతున్నది. పశ్చిమ రకపు ప్రత్తి, లక్ష్మి ప్రత్తియొక్క నాణ్యమును కాపాడే ఉద్దేశంతో ఈ రెండు రకాల ప్రత్తి విత్తనాలను హెచ్చుగా పండించి పంపిణీ చేయ వలెనని సంకల్పించబడింది. ఇందువల్ల అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలకు ఎంతో మేలు కలుగుతుంది. ఇలా పండించబడ్డ విత్తనాలు 50,000 ఎకరాలలో వేయబడుతవి.

## ఎరువుల ఆధారాల అభివృద్ధి

ప్రస్తుతం గ్రామాలలో ఎరువుల సేకరణకు ఏయే ఆధారలున్నవో వాటి నన్నిటికీ ఉపయోగానికి తెచ్చి ఎరువుల ఉత్పత్తిని హెచ్చించడమే ఈ పథకం యొక్క ముఖ్యోద్దేశం. ఆధునిక పద్ధతులద్వారా కంపోస్టు తయారు చేయడమవుతుంది. 1957-58 సంవత్సరంలో ఈ పథకానికి ఆంధ్రప్రాంతంలోని 15 సామాజికాభి వృద్ధి బ్లాకులలోను, 20 జాతీయ విస్తరణ సేవా కేంద్రాలలోను, 10 అనంతర తీవ్ర కృషి బ్లాకులలోను, తెలంగాణా ప్రాంతంలోని 7 సామాజికాభివృద్ధి బ్లాకులలోను, 7 జాతీయ విస్తరణ సేవా కేంద్రాలలోను, 2 అనంతర తీవ్రకృషి బ్లాకులలోను అమలు జరుపవలెనని తలపెట్టబడింది.

# తెలంగాణా

## విత్తనాల పంపిణీ

ఈ పథకం క్రింద వ్యవసాయ శాఖ ఆజమాయిషీ క్రింద స్వంత భూములలో స్వచ్ఛమైన విత్తనాలను పండించే రిజిస్టర్డు వ్యవసాయదారుల వద్దనుంచి వరి, జొన్న, గోధుమ, మొక్కజొన్న, ప్రత్తి, ఆముదాలు, చెరకు మొదలగు పైరుల మేలురకం విత్తనాలను కొని తెలంగాణా ప్రాంతంలోని వ్యవసాయదారులకు సబ్సిడీ రేట్ల ప్రకారం పంపిణీ చేయడమవుతుంది. 1957 58 సంవత్సరంలో 96,200 మణుగుల వరి విత్తనం, 5800 మణుగుల జొన్న విత్తనం, 1840 మణుగుల గోధుమ విత్తనం, 9800 మణుగుల మొక్కజొన్న విత్తనం, 290 మణుగుల అపరాల విత్తనం పంపిణీ చేయబడగలవు.

## పచ్చిఆకు ఎరువు పంపిణీ

తెలంగాణా ప్రాంతంలో పచ్చి ఆకు ఎరువు ఉపయోగమును ప్రోత్సహించే ఉద్దేశంతో జనుము, ధ్యాంచా (ఒకరకం జీలుగ) వంటి పచ్చి ఆకు ఎరువు విత్తనాలను సబ్సిడీ రేట్ల ప్రకారం రైతులకు పంపిణీ చేయవలెనని తలపెట్టబడింది. 1957-58 సంవత్సరంలో 6800 మణుగుల పచ్చి ఆకు ఎరువు విత్తనం పంపిణీ చేయబడుతుంది. ఇలాంటి పంపిణీలో రైతులకు మణుగు 1 కి 1 రూపాయి సబ్సిడీ ఇవ్వబడగలదు.

## మిడతల నివారణ పథకం

ఇది యూనియన్ ప్రభుత్వం తలపెట్టిన సమన్వయ పథకం. దీనికయ్యే ఖర్చును యూనియన్‌లోని అన్ని రాష్ట్రాలు ఆయారాష్ట్రాలలోని మిడతల ఉపద్రవమును బట్టి, పైరు వేయబడు భూములను బట్టి భరించవలసి వుంటుంది. ఈ పథకం కొరకై తెలంగాణా ప్రాంత భాగంగా రూ 0 84 లక్షలు కేటాయింపబడ్డవి.

## ట్రాక్టర్లతో సేద్యం

తెలంగాణా ప్రాంతంలో భూముల్లను దున్నడానికై సబ్సిడీ రేట్ల ప్రకారం ట్రాక్టర్లను సప్లయి చేయవలెనని తల పెట్టబడింది. 1957-58 సంవత్సరంలో ప్రభుత్వ ట్రాక్టర్ల 11,275 ఎకరాలను దున్నగలవు.

అయితే వ్యవసాయ శాఖ ట్రాక్టర్లే ఈ విషయంలో రైతుల అవసరాలను తీర్చజాలవు. అందుచేత ట్రాక్టర్లతో భూమి దున్నే పనిని వ్యవసాయ ఆజమాయిషీ క్రింద ట్రాక్టర్లును కల్గివున్నట్టి ప్రైవేటు ఏజన్సీలకు కూడా అప్పగించవలెనిని తల పెట్టబడింది. ఇందు కొరకై అట్టి సంస్థలకు 1957-58 సంవత్సరంలో రూ 5000/లు అప్పు ఇచ్చి సహాయం చేయడమవుతుంది.

## పశుగ్రాస పరిశోధన పథకం

ఈ పథకము ననుసరించి పశుగ్రాసమును అభివృద్ధి పరిచే పరిశోధనా కార్యక్రమం రాజేంద్ర నగర్ లో అమలు జరుపబడుతుంది. ఈ పథకం మొదట ఒక సంవత్సరం వరకే తలపెట్టబడింది. అంటే దీని గడువు 1957 మార్చి 31 తేదితో ముగుస్తుంది. అందుచేత ఈ పథకమును 1.4.1957 తేది నుంచి మరి నాలుగేండ్ల పాటు అమలు జరుపవలెనని సంకల్పించబడింది.

## చెరకు పరిశోధనా పథకం

రాష్ట్రమునకు తగినట్టి మేలు రకపు చెరకును (అంటే ఎక్కువ పంటను ఇవ్వగలదాన్ని) ఎన్నిక చేయడమూ, తగువిధంగా ఎరువుల వాడకాన్ని. సేద్య పద్ధతులను నిర్ణయించి ఉత్పత్తి ఖర్చులను తగ్గించడమూ ఈ పథకం యొక్క ముఖ్యోద్దేశం. అందుచేత ఈ పథకము ననుసరించి అనేక పరిశోధనలు జరుపబడుతవి. ఈ పథకం మొదట 1954-55 లో రెండేండ్ల కొరకు తలపెట్టబడింది. 1957-58 లో కూడా దీనిని అమలు జరుపవలెనని నిర్ణయించబడింది.

## మొక్కల తోటల విస్తరణ

పండ్లమొక్కలను, రోడ్ల ప్రక్కల ఇతరత్రా వేయదగు మొక్కలను పెంచి సేద్యదారులకు సప్లయి చేయడమే ఈ పథకం యొక్క లక్ష్యం. 1957 58 సంవత్సరంలో ఈ పనిని రుద్రూరులోని ఉద్యానకృషి విభాగం రూ 0.01 లక్షతో అమలు జరుపుతుంది.

## ఉద్యాన కృషి విభాగం

మేలురకం పండ్లమొక్కలకు, ఇతర మొక్కలను సప్లయిచేసే ఉద్దేశంతో వ్యాపార సంబంధమైన తోటలు, మొక్కల తోటల స్థాపన పనిని ప్రస్తుతం రుద్రూరులోని ఉద్యాన కృషి విభాగం నిర్వహిస్తూన్నది. అంతేగాక వృక్షజాతులు, ఎరువులకు సంబంధించిన ప్రయోగాలను కూడా ఈ విభాగం నిర్వహిస్తున్నది. 1957-58 సంవత్సం లో పోక, మిరియం, కొబ్బరి మొక్కల ప్రయోగములను జరుపవలెనని తలపెట్టబడింది.

## పరిశోధన ప్రయోగశాలలు

తెలంగాణా ప్రాంతంలో వ్యవసాయ విభాగానికి సంబంధించి వున్న ప్రయోగశాలలు చాలా వాటిలో

ఆధునిక యంత్ర పరికరాలు రసాయిన పదార్థాలు లేవు. కనుక ప్రయోగశాలలు క్రమంగా పనిచేసేటట్లు చేయడానికై 1957-58 సంవత్సరం లో రూ 0.70 లక్ష విలువ గల యంత్రాలను, రసాయన పదార్థములను కొనవలెనని తలపెట్టబడింది.

ఇతర ప్రాంతాల వ్యవసాయ క్షేత్రాలతో పోల్చి చూచినట్లయితే తెలంగాణాలోని ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు వెనుకబడివున్న వనేచెప్పాలి. అందుచేత ఈ క్షేత్రాల అదనపు అవసరాలను తీర్చడానికై రూ 0.85 లక్ష కేటాయింపబడ్డవి. ఈ క్షేత్రాల కార్య కలాపాలను హెచ్చించడానికి కూడా తగు అవకాశం కల్పించబడింది.

## వి త్తనాల క్షేత్రాలు

1957 58 సంవత్సరం లో తెలంగాణాలో 24 విత్తనపు క్షేత్రాలు, 24 వి త్తనపు స్టోర్లు నెలకొల్పబడగలవు. జిల్లాలలోని రైతులకు నమ్మకమైన వి త్తనాలను, నారును, పండ్ల మొక్కలను లభింప జేయడానికై ప్రస్తుతం 6 జిల్లాలలోని జిల్లా ప్రధాన కేంద్రాలలో మొక్కల పెంపకపు తోటలను వేయవలెనని కూడా సంకల్పించబడింది.

## జొన్న పరిశోధనా కేంద్రం

తెలంగాణా ప్రాంతంలో పేద ప్రజలకు జొన్నలే ముఖ్యమైన ఆహారధాన్యము. అనేక రకాల జొన్నలు న్నవి. అయితే ఏఒక్క రకం కూడా ఈ ప్రాంతంలోని అన్ని భాగాలకూ యోగ్యమైనది కాదు. తెలంగాణాలో తూర్పు భాగం వాతావరణం, వర్షపాతం, భూసారం విషయాలలో విశిష్టమైన ప్రాంతం. ఈ ప్రాంతానికి తగిన జొన్న రకాన్ని రూపొందించేందుకై ప్రస్తుత సంవత్సరంలో రూ 0.13 లక్ష ఖర్చుతో వరంగలులో జొన్న పరిశోధ నా కేంద్రమును స్థాపించవలెనని తల పెట్టబడింది.

1957-58 సంవత్సరంలో మొత్తం రూ 0.19 లక్ష ఖర్చుతో రాజేంద్రన నగర్ లోను, దిండిలోను జొన్నకు సంబంధించిన పరిశోధనలను జరిపించవలెనని నిర్ణయింపబడింది.

## వర్షాధారంవల్ల పండే వరిపథకం

ఆదిలాబాదుజిల్లాలో వర్షాధారంవల్ల సేద్యంచేయబడే ప్రాంతాలలో ఎక్కువ పంట దిగుబడి నివ్వగల వడ్ల రకాలను కనుగొన డానికై ఈ పథకం 1957 58 సంవత్సరంలో అమలు జరుపబడవలెనని సంకల్పించబడింది.

## పంటల వాతావరణ పరిశీలన పథకం

ఈ పథకం ఇప్పుడు తెలంగాణా ప్రాంతంలోని వరంగలు, దిండి మున్నగుచోట్ల అమలు జరుపబడుతున్నది. అయితే ఈ రెండుచోట్ల జరిగే పరిశీలనలు జొన్న, గోధుమ, ప్రత్తి, వేరుసెనగ, పైరుల వరకే పరిమితమై వున్నవి. తెలంగాణా ప్రాంతంలో వరి కూడా ముఖ్యమైన పంటయే. కాని ఈ పంట విషయంలో వాతావరణ సంబంధమైన పరిశీలనలు చేయడం, వాటిని వ్రాసి వుంచడం జరుగడం లేదు. అందుచేత 1957 58 సంవత్సరం లో రుద్రూరులో వరిపైరు వాతావరణ పరిశీలన కార్యమును ఆరంభించవలెనని తలపెట్టబడింది. రుద్రూరులో ఆధునిక యంత్ర పరికరాలుగల వాతావరణ పరిశోధక కేంద్ర మొకటి వున్నది.

## ఓషధి విభాగాం

తెలంగాణా ప్రాంతంలోని ఉద్భిజ్జ జాతుల విశేషములను, వాటి రకాలను, వాటి సహజ స్వభావాలనుగూర్చి సమాచారమును సేకరించేందుకై రాజేంద్ర నగర్ లో 1957 58 సంవత్సరంలో చిన్న ఔషధుల తోటను వేయవలెనని సంకల్పించబడింది.

## నూనె గింజల పరిశోధన

ఈ పథకం క్రింద నూనె గింజలకు సంబంధించిన సమస్యలను పరిశీలించడానికై కరీంనగర్ లో ప్రాంతీయ నూనె గింజల పరిశోధన కేంద్రమును నెలకొల్పవలెనని తలపెట్టబడింది. ఈ పథకమును 1957 58 సంవత్సరంలో రూ. 0.58 లక్ష ఖర్చుతో అమలు జరుపడానికై భారతీయ కేంద్ర నూనె గింజల కమిటీవారు ఆమోదం తెలిపారు. కేంద్రం ఈ పథకం కొరకు రూ. 0.06 లక్ష గ్రాంటు ఇవ్వగలదు.

## చెరకు

తెలంగాణాలో చక్కెర ఫ్యాక్టరీలున్న ప్రాంతాలలో అభివృద్ధి కార్యక్రమమును తీవ్రతరం చేయడం ద్వారా చెరకు పంటను నాణ్యములోను, పంట దిగుబడిలోను వృద్ధిచేయడానికి ఎంతో అవకాశమున్నది. అందుచేత ఫ్యాక్టరీ ప్రాంతాలలో 1957-58 సంవత్సరంలో అదనంగా మరొక కేంద్రాన్ని తెరువవలెనని సంకల్పించబడింది. తలపెట్టబడిన అభివృద్ధి కార్యక్రమంలో ఎరువుల సప్లయి, రోగాలురాని మేలురకం చెరకు వి త్తనం పంపిణీ, మంచినీటి పారుదల వసతి కల్పన మొదలగు పనులున్నవి.

## కొబ్బరి ఉత్పత్తి

ఈ పథకం క్రింద నీటి పారుదలసౌకర్యంగల ప్రాంతాలలో ఏ ప్రాంతంలో కొబ్బరి పంట వేయడానికి అవకాశమున్నదో సర్వే జరుపడమవుతుంది. మేలు రకం కొబ్బరి మొక్కల పెంపకానికి తోటలు ఎక్కడ వేయవచ్చో పరిశీలింపబడుతుంది.

## ఆముదాలు

నీటి కొరత వున్నప్పటికీ ఆముదపు పైరు ఎలా ఎంత వరకు నిలువగలదో, ఆముదపు రూపనిర్మాణ, ప్రకృతి విశేషాలేమిటో, వాటికి కార్య కారణాలేమిటో పరిశీలించడం ఈ పథకం ముఖ్యోద్దేశం. మొత్తం రూ. 0.11 లక్ష ఖర్చుతో ఈ పథకమును అమలు జరుపవలెనని తలపెట్టబడింది.

## మిరపకాయల అభివృద్ధి

మిరపకాయలకు విదేశ మార్కెట్ల గిరాకీ వుంది. అందుచేత 1957-58 సంవత్సరంలో పది ఎకరాల భూమిని సేకరించి దానిలో ఎక్కువ పంట దిగుబడినిచ్చే మేలురకం మిరపకాయ రకాల పెంపకం జరుపబడుతుంది.

## మామిడి పరిశోధన పథకం

ఈ పథకం క్రింద మామిడి ఉత్పత్తిని అభివృద్ధి పరచడానికై సంగారెడ్డిలోని మామిడి పరిశోధక కేంద్రంలో సాంకేతిక కార్యక్రమం చేపట్టబడుతుంది. మామిడి పరిశోధన కార్యక్రమమును తీవ్రతరం చేయడానికై 1957-58 సంవత్సరంలో 50 లేక 60 ఎకరాల భూమిని సేకరించవలెనని తలపెట్టబడింది.

## చేదుడు నీటికట్టు పథకం

నదుల ఒడ్డులపైన, కాలువల ఒడ్డులపైన అయిను చేదుడు నీటికట్టు పథకాలు ప్రారంభింపబడగలవు. ఒక్కొక్క పథకం క్రింద 200 ఎకరాలకు సాగు నీరు లభించగలదని ఆశింపబడుతున్నది.

---

# "ఆంధ్రప్రదేశ్" పత్రిక చందా ఫారము

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌరసంబంధముల శాఖ
డైరెక్టర్ గారికి,
హైదరాబాద్ దక్కన్—1

అయ్యా,

నేను "ఆంధ్రప్రదేశ్" పత్రిక చందాదారును కాదలచుకున్నాను.————
తేదిన మనియార్డరు ద్వారా సంవత్సరచందా రూ 1-50 పైసలు పంపుతున్నాను.

పేరు............................................................................
(స్పష్టంగా)

చిరునామా.......................................................................
(వివరంగా)
..............................................................
..............................................

దయచేసి "ఆంధ్రప్రదేశ్" పత్రిక తెలుగు/ఇంగ్లీషు/ఉర్దూ పత్రిని పంపగలరు.

భవదీయుడు

తేదీ.............................        ..................................

# నాగార్జునకొండ

## శ్రీ యస్. ఆర్. బాలసుబ్రహ్మణ్యం

నాగార్జునకొండ— పూర్వం ఒకప్పుడు హిందూ బౌద్ధ సంస్కృతీ విజ్ఞానములకు నిలయం; ఈ నాడది బహుళార్థ సాధకమైన నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మింపబడుతున్న సుక్షేత్రం. రెండవ పంచవర్ష ప్రణాళిక క్రింద అదనంగాసాగు నీటి సరఫరాకూ, జల విద్యుచ్ఛక్తి ఉత్పత్తికీ తలపెట్టబడిన ప్రాజెక్టులలో నాగార్జునసాగర్ బృహత్తర మైనది. ఈ పథకానికి ఇంతవరకు 10 కోట్ల రూపాయలకు పైగా కేటాయింప బడినవి. ఈ పథకం 1959 లో పూర్తి అయినప్పుడు అపూర్వమైన శిల్పసంపద నిక్షిప్తమైవున్న ఈ ప్రాంతమంతా నీటమునిగి పోగలదు. అందుచేతనే ఈ ప్రాంతమంతటినీ త్రవ్వి శిల్పసంపదను బయటికి తీయటానికిగాను భారతప్రభుత్వం దాదాపుగా 25 లక్షలు ఖర్చుపెట్ట బోతున్నది. అలా వెలికి తీయబడిన శిల్పాలు, ప్రాచీనావశేషాలుఅన్నీ ఈ ప్రాంతంలో ఒక కొండపై కట్టబడే మ్యూజియంలో భద్రపరచబడుతవి. అప్పుడిది అమూల్య శిల్పసంపదతో, ప్రకృతి సౌందర్యంతో ఎందరో ప్రయాణీకులను ఆకర్షించగల ప్రధాన కేంద్ర మవుతుంది.

నాగార్జునకొండ రమణీయమైన లోయ ప్రదేశంలో వున్నది. ఈ లోయ అంతటా చిన్నచిన్న పర్వత శ్రేణు లున్నవి. వాటిచుట్టూ కర్నూలు జిల్లాలోని నల్లమల కొండలున్నవి. నాగార్జునకొండ కృష్ణానది కుడితీరమున వున్నది. కృష్ణానది ఈ కొండను దాటిపోయిన తరువాతనే డెల్టాప్రాంతంలో ప్రవేశిస్తుంది. నాగార్జున క్షేత్రం



నాగార్జునకొండ త్రవ్వకాలలో బయల్పడిన పురావస్తు శిల్పాలను రాష్ట్రపతి వీక్షిస్తున్నారు



నాగార్జునకొండ పురావస్తు విశేషాలను దర్శిస్తున్న రాష్ట్రపతి

గుంటూరు జిల్లాలోని పల్నాడు తాలూకాలో చేరి వున్నది. హైదరాబాదునుంచి దాదాపు నూరుమైళ్ళ దూరంలోను, మాచెర్లనుంచి 16 మైళ్ళ దూరంలోను ఈ క్షేత్రమున్నది. మాచెర్ల దక్షిణరైల్వేలో గుంటూరు-మాచెర్ల సెక్షన్‌లోవుంది. నాగార్జునసాగర్ ప్రాజెక్టు పథకము ననుసరించి గుంటూరు—మాచెర్ల రైలుమార్గమును డాముస్థలం వరకూ పొడిగించ వలెనని తలపెట్టబడింది. డాముస్థలానికి దిగువన కృష్ణానదిపై రోడ్డువంతెన ఇటీవలనే కట్టబడింది. ఈ వంతెనపై ఇప్పుడు రాకపోకలు సాగుతున్నవి. హైదరాబాదు వైపు రోడ్డుమార్గాన్ని అభివృద్ధి పరచడానికై నల్లగొండనుంచి అల్వాల, చిలకుర్తిల మీదుగా డాముస్థలానికి వెళ్ళే రోడ్డుపై బ్లాకు టాప్ వేసి దీనిని కృష్ణాలోయ ఎడమవైపునవున్న భువనగిరి రైలుస్టేషన్‌తో కలుపవలెనని ప్రయత్నం చేయబడుతున్నది.

## ఆచార్య నాగార్జునుడు.

ఈ కొండకూ, ఈ క్షేత్రానికీ ఈపేరు రావడానికి కారణం మహాయాన బౌద్ధంలో మాధ్యమిక వాదాన్ని ప్రచారం గావించినట్టి ఆచార్య నాగార్జునుడు ఈ ప్రాంతంలోనే కొంతకాలం నివసించడం ఈయన. మహాయాన బౌద్ధమునకు పోషకుడైన కనిష్క చక్రవర్తికి సమకాలికుడు. ఆచార్య నాగార్జునుడు తన జీవితంలోని చివరిభాగం శ్రీ పర్వతంపైన ఒక విహారంలో గడపినట్లు టిబెట్టు దేశచరిత్రల వలన తెలుస్తున్నది. శ్రీ పర్వత మనగా కర్నూలు జిల్లాలోని శ్రీశైలంనుంచి నాగార్జున కొండవరకు గల నల్లమల కొండలని గ్రహించవలసి వున్నది.

ఆ కాలంలో ఆంధ్రదేశంలో గోలి, జగ్గయ్యపేట, ఘంటసాల, భట్టిప్రోలు, అమరావతి మున్నగునవి ప్రసిద్ధ బౌద్ధ కేంద్రాలు. అమరావతిలో పెద్ద బౌద్ధ స్తూపమ వుండేది. సుప్రసిద్ధమైన ఈ స్తూపంనుంచి వెలికి తీయబడిన క్రీ॥ శ॥ రెండు, మూడవ శతాబ్దాలనాటి శాసనాల వల్ల నాగార్జునుడు. ఆ స్తూపంచుట్టూ రాతిప్రాకారాలు నిర్మించినట్లు తెలియవస్తున్నది. దీనినిబట్టి నాగార్జునుడు తన జీవితం చివరిదశను నాగార్జున కొండప్రాంతంలోని ఒకానొక విహారంలో గడపినట్లు విదిత మవుతున్నది.

ఇచ్చట ఆయన నివసించిన కాలంలో మహాయానబౌద్ధం ఈ ప్రాంతంలో ఉచ్ఛస్థితిలో వున్నది.

## ఇక్ష్వాకులు.

శాతవాహనులు (లేక ఆంధ్రభృత్యులు) క్రీ॥ శ॥ 2వ శతాబ్ది చివరిభాగంలో, 3వ శతాబ్ది ఆరంభదశలో పతనమై పోగా వారితరువాత కృష్ణాలోయను దక్షిణ ఇక్ష్వాకు వంశీయులు పరిపాలించారు. (క్రీ॥ శ॥ 210—260). అయోధ్యను పరిపాలించిన ఇక్ష్వాకులువేరు. వీరువేరు. ప్రాకృత భాషలోను, బ్రాహ్మీలిపిలోనుగల స్థానిక శాసనములను బట్టి దక్షిణ ఇక్ష్వాకు వంశీయులలో ముగ్గురు రాజుల పేర్లు మనకు తెలియవస్తున్నవి. ఒకరు శాంతమూలుడు. రెండవవారు వీరపురుష దత్తుడు. మూడవ వారు బాహుబల శాంతమూలుడు. వీరిరాజధాని విజయపురి, అంటే ఇప్పటి నాగార్జునకొండ లోయ ప్రదేశమన్నమాట. వీరు మహాబలవంతులు. ఎంతో ప్రాబల్యం గలవారు. వీరు ఉత్తరకెనరా ప్రాంతపు వనవాస మహారాజ వంశములతోను, ఉత్తర భారతంలో ఉజ్జయిని రాజధానిగా పరిపాలన జేసిన చాస్తానా వంశపు సత్రపులతోను వైవాహిక సంబంధములను కలుగజేసుకున్నారు. వీరు వైదిక మతాను యాయులు. యజ్ఞయాగాదులను చేసినవారు. వీరిలో మొదటివాడగు శాంతమూలునికి ఈ దిగువ బిరుదములున్నట్లు అయన కుమారుడు వేయించిన శాసనములవల్ల తెలియవస్తున్నది. "అగ్నిహోత్రి అగ్నిష్టోమములను, వాజపేయ అశ్వమేధములను ఆచరించి. కోట్లాది బంగారు నాణెములను, వేలాది హైనులను, లక్ష హాలదానమును చేసిన మహాపురుషుడు" అటువంటి యజ్ఞములను జరిపిన యజ్ఞవాటిక, యజ్ఞములో బలి ఇవ్వబడిన ఒకానొక గుర్రపు అస్థిపంజరము ఇటీవల త్రివ్వకాలలో బయటపడినవి. అయితే దక్షిణ ఇక్ష్వాకు వంశీయుల మహారాణులు మాత్రం బౌద్ధమతాభిమానులు. అందుచేతనే వారు ఈ క్షేత్రంలో నిర్మింపబడిన కట్టడాలకు, చారిత్రక శిల్పాలకు ఎంతగానో సహాయంచేశారు. వీరిలో ముఖ్యంగా మహాదేవి శాంతిశ్రీ ప్రత్యేకంగా చెప్పుకోదగినది. ఈమె మహారాజ శాంతమూలునికి సోదరిఅనీ, పుకియవంశీయుడగు మహాసేనాపతి కందిశ్రీకి ధర్మపత్ని అనీ, హమ్మసిరినికునికి సోదరిఅనీ, కందసాగరమ్మకునికి తల్లిఅనీ, ఆకాలంలో రాజ్యాధిపతి అయిన శ్రీ వీరపురుష దత్తునికి మేనత్తఅనీ తెలియవస్తున్నది. వీరపురుషదత్తుని పరిపాలన ఆరంభమైన ఆరవ సంవత్సరంలో మహాదేవి శాంతిశ్రీ బౌద్ధ సంఘారామములకు విలువైన కానుకలిచ్చినదనీ, కొన్ని కట్టడములనుకూడా నిర్మింపజేసినదనీ తెలుస్తున్నది. ఈమె బుద్ధుని గౌరవార్థం మహాచైత్యమును నిర్మింప జేసినది. ఆచైత్యంయొక్క ప్రదక్షిణమార్గం చుట్టూవుండే నాలుగు తోరణద్వారాలకు ఎదురుగా ఆయక స్తంభములున్నవి. ఈ స్తంభాలు హైందవ దేవాలయములలోని బలిపీఠం, ధ్వజస్తంభముల వంటివి. ఆయక స్తంభముల పైగల శాసనములలో మహాదేవి శాంతిశ్రీ యొక్క దాతృత్వం ప్రస్తుతింప బడింది. విజయపురికి, ఇచ్చటగల మహాచైత్యమునకు మరొక విధంగాకూడా విశిష్టత వున్నది. ఏమిటంటే ఇచట బుద్ధదేవుని ధాతువు ప్రతిష్ఠంచేయ బడింది. ఈలోయలో త్రవ్వకాలు జరుగుతుండగా ఒక బంగారు పేటికలో ధాతువుముక్క కన్పించినది, బహుశా ఇది బుద్ధుని అసలైన ధాతువు అయివుంటుంది. రాజవంశమునకు చెందిన మరి నలుగురు స్త్రీలు మహాదేవి శాంతిశ్రీకి ఆమె తలపెట్టిన కార్యములో సహాయపడినారు. వారిలో ఒకామెపేరు మహాదేవి రుద్రభట్టారిక. ఈమె ఉజ్జయినీ సాకరాజు వంశమునకు చెందినదని చెబుతారు. ఈమె ఒక ఆయకస్తంభమును నిర్మింప జేయడమేగాక, 170 దీనారి మాసకములను-అనగా భారతనాణెములను దానంగా కూడా ఇచ్చిందట. ఈనాణెములు రోమన్ చక్రవర్తి దెనారియస్ నాణెములను పోలివున్నవి. దీనివల్ల రోముసామ్రాజ్యం వైభవోన్నత దశలోవున్నప్పుడు ఆసామ్రాజ్యానికీ భారతదేశానికి వాణిజ్య సంబంధమున్నట్లు విదితమవుతుంది.

మహాదేవి శాంతిశ్రీయే మహాచైత్యమును కట్టించిందాలేక ఆమెదానిని పునర్నిర్మించిందా ఎవరూ చెప్పజాలరు. బహుశా ఆమె రాతికప్పును, ఆయక స్తంభములను, రాతి ప్రాకారములను కట్టించి ఉంటుంది. మహాచైత్యానికి తూర్పుగా ఒక విహారమును, బహుభుజాకారముగల ఆలయమును గూడా ఈమే నిర్మింపజేసింది. ఈ పనులలో చాలా భాగంపనులను, బౌద్ధ సంస్థలకు సంబంధించిన ఇతర ధర్మకార్యాలను ఈమె మహారాజవీర పురుష దత్తుడు రాజ్యానికి వచ్చిన 6వ సంవత్సరం మొదలు 18వ సంవత్సరం లోపల జరిపించింది. వీర పురుషదత్తుని పరిపాలన ఆరంభమైన ఆరవ సంవత్సరములో మహాచైత్య ప్రతిష్ఠాపన జరిగింది.

మహాచైత్యానికి తూర్పున రెండు ఫర్లాంగుల దూరంలో మరికొన్ని చారిత్రక కట్టడాలు-రెండు విహారాలు, మూడు బహుభుజాకార ఆలయములు, నహరవబోడు అను కొండపై రెండు స్తూపముల శిధిలావశేషములు వున్నవి. ఈ విహారములలో ఒకదానిని పూర్వం చూల ధర్మగిరిఅని వ్యవహరించేవారు. ఇచటనే వైశ్యకులానికి చెందిన బోధిశ్రీ అను ఉపాసిక తన పాత్రత నిమిత్తము, తన బందువుల పాత్రత నిమిత్తము బహుభుజాకారముగల ఒక ఆలయమును, సింహళబౌద్ధ భిక్షువులకు



మహాస్తూపం—నాగార్జునకొండ

ఒక విహారమును నిర్మింప జేసింది. ఈ సింహళ బౌద్ధ భిక్షువులు కాశ్మీరు, గాంధారము (పాకిస్తానులోని పెషావరు ప్రాంతం), చైనా, తోసాలి (కళింగదేశం లేక నేటి ఒరిస్సా ప్రాంతం), అపరంత (పశ్చిమ భారతదేశంలోని బొంబాయి ప్రాంతం), వంగ (బెంగాలు), వనవాస (ఉత్తర కెనరా), యవనదమిల (తమిళనాడు), తంబపన్ని ద్వీపం (సింహళము) మున్నగు ప్రాంతాలలో బౌద్ధమతం ప్రచారం చేశారు.

ఈ చారిత్రక కట్టడములను బట్టి బౌద్ధమతావలంబి అయిన భారతదేశానికి ఆశియాఖండలోని పెద్ద భూభాగంపై మతవిషయకంగా కళావిషయకంగా, అధ్యాత్మికంగా ఎంతటి ప్రాబల్యముండేదో విదితమవుతున్నది. అశోకుడు వ్రాకుచ్చినట్లు ఇది ధర్మ విజయం. ధనంకోసం. అధికారం కోసం చేయబడ్డ దండయాత్ర కాదు. 18, 19 శతాబ్దాలలో పాశ్చాత్య సామ్రాజ్య వాదులు రాజ్యాధికారం కోసం వాణిజ్య ప్రాబల్యం కోసం, కేవలం ఐహిక సంబంధమైన ఔన్నత్యం కోసం చేసినటువంటి పని కాదు.

కొండ దిగువన విశాలమైన స్థలమున్నది. ఇచ్చట పూర్వం గొప్ప బౌద్ధ విద్యా పీఠం వుండేదని తెలుస్తున్నది. అది విద్యార్థులకు నివాసవసతిగల విశ్వ విద్యాలయం. అందులో సంస్కృత భాష, హిందూ బౌద్ధతత్వ శాస్త్రములు, రాజకీయ శాస్త్రము, కళలు బోధింపబడేవి. స్త్రీలకు కూడా ఈ విశ్వవిద్యాలయంలో ప్రవేశమివ్వబడేది. వారు నివసించడానికి ప్రత్యేకంగా అన్ని సౌకర్యాలు గలవసతి గృహముండేది. నలంద, తక్షశిల, తదితర బౌద్ధ విశ్వ విద్యాలయాలవలెనే ఈ విశ్వ విద్యాలయానికి కూడా విదేశాలనుంచి విద్యార్థులు వచ్చి చదువుకొనేవారు. ఆ నాడు బౌద్ధ ప్రపంచంలో ఆచార్య నాగర్జునుని పేరు సుప్రసిద్ధము. ఇచ్చట సింహళ ద్వీపపు బౌద్ధ భిక్షువులకు ఒక చైత్యము అంకిత మివ్వబడింది. వారు భారతదేశమంతటా ఇంకా తదితర ప్రాంతాలలో బుద్ధుని సందేశమును ప్రచారం చేశారు. కనుకనే బౌద్ధ మతతత్వమును, శాస్త్రమును తెలుసుకొనగోరిన విదేశాల విద్యార్థులు ఇచ్చటికి వచ్చి మహాయాన సాంప్రదాయమునకు ఆచార్యుడైనట్టి

నాగార్జునుని పాదపద్మముల మ్రోల కూర్చొని ఆయన బోధామృతమును గ్రోలడానికి ఉవ్విళ్ళూరు తూవుండే వారు.

## చారిత్రక అవశేషాలు.

ఇటీవల ఈ క్షేత్రంలో జరుపబడిన త్రవ్వకాలలో స్తూపములు, విహారములే గాక పాతరాతి యుగపు పని ముట్లు, క్రొత్త రాతియుగపు పరిశ్రమలు, ఒక ప్రాసారపు శిథిలాలు, ఒకప్రాకారం, మండపములు, రోమన్ నాణెములు వేటగాని వేషంలోవున్న సిద్ధార్థుని కంచు విగ్రహం, కార్తి కేయాలయం, స్టేడియం, అశ్వమేధయజ్ఞ వాటిక, యజ్ఞంలో బలిఇవ్వబడిన గుర్రపుఅస్థి పంజరం,మొదలగునవి.బయల్పడినవి.ఇక్ష్వాకువంశరాజులు స్కందుని పూజించే వారని స్థానిక శాసనములను బట్టి తెలియవస్తున్నది. వీరపురుషదత్తుని తండ్రియైన శాంతమూలుడు " విరూపాక్షపతి మహాసేన పరిగా హితస్స " అను బిరుదుతో ప్రశంసింప బడినాడు.ఆతడు మహాసేనుని (స్కందుడు లేక కార్తి కేయుడు) భక్తుడు. మహాసేనుడు విరూపాక్షులకు స్వామి. కార్తి కేయుని ప్రతిమ ఈ ప్రాంతంలో లభించడాన్ని బట్టి కార్తి కేయుడు ఇక్ష్వాకుల నాయకుడని ధృవపడుతున్నది.

ఇచ్చట సేకరింపబడిన శిల్ప ఖండాలలో చైత్యాన్ని అలంకరించడానికై చేయబడిన పాలరాతి పలకల స్తూప పునమూనాలు, బుద్ధుని జీవిత విశేషాలను తెలుపు శిల్పాలు—మాయాదేవి స్వప్నం, లుంబినీ వనంలో బుద్ధుని జననం, బుద్ధుని జాతకమును వ్రాయించడం, కపిల్వవస్తులోని శాక్యుల ప్రాచీన దేవాలయంలో వారి ఇలవేల్పు సన్నిధికి బాలుడైన బుద్ధుని తీసుకొని పోవడం, బుద్ధుడు సంసారమును, రాజవైభోగములను త్యజించి సన్యాసియై బయలుదేరి వెళ్ళడం, మారుడు, ఆయన కన్యలు బుద్ధుని లో కామ ప్రకోపనము కలిగించ ప్రయత్నించడం, బుద్ధ గయలో బుద్ధునికి జ్ఞాన జ్యోతి కన్పించడం, నలగిరి అను అడవి ఏనుగు బుద్ధునికి మోకరిల్లడం, మహా పరి నిర్వాణం మొదలగు చెక్కడాలు కలవు. బుద్ధుడు పరి పూర్ణబోధ పొందుటకు పూర్వం పూర్వజన్మలలో ఆయన చేసిన సుకృతములను తెలిపే జాతక కథలు కూడా శిల్ప ఖండాలుగా ఇచ్చట రూపొందించ బడివున్నవి.

నాగార్జున సాగర్ నిర్మాణంతో విజయపురి నీటిలో మునిగి పోతుంది. అచట శిల్పఖండాలు, చారిత్రక అవశేషాలు అన్నీ మ్యూజియంలో భద్రపరచబడుతవి. కాని విజయపురి పూర్వ వైభవానికి నాగార్జున సాగర్ జలాశయమే ఉత్తమమైన స్మారకం కాగలదు. చరిత్ర విఖ్యాత పురుషుడు చోళరాజు అయిన మొదటి రాజేంద్రుడు దక్షిణమున కన్యాకుమారి అగ్రమునుంచి జైత్రయాత్రకు బయలుదేరి ఉత్తర భారతమున గంగా తీరం వరకును, దూర ప్రాచ్యంలో కడరం వరకును జయించి, ఆ తరువాత క్రొత్తగా నిర్మింపబడిన రాజధాని గంగయకొండ చోళాపురంలో సోళగంగం అనే పెద్ద తటాకమును కట్టించి నాడట. ఆ తటాకమునకు ఆ పేరు ఎందుకు వచ్చిందీ అంటే—రాజేంద్రుని సేనాధిపతి ననగండ యాత్రలో ఏయే రాజులను గెల్చినాడో ఆ రాజుల తలలమీద గంగా జలంతోనింపబడిన బంగారు పాత్రలను పెట్టి ఆ విధంగా వారిని తమ రాజధానికి తీసుకువెళ్ళినాడట. రాజేంద్ర చోళుని తిరువలంగాడు తామ్ర శాసనంలో, ఆయన ఆస్థాన కవి ఆ తటాకమును, సువిశాలమైన జలరూపంలోనున్న జయస్తంభమని కీర్తించినట్లు వ్రాయబడి వున్నది. అట్లే విజయపురి పురావైభవానికీ, అఖండ పాండితి ప్రతిభలు సమూర్జించుకొన్న మహా పురుషుడు ఆ చార్య నాగార్జుని వ్యక్తిత్వానికీ నాగార్జునసాగరం స్మారక చిహ్నంగా వెలయగలదు.



*నాగార్జునకొండ శిల్పావశేషము*

# ఆంధ్రప్రదేశ్ చేతిపరిశ్రమలు

## అందం ఉపయోగం రెండూ మేళవించి వుండి, అందరికీ అందుబాటులో వుండే దేశీయ పరిశ్రమలు

ఆంధ్రప్రదేశ్ చేతిపరిశ్రమలు అందంలోను, పనితనంలోను, మన్నిక విషయంలోను మరే ప్రాంతపు పరిశ్రమలకూ తీసి పోవు. ఈ నాడు కూడా గ్రామీణ ప్రాంతాలలో అనుదిన ఉపయోగం కొరకు చేతితో తయారు చేయబడిన వస్తువులే వాడ బడుతున్నవి. పట్టణ ప్రాంతాల వారు కూడా యంత్రములతో చేయబడిన వస్తువులకంటే చేతిపరిశ్రమలలో తయారైన వాటికే హెచ్చు ప్రాధాన్యమిస్తున్నారు. కారణమేమంటే చేతిపరిశ్రమలలో నాజూకైన పనితనం వుంటుంది. వాటిలో ఒక విధమైన కళవున్నది. పైగా గృహోపయోగానికి అవి ఎంతో బాగావుంటాయి. కనుకనే ప్రభుత్వం మనపూర్వీకుల పనితనాన్ని చాటే ఈ పరిశ్రమలను పునరుజ్జీవింపజేసి వాటిని పోషించడానికై నిరంతరం కృషి చేస్తూవుంది.

### బొమ్మలు.

ఆంధ్రప్రదేశ్‌లో బొమ్మలు అనేకచోట్ల తయారు చేయబడుతున్నవి. కొండపల్లి, నిర్మల్, నక్కపల్లి, ఏటికొప్పాక, తిరుపతి బొమ్మల తయారీకి ప్రసిద్ధ కేంద్రాలు. ఈ బొమ్మలు, ఆటవస్తువులు యాంత్రికమైనవికావు, పిల్లలు వాటిని కదిలించితేనే కదులుతాయి. అందువల్ల పిల్లలకు మానసికంగా ఒక విధమైన సంతృప్తి కలుగుతుంది. ఈ ఆటవస్తువులలో పల్లెజీవితాన్ని చూపేవి, పశువులు, జంతువులు కూరగాయలు, పండ్లు, దేవతల ప్రతిమలు మొదలైనవి వుంటాయి.

### కొండపల్లి బొమ్మలు.

కొండపల్లి బొమ్మలు, ముఖ్యంగా గ్రామప్రజల జీవిత వైవిధ్యాన్ని చూపే బొమ్మల పూర్తిసెట్టు చూడడానికి ఎంతో బాగా వుంటుంది. ఒకటి లేక రెండు పూరిగుడిసెలు, ఆగుడిసెలలో నివసించేవారు పనిపాటలు చేసుకుంటూ వుండడం, స్త్రీ ఆవును మేపడం, లేక బావిలోనుంచి నీళ్ళు తోడడం లేదా పిండివిసరడం, పురుషుడు ఆవును లేదా మేకను మేపడం, అంబారివేసిన ఏనుగు, కల్లుగీత పనివాడు మొదలగునవి ఈ బొమ్మలలో వుంటాయి.

### నిర్మల్ బొమ్మలు.

ఈ బొమ్మలు వాస్తవికంగా వుండి, ప్రకృతిని చిత్రిస్తూ వుంటాయి. ఒక్కొక్కప్పుడు ఈబొమ్మలు ఆటవస్తువులు అసలైన వస్తువులలో కలిసివుంటే, ఏదిబొమ్మో, ఏది అసలువస్తువో కనిపెట్టడం కష్టం. అడవి మృగాలు, పెంపుడు జంతువులు, పండ్లు, కూరగాయలు, నెమిలి, రామచిలుక, కోడి, వడ్రంగి పిట్ట, గోరువంక మొదలైన పక్షిజాతులు నిర్మల్ బొమ్మలలో వుంటాయి. ఇవి స్థానికంగా లభించే పునికి కర్రతో తయారు చేయబడుతవి. వీటిపై వేయబడు రంగులు అసలు వస్తువుల రంగులకు మల్లే వుంటాయి.



*మూడవ అఖిలభారత చేతి పరిశ్రమల వారోత్సవాలు హైద్రాబాదులో 2-11-1957 తేదీన జరిగిన సందర్భంలో ప్రారంభోపన్యాస మిస్తున్న రాష్ట్రప్లానింగ్ మంత్రి శ్రీ ఎ. బి. రాజు*

### నక్కపల్లి బొమ్మలు.

నక్కపల్లి, ఏటికొప్పాక బొమ్మలు లక్కబొమ్మలు. వీనిలో వంటపాత్రలు, బండ్లు, పళ్ళికలు, ట్రేలు, రైలుఇంజన్లు, గ్రామఫోన్లు, పండ్లు, ఇతర వినోద వస్తువుల నమూనాలు వుంటాయి. ఇవి పిల్లలు ఆడుకోవడానికి ఉపయోగకరమైనవి.

గుడిహాడ సమీపంలోగల గ్రామాలలో ఇంక మన్ను బొమ్మల పరిశ్రమ, పేపర్ మిషన్ వర్కు కూడా ఈ సందర్భంలో పేర్కొనదగి వున్నవి.

### తిరుపతి బొమ్మలు.

చేవమాను కర్రతో తయారు చేయబడు తిరుపతి బొమ్మలు విశిష్టమైనవి. వీనిలో దేవతలు, మనుషులు, జంతువుల బొమ్మలుంటాయి. వీని ఎత్తు ఒక అంగుళం మొదలు ఒకటిన్నర అడుగులవరకు వుంటుంది. కొన్ని బొమ్మలు కర్రయొక్క అసలు రంగులోనే అమ్మబడుతవి. కొన్ని ఎర్రగా, పసుపు పచ్చగా వుంటాయి. మరికొన్నిటికి పెయింట్లు వేస్తారు. ఈబొమ్మలు ఎక్కువగా ఎడ్లచెరువు, మాధవామల, సెట్టిగుంట, తిరుచానూరు గ్రామాలలో తయారు చేయబడుతవి. ఇవి తిరువేంద్రం, మద్రాసు, బొంబాయి. ఢిల్లీ మొదలగు ప్రదేశాలకు ఎగుమతి చేయబడుతున్నవి.

### వరంగలు, ఏలూరు తివాచీలు.

గదికి తివాచీలు శోభను చేకూరుస్తవి. గదిలో ఎంత ఫర్నీచరు వున్నప్పటికీ. నేలపైన చక్కని తివాచీలు లేకపోతే దర్జా వుండదు.

వరంగలు, ఏలూరు తివాచీలు ఆంధ్రప్రదేశ్‌కు గర్వకారణమైనవి. 1857లో లండనులో జరిగిన బ్రిటిషు సామ్రాజ్య ప్రదర్శనంలో వరంగలు తివాచీలు ప్రదర్శింప బడినవి. వీటిని "దక్కన్ రగ్గులు"

అని వ్యవహరించేవారు, సిల్కు, నూలు, ఉన్ని దారంతో వీటిని తయారు చేస్తారు. ఉన్నిరగ్గులను, దొంతి తివాచీలను గలాచీలంటారు. రంగురంగుల ఉన్ని దొంతులను పడుగు నూలులో కలిపి ఈ తివాచీలను నేస్తారు. వీటిమీద పర్షియాదేశ సంబంధమైన డిజైనులు చిత్రింపబడుతవి. అయితే స్థానిక దృశ్యాలుకూడా వేయబడుతాయి. పశ్చిమ గోదావరి జిల్లా ప్రధానకేంద్రమైన ఏలూరు ఉన్ని, దొంతి తివాచీలకు చాలా కాలంనుంచి ప్రసిద్ధి వహించినది. 15వ శతాబ్దం మధ్య కాలం నుంచే ఇక్కడ ఈ పరిశ్రమ భారీయెత్తున కొనసాగింప బడుతున్నది. ఈ పరిశ్రమకువలసిన ముఖ్యమైన ముడిసరుకు ఉన్ని. అది స్థానికంగా లభ్యమవుతుంది. ఈజిల్లా మెట్ట తాలూకాలలో కురుములు, లేదా గొల్లలు గొర్రెలను పెంచుతారు. వాటినుంచి దాదాపు 82,000 పౌనుల ఉన్ని లభ్యమవుతుంది. పరిసరములలోనున్న తెలంగాణా ప్రాంతపు జిల్లాలనుంచి కూడా ఉన్ని సేకరింప బడుతుంది. ఏలూరు దొంతి తివాచీ నేత పనివారల సహకార సంఘం 1937లో 150 మంది సభ్యులతో ఏర్పాటు చేయబడింది. ఈ సహకార సంస్థ వెలుపలకూడా అనేకమంది తివాచీ ఉత్పత్తిదారులు పని చేస్తున్నారు. ప్రతియేటా 25,000 చదరపు గజాల తివాచీలు ఉత్పత్తి అవుతాయని అంచెనా. వీటిఖరీదు చదరపు గజం 1కి రూ. 12-8-0 మొదలు రూ. 30 వరకు వుంటుంది. ఈతివాచీలకు ఇటీవల ప్రభుత్వం ప్రమాణబద్ధమైన వివరణలను తయారు చేయించింది. ఢిల్లీలోని భారత ప్రమాణీకరణ సంస్థవారు ఆ వివరణలను తగువిధంగా పరిశీలన జరిపి వాటికి తుదిస్వరూప మిచ్చారు.

## అద్దకం వస్త్రాలు.

భారతదేశ అద్దకం వస్త్రపరిశ్రమ చరిత్రలో ఆంధ్రప్రదేశ్ అద్దకపు పనితనం అద్వితీయమైనది. ఆంధ్ర అద్దకముల కళామూల్యమును, సాంప్రదాయ రీతిని అర్థంచేసుకోవాలంటే వాటినిగూర్చి ముందు సరిగా తెలుసుకోవాలి. ఇది. దేశవాళీ పరిశ్రమ. స్థానిక అడవులలో లభించే పూవులు, ఆకులు, బెరడులతో అద్దకం రంగులను తయారు చేస్తారు. రసాయనములను బంకమన్ను, ఏటిఇసుక, పేడ మొదలగువానితో చేస్తారు. ఇక ఈఅద్దకముల డిజైనులు దేశీయ సంస్కృతికి సంబంధించి, అతిసామాన్యంగా, నిసర్గంగా, కోమలంగా వుంటాయి. ముఖ్యమైన అద్దకపు పనిరకాలలో (1) నిరోధకరీతి లేక నీలిమందు రకం (2) అద్దకపురీతి దీనినే అలిజరైన్ పద్ధతి అనికూడా అంటారు. (3) టై అండ్ డై అద్దకం.

1. నిరోధకరీతి లేక నీలిమందు పద్ధతి:- కలంకారీ అద్దకాలు. బందరు కలంకారీ అద్దకం ప్రశస్తమైనది. బట్టను రంగులోముంచి దానిపై స్థానికమైన శాకవర్ణములు అద్దుతారు. తెల్లగా వుంచవలసిన చుక్కలను కలంతో లేదా కుంచెతో ద్రవరూపంలోనున్న మైనంతో వేస్తారు. అది రంగుపూతను నిరోధిస్తుంది. కలంకారీ అద్దకంలో భిత్తిచిత్రశిల్పం అనుసరింప బడుతుంది. రామాయణ, మహాభారత గాథలు, ఇతర పురాణ గాథలు ఈ అద్దకాలలో చిత్రింపబడడం కద్దు. పాతకలంకారీ అద్దకపు వస్త్రాల ముక్కలను ఇప్పటికీ పశ్చిమ గోదావరి జిల్లాలోని పాలకొల్లు దేవాలయంవంటి దేవాలయాలలో చూడవచ్చు. ఇటీవల ఈ రకం అద్దకంతో చక్కని చీరెలు పక్కబట్టలు తయారు చేస్తున్నారు. కలంకారీలో

## సవరణ

1957 నవంబరు నెల "ఆంధ్రప్రదేశ్" సంచికలోని 17 వ పేజీలో "ఆంధ్రప్రదేశ్ రెండవ పంచవర్ష ప్రణాళిక" అను వ్యాసంలో 5వ పేరాకు బదులుగా ఈ క్రింది విధంగా చదువుకోవలెను.

> "ఇది గాక ప్లానింగ్ కమీషన్ వారు అదనంగా 29.63 లక్షలు కేటాయించారు. అంటే సహకార చక్కెర ఫ్యాక్టరీకి రూ10.95 లక్షలు వ్యవసాయానికి రూ10.95 లక్షలు, నైతికసాంఘిక సంక్షేమ పథకాలకు రూ 7.73 లక్షలు అవిభక్త హైదరాబాదు రాష్ట్ర ప్రణాళికకు కేటాయింప బడనట్టి మొత్తం నుంచి కేటాయించారు. ఈ విధంగా తెలంగాణాకు కేటాయించబడిన వ్యయాన్ని రూ 55.79 కోట్లకు పెంచడమైనది."

అనేక డిజైనులుంటాయి గనుకనూ, బంగారు జరీతో ఛాయామాత్రంగా చుట్టుగీతలు వేయబడుతవి గనుకనూ ఇవి చూడడానికి కింఖాబ్‌వలె నదరుగా వుంటాయి. కలంకారీ అద్దకాలు విరివిగా ఎగుమతి చేయబడుతున్నవి.

2. అద్దకపురీతి (మెదకురీతి):- అలిజరైన్ లేదా మెదకురీతి అద్దకాలలో జాజీములు, దస్తర్‌ఖానులు డేరాగుడ్డ గీతలు, పలంగ్‌పోష్, తెరలు, కుషను కవర్లు మొదలైనవి తయారు చేయబడుతవి. ఈ రీతిలో దుపట్టాలు, లంబాడీస్త్రీలు ధరించే లంగాలు కూడా అద్దబడుతున్నవి. హైద్రాబాదు లంబాడీ స్త్రీలు ధరించే లంగాలు, వోణీలు విదేశీయులను కూడా ఆకర్షిస్తాయి.

3. టై అండ్ డై రీతి:- పైరెండు రీతులు దేశీయమైనవి. అయితే పోచంపల్లిలో, చీరాలలో, పడుగు పేకలలో ఉపయోగింపబడు ప్రతినూలు పోగుకు మొదట ఒకనిర్ణీత శైలిప్రకారం రంగువేసి ఆతరువాత బట్టనేస్తారు. పోచంపల్లి అద్దకాలు నేరుగావేసినా అద్దకాలకంటె ఎంతోబాగా కనిపిస్తాయి. నూలు పోగులకే మొదట రకరకాల రంగులు అద్ది, ఆతరువాత వాటిని కలగలిపి నేత నేయడంవల్ల అదోకరకమైన మోస్తరు వచ్చేస్తుంది. చూడడానికి అది ఎంతో మార్దవంగా, లావణ్యంగా వుంటుంది. నూలుకట్టు, అద్దకం, నేత-ఈ మూడింటి సమ్మేళనం వల్ల చక్కని నమూనా ఏర్పడుతుంది. పోచంపల్లి చీరాల తేలియా రుమాళ్లు, మిర్యాలగూడెం చేనేత చీరెలు, ఈరకం అద్దకంలో ప్రత్యేకంగా చెప్పదగినవి. ఈమధ్య పోచంపల్లి చీరెలు స్త్రీలకు హెచ్చుగా నచ్చుతున్నవి.అందుచేతనే భారతదేశమంతటావాటికి గిరాకీ ఎక్కువగా వున్నది.

## చీరాల పేరాల ఆసియా రుమాళ్ళు

ఈ రుమాళ్ల తయారీకి చేనేత పారిశ్రామికులు అనుసరించే పద్ధతి పోచంపల్లిలో అనుసరించ బడుతున్నట్టిదే. ఈ పద్ధతి ప్రకారం చీరెలు, ఇతర వస్త్రములు ఉత్పత్తి చేయడం అవసరం.

## మహబూబ్‌నగర్ గడ్డి చాపలు

ఈనాడు చాపలు పల్లెటూళ్ళ పూరిళ్ళకేగాక ఆధునిక గృహాలకు కూడా అవసరమై వున్నవి. ఆధునిక గృహాలకు చాపలు శోభను సమకూర్చుతవి. ఇవి కూర్చోవడానికి చల్లగా, మెత్తగా వుంటాయి. బంగారు రంగు తుంగతో చేయబడే చాపల రంగు నయనానందకరంగా వుంటుంది. పైగా ఎప్పుడు అవసరమైతే అప్పుడు పరచుకొని ఆతరువాత మడిచి ఎక్కడైనా పీటిని పెట్టుకోవచ్చు. కనుకనే ఎక్కువమంది ఇప్పుడు చాపలు వాడుతున్నారు. మహబూబునగర్ జిల్లా ఎనుగొండ గ్రామంలో "బుడులు" అని వ్యవహరింపబడే ఒక తెగవారు సున్నితమైన చాపల తయారీలో నేర్పరులు. ఆగ్రామం చుట్టుప్రక్కల కుంటలలో చెరువులలో తుంగగడ్డి విరివిగా పెరుగుతుంది. ఇంకా రాష్ట్రంలో పలుచోట్ల తాటిఆకులతో చాపలు అల్లువారున్నారు.

## బీదరీ వస్తువులు.

హైద్రాబాదుకు చెందిన ఈ పరిశ్రమకు అరేబియా, పారసీక దేశాల ప్రాచీన సంస్కృతితో సంబంధమున్నది. ఉక్కు పైన లేక రాగి పైన వెండి బంగారములను పొదిగి ఈ వస్తువులను తయారు చేస్తారు. బీదరీ వస్తువులను తయారు చేయడానికి ఉపయోగింపబడు ముడి పదార్థము తుత్తునాగము, రాగి, ఇతర ధాతువులు కలిసిన మిశ్రమ లోహము. వస్తువు తయారీలో ఈ మిశ్రమ లోహం చివరకు నల్లని తారు రంగుకు మారుతుంది. అప్పుడు దానిపై తెల్లని వెండి రేఖలు వేస్తారు. నలుపుపై ఆ తెలుపు రంగు ఎంతో ముచ్చటగా కన్పిస్తుంది. ఈ వస్తువుల డిజైనులు సాధారణంగా సాంప్రదాయ రీతిలో ఉంటాయి. అయితే ఆధునిక అవసరాలు నేటి అభిరుచుల ననుసరించి కూడా బీదరీ వస్తువులు తయారు చేయబడుతున్నవి.

ప్రప్రథమంలో బీదర పరిశ్రమలో లోహంతో పళ్ళెములు, నీళ్ళ కూజాలు, హుక్కాలు, మైనపువత్తి సెమ్మెలు, సుగంధ ద్రవ్యములు పరిమళ ద్రవ్యములను భద్రపరచు పేటికలు, పూల వ్యాజులు మొదలగునవి తయారు చేయబడేవి. ఈ మిశ్రమ లోహంలో పోసిన నీటికి కొన్ని రోగము

లను కుదిర్చే ఔషధ సంబంధమైన గుణము కలుగుతుందనే నమ్మకం ప్రజలలో కలుగడంచేత ఇటీవల దీనితో తయారు చేయబడిన నీటి పాత్రలకు ఎక్కువ గిరాకీ వచ్చింది. ఇటీవల ఈ లోహంతో సిగరెట్టు చుట్టపెట్టెలు, ఆష్ట్రేలు, వ్యాజులు, చొక్కాల కప్పులింకులు, పండ్ల పాత్రలు కూడా తయారు చేయబడుతున్నవి.

## లోహసామగ్రి.

ఆంధ్ర ప్రదేశ్‌లో రాగితో, ఇత్తడితో పాన్ దానులు, అత్తరు బుడ్లు, నాగమైనపు వత్తుల సెమ్మెలు. పూల కుండీలు, వ్యాజులు తయారు చేయబడుతున్నవి. చిత్రపు చెక్కడపు పని ద్వారా డిజైనులు తయారు చేయబడుతవి. పెంబర్తి, సికింద్రాబాదు, వెల్లూరు, కాళహస్తి, ఈ పరిశ్రమకు ముఖ్య కేంద్రాలు.

## నరసాపురం క్రోచెట్ లేసు పరిశ్రమ.

నరసాపురంలోను, పాలకొల్లులోను, నరసాపురం తాలూకాలోని సుమారు 60 గ్రామాలలోను లేసు పరిశ్రమ వుంది. దీనికి కావలసిన ముడి వస్తువులు ఒక ఇనుప కొక్కెము, నూలు దారం మాత్రమే. మేలు రకం లేసు తయారీకి, డైమండు దారం ఉపయోగించబడు తుంది. ఇప్పుడీ పరిశ్రమలో దాదాపు 5000 మంది పని చేస్తున్నారు. వీరు డాయెలు, టీక్లాత్ బార్డర్లు, ఓవల్ సెంటర్లు, లేసు అంచులు మున్నగునవి తయారు చేస్తారు. ప్రపంచంలోని అన్ని దేశాలలోను గృహిణులు లేసు వస్త్రములను, లేసుతో చేయబడిన ఇతర బట్టలను ఎంతో అభిమానంగా చూచుకుంటారు. భారత దేశపు లేసు నాజూకు పనితనానికి పేరెన్నిక గన్నది. గోడల అలంకరణకు కూడా లేసు నమూనాలు ఉపయోగింప బడుతవి. ప్రతియేటా ఇచ్చటి నుంచి రూ. 5 లక్షల విలువ గల లేసు ఎగుమతి అవుతున్నది:

## వెండి నగిషీ పని

కరీంనగర్ జిల్లా అత్యుత్తమ మైన వెండి నగిషీ పనికి చాలా కాలంగా ప్రసిద్ధి జెందినది. ఇందులో స్థానిక కంసాలుల అతి సున్నితమైన పనితనం ప్రదర్శిత మవుతుంది. ఈ నాడీ చేతి పరిశ్రమ బహు అరుదై పోయింది. ప్రజ్ఞావంతులైన కొందరు వృత్తి పని వారు, కంసాలులు మాత్రమే దీనిని చేయగలరు. అతి సన్నని వెండి తీగెతో ఈ పని చేయబడుతుంది. తీగెలతో అద్వితీయమైన డిజైన్లు తయారు చేస్తారు. ఇప్పుడీ పరిశ్రమలో దాదాపు 150 మంది పనివారున్నారు. ఈ పనికి ఉపయోగింపబడే పనిముట్లు కూడా అతి సామాన్యమైనవి. ఆష్‌ట్రేలు, గాజులు, తమల పాకుల పెట్టెలు. బ్రోచీలు, బొత్తాలు, బరిణెలు, సిగరెట్ల పెట్టెలు, పూల వ్యాజులు, పతకాలు, కాగితం కోసే ఉపకరణములు, ఫొటో ఫ్రేములు, ఈ పరిశ్రమలో తయారవుతాయి. ఈ మధ్య జూకాలు, గొలుసులు, ఉంగరములు, లోలాకులు, కడియాలు మొదలగు నగలపై కూడా అపురూపమైన వెండి ఫిలిగ్రీ పని చేయబడుతున్నది. ఇట్టి నగలు పెట్టుకొనే వారికే కాక చూచే వారికి కూడా ఎంతో బాగా వుంటాయి.

## నిర్మల్ పరిశ్రమ.

నిర్మల్ పరిశ్రమ నిసర్గ సుందరమైనది. నిజంగా పేరుకు తగ్గట్టుగానే వుంటుంది. ఈ పరిశ్రమలో తయారైన వస్తువులకు పూర్వరంగంలో మెరిసే నల్లని రంగు, లేక బంగారు రంగు వేయబడుతుంది. దానిపైన ఇతర రంగుల రేఖలు వేయబడుతవి. అందువల్ల వాటి డిజైను చాలా అందంగా వుంటుంది. డిజైనుల ఎన్నిక కూడా బహు నేర్పుతో చేయబడుతుంది. ఆకులు, పూవులు, మొదలగు డిజైనులు ఎంతో పనితనంతో వెయ్యబడుతాయి. వాటిపై వెండి బంగారు రంగులు వేసి మరింత అందంగా చేస్తారు. ఆ రంగులు ఎన్నటికీ చెరిగిపోవు. నిర్మల్ ఫలకములపై బుద్ధుడు, నటరాజు, వాయిద్య గాంధ్రుడు, తులసీదాసు కవి మొదలగు వారి వర్ణ చిత్రాలు వేయబడి వుంటాయి. ఈ వర్ణ చిత్రాలను చూస్తే మొగల్ సంప్రదాయపు సూక్ష్మ వర్ణ చిత్రాలు జ్ఞాపక మొస్తాయి. ఈ

పరిశ్రమలో కుర్చీ పీటలు, కుర్చీలు, బల్లలు, టేబిల్ ల్యాంపులు, స్క్రీనులు, ప్రక్కలు, సోఫాలు, మొద లగునవి కూడా తయారు చేయబడుతవి. నిర్మల్ సిగార్ కేసులు, సిగరెట్ కేసులు అందరూ ఎరిగి నవే. నిర్మల్ వస్తువులు క్రమేణా ప్రజలలో వ్యాప్తి జెందుతున్నవి. వీటికి ఎగుమతి మార్కెట్ కూడా బాగా వుంది.

## దంతము, కొమ్ము వస్తువుల పరిశ్రమ

ఆంధ్రప్రదేశ్ చేతి పరిశ్రమలలో దంతం, తాబేటిచిప్ప, కొమ్ము పరిశ్రమలు కూడా ప్రధాన స్థాన మాక్రమిస్తవి. ఈ పరిశ్రమ విశాఖ పట్నం, సికిందాబాదులలో వుంది. దంతమును కోసి తాబేటి చిప్పల పైన, గంధపు చెక్కల పైన చిత్రంగా అమరుస్తారు. చాకులు, ఉలులు, ఆకు రాళ్ళతో ఎంతో నేర్పుతో ఈ పని చేస్తారు. కళకు నేర్పరితనానికి ఈ పని చెప్పదగింది.

## తోళ్ళ వస్తువులు

ఆంధ్ర ప్రదేశ్ లో తోలుతో స్త్రీలు పట్టుకొనే చేతి సంచులు, పర్సులు, పుస్తకాలు, అట్టలు, ఫ్యాన్సీ శాండల్సు తయారు చేస్తారు. మోడ లర్ తో వాటిపై డిజైను అచ్చు వేయబడుతుంది. శాంతి నికేతన్ పద్ధతి ప్రకారం ఈ పరిశ్రమ అభి వృద్ధి పరచబడు తున్నది.

## మేలురకం కంబళ్ళు

మహబూబునగర్ జిల్లాలో మేలు రకం కంబళ్ళు నేయబడుతాయి. వీటిరంగు నల్లగా మెరుస్తూ వుంటుంది. బట్టకూడా దట్టంగా చిక్కగా వుం టుంది. వీటికి ఉపయోగించే నూలును ఎంతో నేర్పుగా తీస్తారు. ఆ నూలుతో దేశవాళి మగ్గా లపై పెద్ద పెద్ద కంబళ్ళు నేస్తారు. ఈ కంబళ్ళపై బుటాలు, అంచులు కుట్టుతారు.

## మట్టి పాత్రలు

హైదరాబాదులో ఇటీవల మట్టి పాత్రలు తయారు చేయబడుతున్నవి. బంక మన్నుతో పూల వ్యాజులు, అష్ట్రేలు, గిన్నెలు పోత పోసి వాటిపై నూనెరంగు పెయింట్లు అద్దబడుతవి. ఆ పెయింట్లపై అక్కడక్కడా బంగారు చుక్కలు కూడా అద్దబడుతవి.

## గాజులు, గాజుపూసలు

గాజులు, గాజుపూసల పరిశ్రమ ఆంధ్ర దేశంలో చాలా కాలం నుంచి వున్నది. చిత్తూరు జిల్లా లోని పాపానాయుడు పేటలో నాణ్యమైన గాజు పూసలు తయారు చేయబడుతవి. ఈ సందర్భంలో కొంత కాలం క్రితం పాపానాయుడు పేట కేం ద్రాన్ని దర్శించిన విదేశీ నిపుణుని అభిప్రాయం గమనార్హమైనది. అతడు స్వీడన్ దేశపు గాజు పరిశ్రమ నిపుణుడు. అతడు ఆంధ్ర దేశా నికి వచ్చి పాపానాయుడు పేటకు తప్పకుండా వెళ్ళి చూడాలనుకున్నాడు. కారణ మేమంటే ఆధునిక యంత్రాల సహాయం లేకుండా అంత ఉత్తమ ప్రమాణంలో గాజు పూసలను అక్కడ చేతి పనివారు ఎలా చేయగలుగుతున్నారో స్వయంగా పరిశీలించాలని అతడనుకున్నాడు. చిత్తూరు జిల్లాలోని కాళహస్తి, పాపానాయుడు పేట, అనంతపురం జిల్లాలోని గుత్తి, విశాఖ పట్నం జిల్లాలోని సింహాచలం, మహబూబునగర్ జిల్లాలోని గాజులపేట. ఈ గాజు పరిశ్రమకు ముఖ్య కేంద్రాలు.

## జంత్ర వాయిద్యములు

ఆంధ్ర ప్రదేశ్ లో పిఠాపురంలో, బొబ్బిలిలో సరస్వతి బొమ్మతో వీణ, కృష్ణుని బొమ్మతో, మురళి, జంత్ర వాయిద్యాలు తయారు చేయ బడుతాయి.

## జనగామ పూసల బుటేదారీ పని

ఈ మధ్య జనగామ పూసల బుటేదారీ పని బాగా వ్యాప్తి జెందింది. తెల్లనివి, రంగు రల గులవి చిన్న పూసలను రవికె బట్టలపై రక రకాల డిజైనులుగా కుట్టుతారు. ఇవి చాలా ఆకర్ష వంతంగా వుంటవి. లంబాడీ దుస్తులపై అద్దాలు కుట్టుతారు. అవి కూడా చూడముచ్చటగా వుంటాయి.

## పేము వెదురు వస్తువులు

ప్రపంచంలో నాగరికత అనేది ఆరంభమైనప్పటినుంచి వెదురు అనేక పనులకు ఉపయోగింపబడుతూ వస్తున్నది. వెదురుతో, పేము బెత్తంతో బుట్టలు, టేబిల్ లాంపులు, కుర్చీలు, బల్లలు తయారు చేస్తారు.

## వస్త్ర పరిశ్రమ

ఆంధ్ర ప్రదేశ్ వస్త్ర పరిశ్రమ నేతలోను, పనితనంలోను, డిజైనింగులోను ప్రశస్తమైనది. ముఖ్యంగా వస్త్రముల రంగులు చెప్పదగినవి. బంగారు, వెండి జరీలను వేసి వస్త్రములకు మరింత శోభాయమానం చేస్తారు. ఈ వస్త్రములు వివిధ రంగులలో అతి మృదువుగా వుంటాయి. చేనేత వస్త్రములలో అనేక రకాలుగా నేత నేయవచ్చు గనుక ఎవరికిష్టమైన వాటిని వారు ఎన్నిక చేసుకోవచ్చును.

## పోచంపల్లి చీరెలు.

పోచంపల్లి గ్రామంలో టై అండ్ డై చీరెలు నేయబడుతవి. ఈ చీరెలపైట అంచులు టై అండ్ డై పద్ధతి ప్రకారం అతిసొగసుగా నేయబడుతవి. అందులో పడుగు, పేకనూలు ఒక పద్ధతి ప్రకారం మిశ్రమం చేయడం జరుగుతుంది. అందుచేత పైట అంచులు చూడడానికి బహు ఆకర్షణీయంగా వుంటాయి. ఈ చీరెలు ఏసందర్భమునకైనా ధరించుటకు ఉపయోగపడుతాయి. చీరెలకు తగిన రవికె కణుములు, తేలియా రుమాళ్ళు, ద్వారములకువేసే తెరలు, బల్లలపై పరిచే గుడ్డలుకూడా టై అండ్ డై పద్ధతి ప్రకారం తయారు చేయబడతాయి. కొన్నిటిలో వివిధ రంగుల సమ్మేళనం కూడా కనిపిస్తుంది.

## ఉప్పాడ గద్వాల చీరెలు.

ఈ చీరెలు బంగారంవలె దివ్యంగా వుంటాయి. అయితే ఇవి నూలుచీరలే. వీటి పైటఅంచులకు మామూలు బార్డర్లకు పట్టులేక జరీవేసి అలంకరణ చేస్తారు. జరీఅంచులుండడంచేతఇవి పండుగ పబ్బాల సందర్భాలలో, ఇతర శుభకార్యాల సందర్భంలో ధరించుటకు యోగ్యంగా వుంటాయి. పైగా ధరించినవారికి నూలుచీరె కట్టుకున్నట్లే సుఖంగా వెసులుబాటుగా వుంటుంది. వేసవిగానీ, చలికాలంగానీ ఎప్పుడు కట్టుకున్నా సౌఖ్యంగా వుంటుంది. వీటిలో రవికె కణుములుకూడా వుంటాయి.

## వెంకటగిరి, సిద్దిపేట చీరెలు.

వెంకటగిరి, సిద్దిపేట చీరెలతో మరేచీరలూ సాటిరావు. ఈచీరెలు ఎంతో నాణ్యంగా నేయబడుతవి. అయినా చాలచౌక. అలంకారానికీ, అందానికి, కళాభిరుచికీ ఈచీరెలు ఉత్తమమైన తార్కాణలు.

## సిద్దిపేట, సంగారెడ్డి, మంగళగిరి, ఆర్మూరు, నారాయణపేట సిల్కు చీరెలు.

ఈచీరెల నేతలో మనదేశనేత పనివారి పనితనం కన్పిస్తుంది. చక్కని కాంతివంతమైన జరీలతో నిండుదనంతో ఇవి శుభకార్యాల సందర్భంలో ధరించడానికి అనువుగా వుంటాయి. ఈచీరెలు కట్టుకున్నవారు డాబుగా, అందంగా కన్పిస్తారు. చూచేవారు కూడా ఒక్కనిమిషం అలాగే చూస్తూ వుండిపోతారు. ఇవి మన్నికగాకూడా వుంటాయి. భారతదేశమంతటా వీటికిమంచి గిరాకీవుంది.

## ప్రింటెడ్ వస్త్రాలు.

వివిధ డిజైనులతో వస్త్రములను చేతితో అద్దకం వేస్తారు. ఈ అద్దకం చాలా బాగా వుంటుంది. వీటిలో బ్లౌజుగుడ్డలు, బుష్‌షర్టు ముక్కలు మొదలగు వాటిని సహకారసంఘ విక్రయశాల నుంచైనా కొనవచ్చు.

## హిమ్రూ వస్త్రాలు.

ఇదొక విశిష్టమైన పరిశ్రమ. హిమ్రూవస్త్రం పత్తినూలుతో, ఆకర్షణీయమైన పట్టుపోగులతో దట్టమైన రంగులతో లేక పల్చనిరంగులతో వివిధ డిజైనులుగా నేయబడుతుంది. ఈవస్త్రం స్త్రీల కోట్లకు, బ్లౌజులకు, ఇతర దుస్తులకు చాలాబాగా వుంటుంది. గృహాలంకరణకు పర్దాలకు, తెరలకు కూడా హిమ్రూవస్త్రం ఉపయోగపడుతుంది.

## చేతి పరిశ్రమల వస్తువుల అమ్మకం.

చేతిపరిశ్రమలలో తయారయ్యే సరుకును అమ్మడానికి, ముఖ్యంగా కుటీర పరిశ్రమలకు విక్రయావకాశాలు కలిగించడానికై 1930లో హైద్రాబాదులో ప్రభుత్వ కుటీర పరిశ్రమల విక్రయశాల నెలకొల్పబడింది. ఈ విక్రయశాల ప్రతియేటా 5లక్షల రూపాయల వస్త్రాలను అమ్ముతుంది. దీనిని ఇంకా విస్తృతపరచడానికై ఒక పథకం ఇప్పుడు పరిశీలనలోవుంది. ఇదిగాక విజయవాడలో కేంద్రవిక్రయశాల ఒకటివుంది. రాజమండ్రిలో ఒక మార్కెటింగు కేంద్రంవుంది. తిరుపతిలో మరొక విక్రయశాలను తెరువడానికై అఖిలభారత చేతిపరిశ్రమల బోర్డువారు ఆర్థిక సహాయంచేశారు. ఇది త్వరలో తెరువబడుతుంది.

## అభివృద్ధి కార్యక్రమం

ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి కార్యక్రమంలో చేతి పరిశ్రమలు అతి ముఖ్యమైనవి. వీటి కొరకై ప్రణాళికలో రూ 35.05 లక్షలు కేటాయించబడ్డవి. ఇదివరకే ఈ రంగంలో తగు కృషి జరిగింది. ప్రధానమైన పథకాలు 15 ఇప్పుడు అమలు జరుగుతున్నవి. ఈ పథకాల ననుసరించి చేతిపనివారల సహకార సంఘములు నెలకొల్పబడుతున్నవి. అట్టి సంఘాల మూలధనానికి, సిబ్బంది మొదలగు ఖర్చులకు కొంత ఆర్థిక సహాయం చేయబడుతుంది. ఈ సంఘాలు ఉత్పత్తి పనిని చేబట్టినవి. పనివారలకు తీయకుండా పనులు లభిస్తున్నవి.

ఈ పరిశ్రమలలో తయారయ్యే వస్తువులకు విక్రయావకాశాలు కలిగించడం ముఖ్యమైన సమస్యగా వుంది. అందుచేతనే హైద్రాబాదులోని ప్రభుత్వ కుటీర పరిశ్రమల విక్రయశాలలను రూ 1,30,800/-లతో విస్తృతీకరించడానికై ఒక పథకం తయారు చేయబడింది. ఆ మొత్తమును మంజూరు చేయడం కూడా జరిగింది. విజయవాడలో, రాజమండ్రిలో మార్కెటింగ్ డిపోలు నెలకొల్పబడినవి. మార్కెటింగు ఫలితాలను అంచెనా వేసి, ఆ ఫలితాల లాభనష్టాలను తెలుసుకొని, ప్రదర్శనా విధానములను అభివృద్ధి పరిచే ఉద్దేశంతో మరికొన్ని విక్రయశాలలను స్థాపించవలెనని తలపెట్టబడింది. వివిధ చేతిపరిశ్రమల కేటలాగులు కూడా తయారు చేయబడగలవు. ఈ పరిశ్రమల సరుకులకు ఎగుమతి మార్కెట్లను చూచే పని కూడా జరుగుతున్నది.

మరి 14 పథకాలు ప్రభుత్వ పరిశీలనలో వున్నవి. వీటికి మొత్తం రూ 845, 560/-లు వ్యయమవుతాయి. డిజైనులను రూపొందించడానికి ఒక కేంద్ర సంస్థను స్థాపించడం, పని వారలకు నివాస గృహాలను నిర్మించడం వంటి పనులు ఈ పథకాలలో తలపెట్టబడినవి.

ఆంధ్రప్రదేశ్‌లో ఇదివరకు వున్నట్టి చేతిపరిశ్రమల సలహా సంఘాలను ప్రభుత్వం పునర్నిర్మాణం చేసి కొత్తగా ఒక సలహా సంఘమును ఏర్పాటుచేసింది. కొత్త శిల్పమును, కొత్త యంత్ర పరకరాలను ప్రవేశపెట్టే విషయంలో శిక్షణ విషయాంలో, సర్వే పరిశోధన డిజైనింగు విషయాలలో, ముడిసరుకులను సేకరించే విషయంలో, విక్రయావకాశాల కల్పన విషయంలో ప్రభుత్వానికి తగు విధంగా సలహాలివ్వడమే ఈ సలహా సంఘం యొక్క పని. ఈ విధంగా చేతిపరిశ్రమల సమస్యలను పరిశీలించడానికీ, ఈ పరిశ్రమలలో తయారయ్యే వస్తువుల నాణ్యమును అభివృద్ధి పరచడానికీ, వాటికి దేశంలోను, విదేశాలలోను విక్రయావకాశాలు కలిగించడానికీ ఈ సలహా సంఘం ఎంతగానో తోడ్పడు తుంది,



# అభివృద్ధి కార్యక్రమ కేంద్రాల విశేషాలు

కరీంనగర్ జిల్లా హుజూరాబాదు తాలూకాలోని భీమదేవరపల్లి జాతీయ విస్తరణ సేవాకేంద్రంలోగల సింగాపురం గ్రామంలో 10-11-1957 తేదీన గ్రామ నాయకుల శిక్షణశిబిరం ప్రారంభింపబడింది. ఒక గ్రామసేవకుని ప్రాంతంలోగల దాదాపు 40 మంది గ్రామనాయకులు వ్యవసాయం, సహకారం, స్వల్ప నీటి పారుదల మున్నగు విషయాలకు సంబంధించిన శిక్షణ పొందారు. జిల్లా ప్లానింగ్ ఆఫీసర్ తమ ప్రారంభోపన్యాసంలో విదేశ ద్రవ్యమారకం క్లిష్టం గావున్న నేటి పరిస్థితిలో వ్యవసాయోత్పత్తిని అధికం చేయవలసిన ఆవశ్యకతను నొక్కి చెప్పారు. ఆహారం విషయంలో దేశం స్వయం సమృద్ధం కావ లెనన్నారు. సహకారోద్యమం లేనిదే ఏఅభివృద్ధి అయినా పరిమితంగా వుంటుంది కాబట్టి బ్లాకు ప్రాంతంలో సహకారోద్యమాన్ని పెంపొందింప జేయడానికై ప్రజలు సహకరించ వలెనన్నారు. ప్రజలలో పొదుపరితనమును అలవాటు చేసేటం దుకూ, చిన్న మొత్తాల పొదుపు ఉద్యమాన్ని వ్యాప్తంచేసి తద్వారా రెండవ పంచవర్ష ప్రణాళి కకు ఆర్థికసామత కలిగించేటందుకూ గ్రామనాయ కులు తోడ్పడవలెనని విజ్ఞప్తిచేశారు. కరీంనగర్ జిల్లా పశువైద్య శాఖాధికారి, జాతీయ విస్తరణ సేవా కేంద్రం ఉద్యోగులు తమతమ విషయాలను గూర్చి ప్రసంగించారు. భీమదేవరపల్లి విస్తరణ సేవా కేంద్రం బ్లాకుడెవలప్‌మెంటు అధికారి శిక్షణ శిబిరాల లక్ష్యాలనూ, దేశాభివృద్ధి కార్యక్రమంలో గ్రామ నాయకులు వహించవలసిన పాత్రను వివ రించారు.

పంచవర్ష ప్రణాళికను చిత్రీకరిస్తున్న పటము లతో ఒక ప్రదర్శన స్టాలు ఏర్పాటు చేయబడింది. ఆ పటములను ఒక గ్రామసేవకుడు తయారు చేసి నాడు. ప్రారంభోత్సవంలో ఎందరో అధికార, అన ధికార ప్రముఖులు పాల్గొన్నారు.

## గుడ్లవల్లేరులో పశువుల కొట్టం

గుడ్లవల్లేరులో "నెహ్రూ పశుగణ ప్రదర్శనం" లో 15-11-1957 తేదీన ఉదయం 9-15 గంటలకు కృష్ణాజిల్లా కలెక్టరు ఆదర్శ పశుగణశాలకు ప్రారం భోత్సవం చేశారు. ఈ కొట్టానికి మొత్తం రూ. 15,000 లు ఖర్చు అయింది. అందులోనుంచి రూ. 6,000లు స్థానికాభివృద్ధి పనుల నిధినుంచి ఇవ్వబడ్డవి. దాదాపు నూరుపశువులకు ఎండవానలనుంచి రక్షణ కల్పించడానికి ఈ కొట్టం నిర్మింపబడింది.

జిల్లా పశువైద్యశాఖాధికారి శ్రీ జి. కామేశ్వర రావు సభకు అధ్యక్షత వహించారు. గ్రామకమిటీ వారు, "నెహ్రూ పశుగణ ప్రదర్శనం" కమిటీ వారు సంయుక్తంగా జిల్లా కలెక్టరుకు స్వాగత పత్రం సమర్పించారు. జిల్లా వైద్యశాఖాధికారి అధ్యక్షత వహిస్తూ గత పన్నెండేండ్లనుంచి ఈ ప్రద ర్శనం ప్రజలకు బాగా పరిచయమవుతూ వచ్చిందనీ, ఆప్రాంతంలో ఒక కీలక గ్రామకేంద్రాన్ని తెరిచే ప్రతిపాదన ఒకటి కలదనీ చెబుతూ ఆ పశుగణ ప్రదర్శనం ఆంధ్రప్రదేశ్‌లో ఆదర్శ ప్రాయం కాగలదన్న ఆశాభావం వెలిబుచ్చారు.

జిల్లా కలెక్టరు ప్రసంగిస్తూ జిల్లాలో ఇతర పను లన్నిటికన్న పశువులకొట్టం నిర్మాణంపని త్వరగా పూర్తి అయిందని అన్నారు దీనినిబట్టి గ్రామస్తు లిచ్చిన సహకారం, వారిలోగల ఉత్సాహం విదిత మవుతున్న వన్నారు. పొరంబోకు భూములు పశు వులు మేయడానికి ఉపయోగ పడుతున్నవి కాబట్టి వాటిని ఆక్రమించుకోరాదని గ్రామస్తులకు హితవు చెప్పారు. ఆధునికమైన వ్యవసాయ పనిముట్లు, కం పోస్టు ఇతర ఎరువులు ఉపయోగించి అధికోత్పత్తిని

ఎలా సాధించవలెనో వివరించారు. చిన్న మొత్తాల ఉద్యమానికి పెట్టుబడి పెట్టండని ప్రజలకు విజ్ఞప్తి చేశారు. ఆ తరువాత రిబ్బను కత్తిరించి పశువుల కొట్టానికి ప్రారంభోత్సవం చేశారు. పశుగణ ప్రదర్శన కమిటీవారు తాపీమేస్త్రీకి, కాపలాదారులకు, ఇతర పనివారలకు నూత్న వస్త్రాలు బహూకరించారు.

ఈ ఉత్సవంలో అనేకమంది అధికారులు, పరిసర గ్రామాలనుంచి పలువురు ప్రజలు, రైతులు పాల్గొన్నారు. పశుసంక్షేమం, ఆహారోత్పత్తి, నీటిపారుదల, విద్యుచ్ఛక్తికి, సంబంధించిన తెలుగు పుస్తకాలు సభా సదులకు పంచిపెట్ట బడినవి.

## నాగార్జునసాగర్ ఉన్నత పాఠశాల

నాగార్జునసాగర్ డాము స్థలంవద్ద ఆనాటికానాటికీ జనాభా వృద్ధి అవుతున్నది. వారి పిల్లలకు విద్యా సౌకర్యం కలిగించడానికై ఈ సంవత్సరం అక్కడ ఒక ఉన్నత పాఠశాల నెలకొల్ప బడింది. ఈ పాఠశాలవారు జరిపిన మొట్టమొదటి పెద్ద ఉత్సవం నెహ్రూ జయంతి. (1957 నవంబరు 14వ తేదీన).

ఉదయం సూపరింటెండింగ్ ఇంజనీరు శ్రీ పి. టి. మల్లారెడ్డి జాతీయ పతాకమును ఎగురవేస్తూ, తాము ఈనాడు నెహ్రూ 68వ జన్మదినోత్సవం జరుపుకుంటున్నామనీ, భారతజాతి నిర్మాతలలో నెహ్రూ అగ్రశ్రేణికి చెందిన వ్యక్తిఅనీ, నేటి విధార్థులే ఆయన అడుగుజాడల ననుసరించి కృషిచేయవల్స్య ఉద్బోధించారు. ఆతరువాత విద్యార్థులు ఆరోగ్యానికి సంబంధించిన అట్టలను చేతబుచ్చుకొని ఊరేగింపుగా వెళ్ళారు.

సాయంత్రం పాఠశాల ఆవరణలో సూపరింటెండింగ్ ఇంజనీరు శ్రీ కె. వి. శ్రీనివాసరావు అధ్యక్షతన బహిరంగసభ జరిగింది. స్కూలు పార్లమెంటు సభ జరిగింది. పాఠశాల విద్యార్థుల ఆటలపోటీలు జరిగినవి. గెల్చినవారికి బహుమతులు ఇవ్వబడినవి.

సభాధ్యక్షులు శ్రీ శ్రీనివాసరావు నెహ్రూ చిత్రపటాన్ని ఆవిష్కరిస్తూ పిల్లలంటే నెహ్రూకు ఎంత అభిమానమో, శాంతిప్రవక్తగా ఆయన భారతదేశానికీ, ఆసియా ఖండానికీ, ప్రపంచానికీ



రాష్ట్ర ప్లానింగ్ మంత్రి శ్రీ వి. బి. రాజు మెదకుజిల్లా సిద్దిపేట తాలూకాలోని దుబ్బాక జాతీయ విస్తరణ సేవాకేంద్రానికి 4-12-1957 తేదీన ప్రారంభోత్సవం జరిపారు.

ఎంత సేవచేసింది వివరిస్తూ నెహ్రూలో మూర్తీభ వించి వున్నట్టి క్రమశిక్షణ, కర్తవ్య దీక్షలను విద్యార్థులు అలవరచుకోవలెననీ, అట్టి మహానాయకుడికి వారసులుగా తమనుతాము రూపొందించుకోవలెననీ ప్రబోధించారు.

ఉన్నతపాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ టి. సూర్యప్రకాశం కృతజ్ఞతాభివందనాలర్పిస్తూ తమ పాఠశాలను బహుళార్థసాధక పాఠశాలగా అభివృద్ధి పరచవలెనని విజ్ఞప్తి చేశారు.

## కంచికచర్ల బ్లాకులో మేలా

కృష్ణాజిల్లా కంచికచర్ల జాతీయ విస్తరణసేవా కేంద్రంలోని ఆదర్శగ్రామం వీరులపాడులో 1957 నవంబరు 14, 15 తేదీలలో మేలా జరిగింది. ఆ సందర్భంలో హైస్కూలు ఆవరణఅంతా చక్కగా అలంకరింపబడింది. వేదిక, రంగస్థలం అమర్చబడినవి. 12వ తేదినుంచి యువకుల ఆటలపోటీలు జరిగినవి. 14వ తేదీన బాలల దినోత్సవం జరిగింది. డెవలప్ మెంట్ ఆఫీసర్ శ్రీ హెచ్. సి. రమాకాంతరెడ్డి ప్రణాళిక లక్ష్యాలనుగూర్చి ప్రసంగించారు. పిల్లల ఆటలపోటీలు, స్త్రీలకు నూలువడుకుపోటీలు, శిశు ప్రదర్శనం జరిగాయి. రెండవ ప్రణాళిక ప్రదర్శనం ఏర్పాటు చేయబడింది.

15వ తేదీన బహిరంగసభ జరిగింది. ఆరాత్రి వైజ్ఞానిక ప్రదర్శనం ఏర్పాటు చేయబడింది. ఈ ఉత్సవాలలో పదిగ్రామాలనుంచి దాదాపు మూడు వేలమంది ప్రజలు పాల్గొన్నారు.

## కోడూరు జాతీయ విస్తరణ సేవాకేంద్రం.

విశాఖపట్నం జిల్లా చోడవరం తాలూకా కోడూరు జాతీయ విస్తరణ సేవాకేంద్రానికి ఆంధ్ర ప్రదేశ్ నీటిపారుదల విద్యుచ్ఛక్తి శాఖామంత్రి శ్రీ జె. వి. నరసింగరావు 20-11-1957 తేదీ ఉదయం 8-30 గంటలకు టేపు కత్తిరించి ప్రారంభోత్సవం చేశారు. ఆతరువాత మంత్రిగారు, జిల్లా కలెక్టరు ఆ సందర్భంలో ఏర్పాటు చేయబడిన వ్యవసాయ ప్రదర్శనాన్ని చూచారు.

పెద్ద బహిరంగసభ జరిగింది. కోడూరు పంచాయతీ అధ్యక్షులు శ్రీ లెక్కల జగన్నాథం మంత్రిగారికి స్వాగతం చెప్పారు. చోడవరం తాలూకా సాగునీటి సౌకర్యం విషయంలో వెనుకబడి వున్నదనీ, మంత్రిగారు ఆ విషయాన్ని సానుభూతితో పరిశీలించాలనీ శ్రీ జగన్నాథం నివేదించారు. పార్లమెంటు సభ్యులు శ్రీ మిస్సుల సూర్యనారాయణమూర్తి ఈ సందర్భంలో ప్రసంగిస్తూ వెనుకబడి వున్న ప్రాంతాల ప్రజల జీవన స్థాయిని పెంపొందించడానికే అభివృద్ధి బ్లాకులు ఏర్పాటు చేయబడుతున్నవని తెలిపారు. ఈ పనిలో వ్యవసాయం, పశు సంరక్షణ, సహకార పరిశ్రమలు మొదలగు శాఖలు సమిష్టిగా కృషి చేసి సర్వతోముఖాభివృద్ధికి తోడుపడతాయని తెలిపారు. మన దేశీయుల సాంఘిక పరిస్థితిని పూర్తిగా మార్చివేయడమే బ్లాకులధ్యేయమన్నారు. ఇది ప్రభుత్వం తలపెట్టిన బృహత్ప్రయత్నమనీ, ప్రజలు పూర్తిగా సహకరిస్తేనే అది విజయవంతమవుతుందనీ ఉద్బోధించారు. రాష్ట్ర శాసన సభ్యులు శ్రీ రెడ్డి జగన్నాథం ప్రసంగిస్తూ ఇప్పుడు గ్రామాలలో తలపెట్టబడిన పథకాలు నాలుగు లక్ష్యాలపై ఆధారపడి వున్నవని అన్నారు. 1. జాతీయాదాయాన్ని పెంపొందించి ప్రజల జీవన స్థాయిని అభివృద్ధి పరచడము. 1. సత్వరంగా పరిశ్రమలను విస్తరింప జేయడం. 3. ఉద్యోగావకాశాలను హెచ్చించడం. 4. ప్రజల ఆదాయాలలోను, సంపదలోను గల వ్యత్యాసాలను తగ్గించడం.

ఈ పథకాలన్నిటినీ అమలు జరపడానికి ప్రజలు శ్రమదాన, సంపత్తి దానముల ద్వారా సహకరించ వలెనని విజ్ఞాప్తి చేశారు.

మంత్రి శ్రీ జె వి. నరసింగరావు ప్రసంగిస్తూ హీన స్థితిలో పడిపోయిన గ్రామాలను ఉద్ధరించడానికై అభివృద్ధి పథకాలు వేయబడినవని అన్నారు. ఈ విషయంలో మనం ప్రథమ పంచవర్ష ప్రణాళిక ద్వారా కొంత సాధించాము. రెండవ ప్రణాళిక మరింత పెద్దది. అది ఇప్పుడు మన గ్రామాలలో అమలు జరుగుతున్నది. ఏ అభివృద్ధి కార్యక్రమమైనా గ్రామస్తులు శ్రద్ధ వహించి తాము అభివృద్ధి చెందాలని మనసారా కాంక్షించి తోడుపడితేనే తప్ప లేకపోతే విజయవంతం

కాదన్నారు. పథకాలు అమలు జరుగడానికి ప్రజా సహకారం అత్యవసర మన్నారు.

చిన్న మొత్తాల పొదుపు ఉద్యమం ద్వారా రెండవ పంచవర్ష ప్రణాళికకు కొంత ఆర్థిక స్తోమత చేకూర్చవలెనని ప్రయత్నింప బడుతున్నదనీ, కనుక గ్రామీణులు ఆ ఉద్యమానికి పెట్టుబడి పెట్టవలసిందనీ మంత్రి విజ్ఞప్తి చేశారు: సభానంతరం విశాఖ పట్నం జిల్లా కలెక్టరు బ్లాకు ఉద్యోగులను గ్రామస్తులకు పరిచయం చేస్తూ సాంకేతిక సలహాలు పొందడానికై తరచు బ్లాకు ఉద్యోగులతో సంప్రదించ వలసిందిగా గ్రామస్తులను కోరారు. చోడవరం బాలిక కుమారి రాధ సంకీత కచేరి జరిగింది. దాదాపు మూడువేల మంది గ్రామస్తులు సభకు వచ్చారు.

కోడూరులో ఒక గ్రామ అప్రోచ్ రోడ్డు వేసేందుకై ఏర్పాటు చేయబడిన శ్రమదానానికి మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

## తిరుమలాయ పాలెం జాతీయ విస్తరణ సేవాకేంద్రం.

తిరుమలాయ పాలెం జాతీయ విస్తరణ సేవా కేంద్రంలో 1957నవంబరు నెలలో బాలల దినోత్సవం గ్రామ నాయకుల శిక్షణ శిబిరం నిర్వహింప బడ్డాయి.

నవంబరు 14వ తేదీన ప్రభాత భేరీ తరువాత శ్రమ దానం ద్వారా ఒక చిన్న పాటి రోడ్డును వెడల్పు చేసి మరమ్మతు చేయడం జరిగింది. దాదాపు 500 మంది ప్రజలు 400 బండ్లతో శ్రమ దానంలో పాల్గొన్నారు. డిప్యూటీ డెవలప్ మెంట్ కమీషనర్ శ్రీ ఇ. వి. రామిరెడ్డి, జిల్లా ప్లానింగ్ ఆఫీసరు శ్రీ కె. రంగారావు, తహసీల్దారు శ్రీ రంగారెడ్డి గారలు శ్రమ దానోద్యమంలో పాల్గొన్నారు.

ఆటల పోటీలు, వైజ్ఞానిక ప్రదర్శనాలు కూడా జరిగాయి. గ్రామంలో పాఠశాల ఆట స్థలానికి విరాళాలిస్తామని ప్రజలు వాగ్దానం చేశారు.

బాలాపేట గ్రామంలో 16-11-1957 తేదీ నుంచి 21-11-1957 తేదీ వరకు గ్రామ నాయకుల శిక్షణ శిబిరం నిర్వహింప బడింది. జాతీయ పతాక ప్రతిష్ఠాపన జరిగింది. జిల్లా ప్లానింగ్ ఆఫీసరు ప్రసంగిస్తూ శిబిర లక్ష్యాలను శిక్షణ పొందుతున్న వారికి వివరించి చెప్పి, బ్లాకు ఉద్యోగుల నుంచి, నిధుల నుంచి పూర్తి లాభం పొందవలసిందిగా విజ్ఞప్తి చేశారు. బ్లాకు డెవలప్ మెంట్ ఆఫీసర్ శ్రీ నరసింహాచారి, సాంఘిక విద్యా ఆర్గనైజర్ శ్రీ జి. లక్ష్మీకాంతరావు, అనధికార ప్రముఖులు శ్రీ వెంకటయ్య, సీతారామయ్య గారలు ప్రసంగించారు. వివిధ గ్రామాల నుంచి వచ్చిన 58 మంది గ్రామ నాయకులకు వ్యవసాయం, పశు సంరక్షణ, ఆరోగ్యం, విద్య, సహకారం. నీటి పారుదల, రాకపోకలు మున్నగు విషయాలలో శిక్షణ గరపబడింది. కంపోస్టు గుంటలు త్రవ్వడం, పొగరాని పొయ్యిలు నిర్మించడం వంటి పనులు కూడా నేర్పబడినవి. చివరి రోజున బ్లాకు డెవలప్ మెంట్ ఆఫీసరు శ్రీ నరసింహాచారి శిక్షణ పొందిన వారికి వీడ్కోలు చెప్పారు. వైజ్ఞానిక కార్యక్రమాలు, ఆటల పోటీలు మొదలగునవి కూడా జరిగాయి.

## తిరువూరు బ్లాకు.

తిరువూరు బ్లాకు లోని పలు గ్రామాలలో అక్టోబరు 2వ తేదీన జాతీయ దినోత్సవం జరుప బడింది. రాజుపేట, కోడూరు, పుట్రేల, విస్సన్నపేట, వూటుకూరు, చనుబండ, పెంగోలను, ఇనగదప, తుమ్మగూడెం గ్రామాలలో ఆటల పోటీలు, పారిశుధ్య కార్యక్రమాలు అమలు జరిగాయి.

నవంబరు 6, 7 తేదీలలో మునుకుళ్ళ గ్రామంలో వ్యవసాయాన్నిగూర్చి గ్రామనాయకుల శిక్షణ శిబిరం నిర్వహింప బడింది. 58 మంది గ్రామస్తులు శిక్షణకు వచ్చారు. వ్యవసాయం, పశు వైద్యం సహకారం, నీటి పారుదల మొదలగు విషయాలపై ప్రసంగములు చేయబడినవి.

అక్టోబరు 2, 3 తేదీలలో కోడూరు, మునుకుళ్ళ గ్రామాలలో మేలా జరిగింది. ఆటల పోటీలు, వైజ్ఞానిక కార్యక్రమాలు, నాటకాలు.విచిత్ర వేషధారణ, హరికథలు మొదలగునవి జరిగాయి.

అక్టోబరు 6, 7 తేదీలలో మునుకుళ్ళలో వ్యవసాయ, పరిశ్రామికా ప్రచార ప్రదర్శనం ఏర్పాటు చేయబడింది.

అక్టోబరు 7వ తేదీన జిల్లా పశు వైద్యాధికారి తెల్లదేవరపల్లిలో కృత్రిమ గర్భోత్పత్తి ఉప కేంద్రాన్ని ప్రారంభించారు.

రైతులలో అధికోత్పత్తి విషయంలో వాంఛనీయమైన పోటీ భావాన్ని కలిగించేటందుకై అక్టోబరు నెల మొదటి పక్షంలో వరి పంట పోటీలు 80 నడుపబడినవి.

కంభంపాడు, పెంగొలను, పుల్లేల, లక్ష్మీపురం గ్రామాలలోని ఆదర్శ వ్యవసాయ క్షేత్రాలలో మిరప నారుమళ్ళకు పడే తెగులును నివారించే పని జరిగింది.

కోడూరు, కొత్తగూడెం. పోలవరం, పోతనపల్లి, కోటపాడు. చిన్నంపేట గ్రామాలలో చిన్న మొత్తాల పొదుపు ఉద్యమవ్యాప్తి కొరకై గ్రూపులు ఏర్పాటు చేయబడినవి. ఆ గ్రామాల ప్రజలు వరుసవారీగా రూ. 6,500, రూ. 3,000, రూ. 8,000, రూ. 3,000. రూ. 2,000, రూ. 5,000, లు పెట్టుబడి పెట్టడానికి వాగ్దానం చేశారు.

మహబూబునగర్ జిల్లా ఆత్మకూరు తాలూకాలోని లాల్‌కోట గ్రామంలో మహాబోధి గ్రంథాలయానికి 26-11-1957 తేదీన ప్రారంభోత్సవం జరిగింది.

★ ★ ★ ★ ★ ★ ★



*నాల్గవ అంతర్విశ్వ విద్యాలయ యువజనోత్సవాలు కొత్త ఢిల్లీలోని టాల్కటోరా గార్డెన్స్‌లో **1957** నవంబరు **1**వ తేదీనుంచి **10**వ తేదీ వరకు జరిగాయి. ఆ ఉత్సవాలకు వెళ్ళిన ఉస్మానియా విశ్వవిద్యాలయ జట్టువారు ప్రధానమంత్రి శ్రీనెహ్రూను ఆయన నివాసగృహంలో సందర్శించి ఆయనతో తీయించుకున్న ఫోటో*

# మేలురకం విత్తనాల వ్యాప్తి

శ్రీ యం. యస్. శివరామన్, ఐ. సి. యస్. (ప్లానింగ్ కమీషన్ సలహాదారు)

శాస్త్రీయమైన వ్యవసాయ పద్ధతిలో ఎక్కువ ఎరువుల వాడకమే ఉన్నతస్థాయి సేద్యానికి ప్రమాణము. పంట బాగా పండడానికి అనేక కారణాలుంటాయి. వాటన్నిటిలో ఎరువులే ఎక్కువ దోహదకరమైనవని చెప్పక తప్పదు. చాలామంది మేలురకం విత్తనాల వాడకంవల్ల ఉత్పత్తి పెరుగుతుందని అనుకుంటారు. కాని ఈ అభిప్రాయం సరైనది కాదు. అసలు విషయ మేమిటంటే మేలురకం విత్తనాలు భూమినుంచి పోషక పదార్థాలను బాగా పీల్చుకుంటాయి. ఇలా మేలురకం విత్తనాలను వాడడంవల్ల కొంతకాలానికిభూమిలో సత్తువ తగ్గిపోతుంది. అప్పుడు పొలంలో తగు ప్రమాణంలో ఎరువులు వేస్తేతప్ప లేకపోతే ఉత్పత్తిస్థాయి తగ్గిపోతుంది. భారతదేశ వ్యవసాయోత్పత్తి పెరగాలంటే వివిధ ప్రాంతాలలో స్థానికంగా లభ్యమయ్యే ఎరువులను బాగా పెంపొందింప జేసుకోవాలి. ఆ ఎరువులను పొలాలలోవేస్తూ వాటితోపాటు మేలురకం విత్తనాలను, నారుమొక్కలను వాడినట్లయితే ఉత్పత్తి బాగా పెరుగుతుంది.

కొన్ని సంవత్సరాల క్రిందట మొక్కల పెంపకం ఒక కళగా భావింపబడేది. కాని జీవాణుపుల శాస్త్రం బాగా అభివృద్ధి చెందిన తరువాత మొక్కల పెంపకం ఒక శాస్త్రంగా ఎంతో అభివృద్ధి చెందింది. ఈనాడు మొక్కలను పెంచేవారికి ఆర్థికంగా లాభసాటియై, నీటి ఎద్దడి, క్షారత, నీటివాలు లోపములు మొదలగు ప్రకృతి సహజమైన స్థితిగతులను ఎదుర్కొని నిలిచి ఎక్కువ ఉత్పత్తినివ్వగల కొత్తజాతి మొక్కలను రూపొందించడం బాగా తెలుసు. పైరులలో తెగుళ్ళను ఎదుర్కొనే శక్తిని వారు కలిగించగలరు. భూమినిబట్టి, శీతోష్ణస్థితినిబట్టి పైరు కాలమునువారు సరిపెట్టగలరు. శాస్త్రీయ సాంకేతిక విధానాలుఅభివృద్ధిచెందినకొలదిదేశంలోనివ్యవసాయ పరిశోధకులు స్థానిక పరిస్థితులకు తగిన అనేక మేలుజాతి విత్తనాలను, మేలురకం మొక్కలను రూపొందించుతూ వస్తున్నారు. ఇంకా ఎన్నో కొత్తజాతులను సృష్టిస్తున్నారు. కాని మనదేశంలో రైతులు తమ పొలాలలో ఈమేలుజాతి విత్తనాలను, మొక్కలను ఉపయోగించడం అంతగా వ్యాప్తి చెందలేదు. అనేక రాష్ట్రాలలో ప్రత్తి, చెరకుపత్స్య తరపైరుల మేలుజాతి రకాలు, అవి ఎంత ప్రాంతాసికైతే రూపొందించబడినవో దానిలో ౧౦ మొదలు ౨౦ శతికంటె ఎక్కువ వ్యాప్తం కానేలేదు.

## నిల్వ చేయడం

మేలురకం విత్తనాల వ్యాప్తికి సంబంధించిన ఏ పథకంలోనైనా విత్తనాలను నిల్వచేయడం చాలా ముఖ్యమైన విషయం.విత్తనాలలోని బీజగర్భములను చెక్కుచెదరకుండా ఉంచవలెనంటే వాటిని అప్పుడప్పుడు ఎండబోస్తూ వుండాలి. చెడు విత్తనాలు వాటిలో కలువకుండా జాగ్రత్త వహించాలి. ఈ ఎండబొయ్యడంలో ఒక చిక్కువుంది. ఎండబోసిన ప్రతిసారీ విత్తనాల పరిమాణం తగ్గిపోతూ వుంటుంది. వాళ్లూ వీళ్లూవచ్చి సంగ్రహిస్తూ పోతూ వుంటారు. పశులూ, ఉడతలూ తినేస్తూ వుంటాయి. విత్తనాలను నిల్వచేసి గిడ్డంగులలో సాధారణంగా ఎండబోయడానికి తగు వసతి వుండదు. అందుచేతనే అవి త్వరగా చెడిపోతూ వుంటాయి. ఈ ఇబ్బందులను తొలగించుకోవాలంటే పంపిణీ చేయబడు విత్తనాల పరిమాణాన్ని తగ్గించాలి. సాధ్యమైనంత వరకు విత్తనాల నిల్వ, పంపిణీ పనులను వికేంద్రీకరించాలి. అందువల్ల వ్యవసాయదారుడు తనకు కావలసిన విత్తనాలను స్థానిక ఉత్పత్తులనుంచే తీసుకుంటూ,

వచ్చే వ్యవసాయ తరుణంలో తానువాడే విత్తనాలను తగు జాగ్రత్తతో పదిల పరచుకుంటాడు.

ఇంతకుపూర్వం ఎక్స్‌టెన్షన్ కార్యకర్తలు కొంతమంది ప్రముఖ వ్యవసాయదార్లకు మాత్రమే మేలు రకం విత్తనాలు సరఫరా చేసేవారు. మళ్ళీ ఎప్పుడైనా సరఫరాచేయడం జరిగితే ఇదివరకు చేసిన వారికే సప్లయిచేస్తూ వుండేవారు. అలా మేలురకం విత్తనాలు పొందిన కొద్దిమంది వాటిని ఇతరులకు కూడా సరఫరాచేసి, వాటి వాడకాన్ని ప్రోత్సహించిన సందర్భాలు లేకపోలేదు. అయితే అలా పరిమితంగానే సరఫరా చేయడంవల్ల మన లక్ష్యం పరిపూర్తికాదు. కనుక ప్రతి పొలంలో మేలురకం విత్తనాలను వేయడానికి వ్యవసాయదారులే తగు పాత్ర వహించునట్లుగా ఆచరణ సాధ్యమైన పథకము నొకదానిని సిద్ధంచేయడానికి శ్రద్ధగా పాటుపడవలసిన అగత్యమెంతైనా వుంది.

ప్రతిగ్రామాన్ని ఒక యూనిటుగా తీసుకొని ఆగ్రామంలోని కమతా లన్నింటిలో మేలురకం విత్తనాలను వాడడానికై గ్రామపంచాయితీ సహాయంతోను, ప్రముఖ వ్యవసాయదార్ల సహకారంతోనూ ఒక కార్యక్రమాన్ని సిద్ధంచేయాలి. ఏయే భూములకు ఎట్టి శీతోష్ణస్థితిలో ఏ రకం విత్తనాలు మంచివో అందుకు సంబంధించిన వివరాలు వ్యవసాయ శాఖవారివద్ద లభిస్తాయి. ఎక్స్‌టెన్షన్ కార్యకర్తలు, గ్రామ సేవకులు ఆ వివరాలను సేకరించి, మేలురకం విత్తనాలు మొక్కల స్వరూప స్వభావాదులను బాగా తెలుసుకోవాలి. అలా తెలుసుకొన్నట్లయితే వాటిని గుర్తుపట్టడంలో కష్టముండదు. గ్రామసేవకుడు తన గ్రామాలకు తగిన మేలురకం జాతులను ఒక పట్టికగా వ్రాసి వుంచుకోవాలి. ఏయే ప్రాంతాలకు వాటిని వ్యాప్తం చేయవచ్చో ఆ వివరాన్నీ, అందుకు ఎన్నివిత్తనాలు ఎన్ని మొక్కలు అవసరమవుతాయో ఆ పరిమాణాన్నీకూడా వ్రాసి వుంచుకోవాలి. మూల బీజములు, మొక్కల నిల్వలను ప్రభుత్వ క్షేత్రాలనుంచి సంపాదించాలి. ప్రతి గ్రామసేవకుడు ఆవిత్తనాలను రైతులకు పంపిణీచేసి పైరుల తరుణంలో పొలంలో వేయించి కోతల కాలాన్నికల్లా ఆప్రాంతంలో ఆపైరు వేయడానికి ఎంతవిత్తనం అవసరమో అంత విత్తనాన్ని తన పర్యవేక్షణక్రింద ఉత్పత్తి చేయించడానికి తగు రీతిగా పాటుపడాలి. ఈకార్యక్రమం అతని లక్ష్యమై వుండాలి.

ఈ విధంగా ఒక గ్రామంలో వెయ్యి ఎకరాలలో సాగు నీటిద్వారా వరి పండించబడుతున్నట్లయితే ఆ గ్రామానికి దాదాపు ౪౦,౦౦౦ పౌనుల విత్తనం సరిపోతుంది. గ్రామసేవకుడు గనుక ఒక ఎకరానికి సరిపోయే ౪౦ పౌనుల మూలబీజములతో తన కార్యక్రమం ఆరంభించాడనుకుందాము. మొదటి వ్యవసాయ తరుణం ఆఖరయ్యేప్పటికి ౨౦౦౦ పౌనుల విత్తనం లభిస్తుంది. ఇందులోనుంచి గ్రామంలోనే ఇంకా విత్తనాన్ని పెంపొందింపజేసే నిమిత్తమై ౧౦౦౦ పౌనులు పంపిణీ చేయబడుతాయి. అప్పుడు ౫౦,౦౦౦ పౌనుల విత్తనం ఉత్పత్తి అవుతుంది. అంటే రెండవ సంవత్సరం ముగిసేసరికి మొత్తం గ్రామానికి సరిపడే విత్తనంకంటె ఎక్కువగానే లభ్యమవుతుందన్నమాట. ముందుగా కార్యక్రమాన్ని తయారు చేయడంలోనే గ్రామ సేవకుని నేర్పు అంతా వుంటుంది. గ్రామంలోని రైతులచేత, ప్రముఖ రైతులను ఎన్నిక చేయించాలి. ఆ ప్రముఖ రైతులకు విత్తనాలను పెంపొందింపజేసే పనిని అప్పగించాలి. విత్తనాల క్షేత్రాలను పెంచు రైతులు తమ క్షేత్రాలలో ఎందులో ఏరకం విత్తనం పెంపొందింప జేయబడుతున్నదీ తెలియజేయడానికై పోస్టర్లు పెట్టునట్లుగా ఏర్పాటు చెయ్యాలి. పైరు వెన్ను వేయునప్పటినుంచి తనఖీ చేయించాలి. చెడుమొక్కలను తొలగించాలి. ఏ పొలానికాపొలంలో వేరుగా కోతలు జరిపించాలి. కోతలైన వెంటనే ఇతర వ్యవసాయదార్లు పండించిన ధాన్యం తీసుకొని ఈ విత్తనం వారికి సరఫరా చేయించాలి. ఇటువంటి పథకమొకటి తంజావూరు జిల్లాలో ౧౯౫౪ సంవత్సరంలో ఒక వ్యవసాయ తరుణంలోనే విజయవంతంగా అమలు జరుపబడింది. కుంభకోణం, మయూరం సబ్ డివిజనులలో రెండు లక్షల ఎకరాలకు మేలురకం విత్తనాల వ్యాప్తి జరిగింది. అప్పుడు ప్రదర్శితమైన ఉత్సాహాన్నిచూచి విత్తనాల మారకం సరిసమాన ప్రాతిపదికపై చేయడం జరిగింది

ప్రతి గ్రామంలో మేలు రకం విత్తనాలను ఉత్పత్తి చేయడంవల్ల ఇదివరకు అటువంటి విత్తనాలను ఉపయోగించనట్టి రైతులు స్థానిక పరిస్థితులలో వాటియొక్క ప్రాశస్త్యాన్ని గ్రహించగలుగుతారు. గ్రామానికి ఎన్ని విత్తనాలు అవసరమో అన్ని విత్తనాలు మాత్రమే ఉత్పత్తి జరుగు విధంగా పంట కోతల సమయములో విత్తనాలను సరఫరా చేసినట్లయితే బీజ మూలములు శుద్ధమైనవిగా ఉండునట్లు శ్రద్ధ వహించడానికి వ్యవసాయ శాఖకు అవకాశం కలుగుతుంది. అందువల్ల పెద్ద మొత్తంలో విత్తనాలను సేకరించడం వాటిని రవాణా చేయడం వంటి కష్టతరమైన బాధ్యత తప్పుతుంది. రైతు సకాలంలో తనకు విత్తనం సరఫరా జరుగడానికి స్థానిక వ్యవసాయదార్లపైనే ఆధారపడి వుంటాడు. పంట కోతల సమయంలోనే విత్తనాలు తన చేతికి వచ్చినట్లయితే వాటిని ఒక చోట నిల్వచేసుకొని పదిలపరచుకుంటాడు. కనుక గ్రామ విత్తన క్షేత్రాలు స్వయం కృషికి దోహదమివ్వడమే గాక మేలు రకం విత్తనాలు త్వరగా, చవుకగా అన్ని గ్రామాలలోకి వ్యాప్తి చెందడానికి తోడ్పడతాయి.

ఈ పథకం విజయవంతం కావడం సాధ్యమైనంత వరకు గ్రామస్తులే ఎన్నుకొన్న నిర్ణీత వ్యవసాయదారులకు విత్తనాలను పంపిణీ చేయగలుగడంపై ఆధారపడి వుంటుంది. విత్తన కేంద్రాల పెంపకందార్లు వారు సరఫరా చేసిన మేలు రకం విత్తనాలకు బదులుగా కోతలైన వెంటనే వచ్చే ధాన్యాన్ని తీసుకోవలెనని గ్రామస్తులు ఒక కట్టడి చేయవలెను. ఆమారకం ఏ రేటు ప్రకారం జరగాలి అనేది గ్రామస్తులూ విత్తన క్షేత్రాల పెంపకందార్లు పరస్పరం చర్చించుకొని నిర్ణయించుకోవలెను. ఈ పథకం ఎలా పనిచేస్తూ వుంటుంది అనేది గ్రామ ప్రజాభిప్రాయం తెల్పుతుంది. వారి ఆమోదంతోనే ఇది నిర్వహింపబడుతూ వుంటుంది. ఇది గ్రామ జీవితంలో అతి ముఖ్యమైన విషయం. బీజ మూలములు సరిగా లభించి, వ్యవసాయదార్ల సహకారంతో పంపిణీ ఏర్పాట్లు సకాలంలో జరిగినట్లయితే ప్రతి గ్రామంలోని ప్రతి ఒక్క కమతానికీ మేలురకం విత్తనాల వ్యాప్తి త్వరిత గతిని జరుగడానికి ఎట్టి ప్రతిబంధకమూ వుండదు.

# ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం రాష్ట్రీ సంగీత నాటక అకాడమీని ఏర్పాటు చేసింది. అకాడమీ ముసాయిదా నియమావళి ఇది:-

1. "ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రీ సంగీత నాటక అకాడమీ" అను పేరుతో నృత్య, నాటక, సంగీత కళలకు ఒక అకాడమీ ఏర్పాటు చేయడమగును. (ఇచట ఇకపైన అది "అకాడమీ" అని ప్రస్తావించబడుతుంది.)

2. (1) ఈ అకాడమీ సంగీత నాటక అకాడమీ వారు (భారత నృత్యనాటక సంగీత అకాడమీ) సందర్భానుసారం నిర్ణయించు షరతులకూ, నియమాలకూ లోబడి, ఆ అకాడమీకి అనుబంధ సంస్థగా వుండగలదు.

   (2) ఈ అకాడమీ 1860 సంవత్సరపు సంఘముల రిజిస్ట్రేషన్ చట్టం (1860 సంవత్సరపు చట్టాలలో 21వ కేంద్ర చట్టం) ప్రకారం రిజిస్టరు చేయబడుతుంది.

3. అకాడమీ ప్రధాన కార్యస్థానం హైదరాబాదులో వుండగలదు. అయితే జనరల్ కౌన్సిల్‌లోని మొత్తం సభ్యులలో నాలుగింట మూడు వంతుల మంది సభ్యులచే ఆమోదింపబడిన తీర్మానం ద్వారా దీని కార్యాలయాన్ని మరొక చోటికి మార్చ వచ్చును.

## 4. వ్యవస్థ, విధులు

ఈ అకాడమీకి ఈ దిగువ అధికారాలుండగలవు. ఈ దిగువ విధులను ఇది నిర్వర్తించగలదు:-

1. భారతీయ నృత్య, నాటక, సంగీత, చలన చిత్రరంగాలలో పరిశోధనకు దోహద మివ్వడం; అందుకై ఒక గ్రంథాలయమును, ఒక మ్యూజియమును స్థాపించడం.

2. తన లక్ష్య సాధనకూ,యావద్భారత సంస్కృతి వికాసానికీ తనవంటి అకాడమీలేవైనా వున్నట్లయితే వాటితో సహకరించడం, ఈ రంగంలో కృషి చేస్తున్న ఇతర సంస్థలతో సంఘములతో సహకరించి పని చేయడం.

3. నృత్య, నాటక, సంగీత, చలనచిత్రాలు మున్నగు కళల విషయంలో వివిధ ప్రాంతాల లోని భావాలను పద్ధతులను ఆయా ప్రాంతాలవారు పరస్పరం తెలుసుకోవడాన్ని, పరస్పర ఆదాన ప్రదానాలనూ ప్రోత్సహించడం.

4. ప్రాంతీయ భాషల ప్రాతిపదికపై థియేటర్ సెంటర్ల(నాటకశాల కేంద్రాలు)స్థాపనను ప్రోత్సహించడం; వివిధ థియేటర్ సెంటర్ల మధ్య సహకారమును పెంపొందించడం.

5. నాటకకళ, నటీ నటులకు శిక్షణ, రంగస్థల విద్యాసముపార్జన, నాటక ప్రదర్శన నిర్వహణ మొదలగు వాటిలో శిక్షణ నిచ్చే సంస్థల స్థాపనను ప్రోత్సహించడం.

6. బహుమతులు, విశిష్ట గౌరవములు ప్రదానం చేయడం ద్వారా కొత్త నాటకాల ప్రదర్శనను ప్రోత్సహించి సహాయపడడం.

7. భారతీయ నృత్య,నాటకసంగీత,చలనచిత్రకళల విషయంలో సారస్వతమును ప్రచురించడం. ఇందులో సచిత్ర నిఘంటువులు లేదా సాంకేతిక పారిభాషిక పదముల కోశములు మొదలగు వివరణ గ్రంథములను ప్రచురించే పని కూడా చేరివుండును.

8. సంగీత, నృత్య, నాటక, చలన చిత్ర రంగాలలో పనిచేసే విశిష్ట ప్రదర్శక సంస్థలను పరిగణించడం లేదా వాటికి మరొక విధంగా సహాయ పడడం.

9. అమెచ్యూరు నాటక కార్యక్రమాలు, బాలల నాటకశాలలు, అరు బయలు నాటక ప్రదర్శన శాలలు, గ్రామీణ నాటకప్రదర్శన శాలలు (వాని వివిధ రూపాయలలో) అభివృద్ధి చెందుటకై ప్రోత్సాహ మివ్వడం.

10. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో జానపద సంగీతమును, జానపద నృత్యమును పునరుద్ధరించి ఆ కళలు సజీవంగా వుండడానికి దోహద మివ్వడం. సామూహిక సంగీతమును, స్థూల సంగీతమును మున్నగు వాటిని ప్రోత్సహించడం.

11. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలో నృత్య, నాటక, సంగీత, చలన చిత్రోత్సవాలను ఏర్పాటు చేయించడం.

12. నృత్య, నాటక, సంగీత, చలనచిత్ర రంగాలలో విశిష్టమైన కృషి చేసి పేరెన్నిక గన్న కళాకారులను పరిగణించి వారికి బహుమతులు, ప్రత్యేక గౌరవములు ఇవ్వడం.

13. నృత్య, నాటక, సంగీత, చలనచిత్ర రంగాలలో ఇతర రాష్ట్రాలతో వైజ్ఞానిక సంబంధాలను పెంపొందింప జేయడం.

14. అకాడమీ లక్ష్య సాధనకై స్థలంకొనడం అన్నివిధములైన ఆస్తిని కలిగి వుండడం, అట్టి ఆస్తిని నిర్వహించడం, అమ్మడం, కుదువ బెట్టడం, ఇతర విధములైన వ్యవహారాలన్నీ జరుపడం.

15. భారత ప్రభుత్వంగాని, లేక రాష్ట్ర ప్రభుత్వం గాని లేదా క్రొత్త ఢిల్లీలోని సంగీత నాటక అకాడమీ గాని కోరిన విషయాలపై సలహాలివ్వడం.

16. ప్రజల వద్దనుండి, వ్యక్తుల వద్దనుండి, సంఘములు సంస్థల వద్దనుండి విరాళాలు వసూలు చేయడం. రాష్ట్ర ప్రభుత్వం నుండి, కేంద్ర ప్రభుత్వం నుండి, ప్రభుత్వం వంటి సంస్థల వద్దనుండి గ్రాంట్లు పొందడం.

17. అకాడమీ లక్ష్య సాధనకై పైన పేర్కొన బడ్డ అధికారాలకు సంబంధించి నప్పటికీ లేకపోయినప్పటికీ కూడా, ఇతర విధములైన చర్య లన్నిటినీ గైకొనడం.

## 5. అకాడమీ అధికారులు

ఈ క్రిందివారు అకాడమీ అధికార్లుగా వుండగలరు:-

(1) అధ్యక్షుడు.
(2) ఉపాధ్యక్షుడు.
(3) కోశాధిపతి.
(4) కార్యదర్శి.
(5) సహాయ కార్యదర్శి.

## 6. అధ్యక్షుడు

1. అకాడమీ అధ్యక్షుడు జనరల్ కౌన్సిల్ సభ్యులచే ఎన్నుకోబడి, మూడేండ్ల కాలం వరకు పదవిలో వుండును.

అయితే మొదటి అధ్యక్షుణ్ణి అకాడమీ సభ్యులలో నుంచి ఒకరిని ప్రభుత్వమే నియమిస్తుంది. ఆయన మూడేండ్ల పాటు పదవిలో వుండగలడు.

2. అకాడమీకి అధ్యక్షుడు అధిపతి. ఆయన అకాడమీ అధికార సంస్థ లన్నిటిలోను, కమిటీలలోను ఎక్సు అఫీషియో సభ్యుడుగా వుండును. ఆయన జనరల్ కౌన్సిల్ సమావేశాలకూ, ఎగ్జిక్యూటివ్ బాడీ (కార్య నిర్వాహక సమితి) సమావేశాలకూ, అకాడమీ నియమ నిబంధనల ననుసరించి ఏర్పాటు చేయబడిన ఇతర కమిటీల సమావేశాలకూ అధ్యక్షత వహించ గలడు.

## 7. ఉపాధ్యక్షుడు.

1. అకాడమీ ఉపాధ్యక్షుడు జనరల్ కౌన్సిల్ చే కౌన్సిల్ సభ్యులలో నుండి ఎన్నుకోబడి మూడేండ్ల కాలంపాటు పదవిలో వుండును.

అయితే మొదటి పర్యాయం మాత్రం ఉపాధ్యక్షుణ్ణి ప్రభుత్వమే నియమిస్తుంది.

2. అధ్యక్షుడు లేనప్పుడు, లేదా అధ్యక్షుడు పని చేయజాలక పోయినప్పుడు ఉపాధ్యక్షుడు అధ్యక్షుడుగా పని చేస్తూ అధ్యక్షుని అధికారాల నన్నిటినీ నిర్వర్తించును.

## 8. కోశాధిపతి:

1. అకాడమీ కోశాధిపతిని రాష్ట్ర ప్రభుత్వమే తాను నిర్ణయించిన కాలం మేరకు నియమిస్తుంది. కోశాధిపతి జనరల్ కౌన్సిల్ ఎక్సు అఫీషియో సభ్యుడుగా కూడా నామినేట్ చేయబడును.

2. కోశాధిపతి విధులు ఇవి:-

(అ) అకాడమీ ఎగ్జిక్యూటివ్ బోర్డు అజమాయిషీకి లోబడి కోశాధిపతి అకాడమీ ఆస్తి పెట్టుబళ్ళ మేనేజిమెంటును నిర్వర్తించును. అంతేగాక సాలుసరి అంచెనాలనూ, లెక్కలనూ తయారుచేసి వాటిని ఎగ్జిక్యూటివ్ బోర్డుకూ, జనరల్ కౌన్సిల్‌కూ సమర్పించే బాధ్యత వహించును.

(ఆ) ఎగ్జిక్యూటివ్ బోర్డు అధికారాలకు లోబడి, కోశాధిపతి,ఏపని నిమిత్తం ఏ డబ్బు కేటాయింపబడిందో లేక మంజూరు చేయబడిందో ఆ పని నిమిత్తం ఆ డబ్బును వినియోగించే బాధ్యత వహించును.

(ఇ) అకాడమీ ముద్రకు కోశాధిపతి సంరక్షకాధికారిగా వ్యవహరించును. అకాడమీ జరిపిన అన్ని కంట్రాక్టుల పైన కోశాధిపతి సంతకం పెట్టును.

(ఈ) ఎగ్జిక్యూటివ్ బోర్డు తనకు అప్పగించిన ఇతర అధికారాలను కూడా కోశాధిపతి చెలాయించును.

3. డబ్బు తీసుకొన్నప్పుడు కోశాధిపతి గాని లేక ఎగ్జిక్యూటివ్ బోర్డు అనుమతించిన ఇతర వ్యక్తి లేక వ్యక్తులు గాని సక్రమమైన వోచర్లు వుంచవలెను. అకాడమీకి ఇచ్చిన డబ్బుకు ఆ రసీదులు తగు జవాబు దారీగా వుండగలవు.

## 9. కార్యదర్శి:

1. కార్యదర్శి అకాడమీకి ముఖ్య కార్య నిర్వహణాధికారిగా వుండును. ఈయన ఎగ్జిక్యూటివ్ బోర్డుచే బోర్డు సభ్యులలో నుండి ఎన్నుకోబడును. కార్యదర్శి ఎంతకాలం పదవిలో వుండేదీ, ఏ నియమాల ప్రకారం పని చేసేదీ ఎగ్జిక్యూటివ్ బోర్డే నిర్ణయిస్తుంది.

అయితే మొదటి కార్యదర్శిని మూడేండ్ల గడువుకు మించకుండా రాష్ట్ర ప్రభుత్వం నియమిస్తుంది. ఆయన నియామకపు షరతులను ప్రభుత్వం వివరిస్తుంది.

2. కార్యదర్శి జనరల్ కౌన్సిలుకూ ఎగ్జిక్యూటివ్ బోర్డుకూ, ఆర్థిక సంఘానికీ, జనరల్ కౌన్సిల్‌చే లేదా ఎగ్జిక్యూటివ్ బోర్డుచే ఏర్పాటు చేయబడు ఇతర స్థాయి సంఘాలకూ ఎక్సు అఫీషియో కార్యదర్శిగా వుండును.

3. కార్యదర్శి విధులు ఇవి:-

1. అకాడమీ రికార్డులకూ, ఎగ్జిక్యూటివ్ బోర్డు అప్పగించిన అకాడమీ ఆస్తి పాస్తులకు సంరక్షణాధికారిగా వ్యవహరించడం.

2. అకాడమీ తరఫున అధికార ఉత్తర ప్రత్యుత్తరములుజరపడం.

3. అకాడమీ అధికార సంస్థల సమావేశాలు జరుగునప్పుడు, అకాడమీ నియమించిన కమిటీల సమావేశాలు జరుగునప్పుడు నోటీసులు పంపడం.

4. అకాడమీ అధికార సంస్థల సమావేశాల వ్యవహార వివరములను, అకాడమీ నియమించిన కమిటీ సమావేశాల వ్యవహార వివరములను వ్రాసి వుంచడం.

## 10. సహాయ కార్యదర్శి

1. అకాడమీ సహాయ కార్యదర్శి ఎగ్జిక్యూటివ్ బోర్డుచే ఆ బోర్డులోని సభ్యులలో నుండి ఎన్నుకోబడి, మూడేండ్లపాటు పదవిలో వుండును.

అయితే మొదటి సహాయ కార్యదర్శిని రాష్ట్ర ప్రభుత్వం మూడేండ్లకాలానికి మించకుండా నియమిస్తుంది. ఆయన నియామకపు షరతులను ప్రభుత్వం విశద పరుస్తుంది.

2. సహాయ కార్యదర్శి కార్యదర్శికి విధి నిర్వహణలో తోడ్పడుతూ, కార్యదర్శి లేనప్పుడు ఆయన విధులను నిర్వర్తించును.

## 11. అకాడమీ అధికార సంస్థలు

అకాడమీ అధికార సంస్థలు ఇవి:-

1. జనరల్ కౌన్సిల్.
2. ఎగ్జిక్యూటివ్ బోర్డు.
3. ఆర్థిక సంఘం.
4. సందర్భానుసారంగా ఏవేని విధులను నిర్వహించడానికై జనరల్ కౌన్సిల్‌చే గాని లేక ఎగ్జిక్యూటివ్ బోర్డుచే గాని నియమింపబడు స్థాయీ సంఘాలు లేక అడ్ హాక్ కమిటీలు.

## 12. జనరల్ కౌన్సిల్

1. జనరల్ కౌన్సిల్ ఈ క్రింది వారితో ఏర్పాటగును:-

1. 5వ పేరాలో పేర్కొనబడిన అధికార్లు ఎక్సు అఫీషియో సభ్యులుగా వుందురు.
2. రాష్ట్ర ప్రభుత్వంచే నియమింపబడిన ఇద్దరు వ్యక్తులు. వారిలో ఒకరు విద్యాశాఖకు చెందినవారై వుందురు. వారిలో ఒకరు కోశాధి పతియై యుందురు.
3. రాష్ట్రంలోని మూడు విశ్వ విద్యాలయ ప్రాంతాలలో, ఆయా విశ్వ విద్యాలయ ప్రాంతంలోని సంగీత సంస్థల నుంచి ఆ విశ్వ విద్యాలయంచే నామినేట్ చేయబడిన ఒక్కొక్క ప్రతినిధి.
అయితే మొదటి పర్యాయం రాష్ట్ర ప్రభుత్వమే వారిని నియమిస్తుంది.
4. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ నుంచి' ఆంధ్ర ప్రదేశ్ లలితకళా అకాడమీ నుంచి జనరల్ కౌన్సిల్‌చే కోఆప్టు చేసుకోబడిన ఇద్దరు సభ్యులు.
5. రాష్ట్ర ప్రభుత్వంచే నామినేట్ చేయబడు ఆరుగురు సభ్యురాండ్రు.
6. రాష్ట్ర ప్రభుత్వంచే నామినేట్ చేయబడు అయిదుగురు ప్రముఖ వ్యక్తులు.
7. సంగీత, నాటక, నృత్య, చలనచిత్ర రంగాల నుంచి రాష్ట్ర ప్రభుత్వంచే నామినేట్ చేయబడు 25గురు వ్యక్తులు.
8. రాష్ట్రంలోని వివిధ సంస్థల ప్రతినిధులు 30 మంది. అయితే అట్టి సంస్థలు ఇందునిమిత్తమై అకాడమీచే పరిగణింపబడి వుండవలెను.
అయితే మొదటి పర్యాయం వారిని రాష్ట్ర ప్రభుత్వమే నామినేట్ చేస్తుంది.

2. (అ) జనరల్ కౌన్సిల్ సభ్యులందరూ వారు నామినేట్ చేయబడునప్పుడు 25 సంవత్సరములు నిండిన వయస్సు గలవారై ఉండవలెను.
(ఆ) ప్రభుత్వంచే నామినేటు చేయబడిన ఒక సభ్యుడు రాజీనామా ఇచ్చినా, లేక మరణించినా, లేదా న్యాయసంబంధమైన అనర్హత పొందినా అట్టి ఖాళీలో ప్రభుత్వం మరొకరిని నామినేట్ చేస్తుంది. ఆవిధంగా నామినేట్ చేయబడ్డవారు పూర్వపు సభ్యుడు ఆ పదవిలో వుండుటకు ఎంత గడువు మిగిలివున్నదో, ఆ గడువు మేరకు మాత్రమే పదవిలో వుంటారు.
(ఇ) నిర్దేశించబడిన సందర్భాలలో తప్ప లేకపోతే జనరల్ కౌన్సిల్ సభ్యులంతా మూడేండ్లపాటు పదవిలో వుందురు. తిరిగి ఆపదవిలో నియమింపబడే అర్హతకూడా వారికివుండును.

## 13. జనరల్ కౌన్సిల్ అధికారాలు, విధులు

జనరల్ కౌన్సిల్ అధికారాలు, విధులు ఇవి:-

1. తన సభ్యులలోనుండి అధ్యక్షుణ్ణి ఎన్నుకొనడం, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీనుండి, ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమీనుండి ఒక్కొక్క సభ్యుణ్ణి కోఆప్టు చేసుకోవడం.
2. 15 (6) సూత్రము ననుసరించి ఎగ్జిక్యూటివ్ బోర్డు సభ్యులను ఎన్నుకోవడం; ఎగ్జిక్యూటివ్ బోర్డు వ్యవహార నియమావళిని తయారు చేయడం.
3. 17 (3) సూత్రము ననుసరించి ఆర్థిక సంఘపు సభ్యుణ్ణి ఎన్నుకోవడం, ఆర్థికసంఘ వ్యవహార నియమావళిని తయారు చేయడం.
4. ఎగ్జిక్యూటివ్‌బోర్డు తయారుచేసిన అకాడమీ సాలుసరి బడ్జెటును ఆమోదించడం.
5. కౌన్సిల్ సమావేశానికి హాజరైన సభ్యులలో కనీసం నాలుగింట మూడువంతుల మెజారిటీ

వోటింగుతో నృత్య, నాటక, సంగీత, చలనచిత్ర రంగాలలో ప్రతిభా వంతులైన వారిని అకాడమీ సభ్యులు (ఫెలో) గా ఎన్నుకోవడం. అయితే అలా ఎన్నుకోబడువారు ఎగ్జిక్యూటివ్ బోర్డుచే సిఫార్సు చేయబడినవారై వుండవలెను.

6. అకాడమీనుండి సహాయం పొందడానికీ, నియమావళిలో ప్రస్తావించబడిన ఇతర ఉద్దేశముల నిమిత్తమూ రాష్ట్రంలో ముఖ్యమైన నృత్య, నాటక, సంగీత, చలనచిత్ర సంస్థలను ఎన్నిక చేయడం. అలా ఎన్నికచేయబడ్డ సంస్థలను ప్రభుత్వం పరిగణించి వాటికిసహాయం చేస్తుంది.

7. ఎగ్జిక్యూటివ్ బోర్డు ప్రతిపాదించిన కార్యక్రమాలను, ప్రత్యేక పనులను పరిశీలించి ఆమోదం తెలుపడం.

8. తన నియమావళినీ, నిబంధనలనూ, ఉపనియమావళినీ, వ్యవహార నియమాలనూ సిద్ధంచేయడం.

## 14. జనరల్ కౌన్సిల్ సమావేశాలు

అధ్యక్షుడు నిర్ణయించిన స్థలంలో, ఆయన నిర్ణయించిన తేదీనాడు, జనరల్ కౌన్సిల్ సాధారణంగా ప్రతిసంవత్సరం ఒక పర్యాయం సమావేశమగును. అయితే అధ్యక్షుడుగాని లేక ఎగ్జిక్యూటివ్ బోర్డుగాని ఎప్పుడైనా ప్రత్యేక సమావేశమును ఏర్పాటు చేయవచ్చు. అలాంటి ప్రత్యేకసమావేశం బోర్డుయొక్క చొరవవల్లగాని లేదా జనరల్ కౌన్సిల్ మొత్తం సభ్యులలో మూడింట రెండు వంతుల మందికి తక్కువగాని సభ్యుల కోర్కెపై గాని ఏర్పాటు కావచ్చు.

## 15. ఎగ్జిక్యూటివ్ బోర్డు

ఎగ్జిక్యూటివ్ బోర్డు ఈ దిగువ సభ్యులతో ఏర్పడును:-

1. అధ్యక్షుడు
2. ఉపాధ్యక్షుడు
3. కోశాధిపతి
4. కార్యదర్శి
5. సహాయ కార్యదర్శి
6. జనరల్ కౌన్సిల్ చే ఎన్నుకోబడు మరి తొమ్మిదిమంది సభ్యులు. అయితే వీరిని మొదటి పర్యాయం రాష్ట్ర ప్రభుత్వమే నియమిస్తుంది.

## 16. ఎగ్జిక్యూటివ్ బోర్డు అధికారాలు, విధులు

1. జనరల్ కౌన్సిల్ సూచించిన విధానాలకు లోబడి అకాడమీయొక్క కార్య నిర్వహణ బాధ్యత వహించడం.

2. అకాడమీ పనినీ, కార్యాలయాన్నీ పర్యవేక్షించి అజమాయిషీ చేయడం.

3. అకాడమీ కార్యక్రమాలను, ప్రత్యేకంగా చేయవలసిన పనుల కార్యక్రమాలను ఆలోచించి సిద్ధంచేసి జనరల్ కౌన్సిల్ కు సమర్పించడం.

4. ఆర్థికసంఘం నిర్ణయించిన పరిమితులకు లోబడి అకాడమీ సాలుసరి బడ్జెటును తయారుచేసి, జనరల్ కౌన్సిల్ ఆమోదం నిమిత్తం సమర్పించడం.

5. అకాడమీ వార్షిక నివేదికను, లెక్కలను తయారుచేసి జనరల్ కౌన్సిల్ పరిశీలన నిమిత్తం పంపడం.

6. అకాడమీ కార్యదర్శినీ, సహాయ కార్యదర్శినీ, సిబ్బందిలోని ఇతర సభ్యులను ఎన్నుకోవడం. అయితే సిబ్బందిలో ఎవరిని నియమించే అధికారం కార్యదర్శికి ఇవ్వబడిందో అట్టివారిని కౌన్సిల్ ఎన్నుకోవడానికి వీలులేదు.

7. అకాడమీ ఫెలోలుగా ఎన్నుకోవడానికై ప్రముఖ కళాకారుల పేర్లను జనరల్ కౌన్సిలుకు ప్రతిపాదించడం.

8. వ్యక్తులనుండి, సంఘములనుండి, ప్రజాసంస్థల నుండి విరాళాలు సేకరించడం.

9. ఈ నియమావళి సూత్రములను అమలుజరపడం నిమిత్తమై నియమాలను నిబంధనలను తయారు చేయడం.

10 ఎగ్జిక్యూటివ్ బోర్డు సభ్యులు, వారు జనరల్ కౌన్సిల్ సభ్యులుగా వున్నంత కాలము ఆ హోదాలో నుందురు.

## 17. ఆర్థికసంఘం

ఆర్థికసంఘం ఈ క్రిందివారితో ఏర్పడును:-

1. అధ్యక్షుడు ఈ సంఘానికి చైర్మన్‌గా వుండును.
2. కోశాధిపతి
3. జనరల్ కౌన్సిల్ సభ్యులలోనుంచి రాష్ట్ర ప్రభుత్వం నియమించు ఒక ప్రతినిధి.
4. జనరల్ కౌన్సిల్ ప్రతినిధి ఒకరు.
5. ఎగ్జిక్యూటివ్ బోర్డు ప్రతినిధి ఒకరు. ఈయన జనరల్ కౌన్సిల్ సభ్యుడే కానక్కరలేదు. అయితే మొదటిపర్యాయం మాత్రం సభ్యులందరినీ ప్రభుత్వమే నామినేట్ చేస్తుంది.

## 18. ఆర్థిక సంఘం విధులు

ఆర్థికసంఘం అకాడమీయొక్క బడ్జెట్ అంచెనాలను పరిశీలించి, వాటివిషయమై ఎగ్జిక్యూటివ్ బోర్డుకు సిఫారసు చేస్తుంది. ఒక ఆర్థిక సంవత్సరంలో ఎంత మొత్తమును ఖర్చు పెట్టవచ్చో దాని పరిమితిని నిర్ణయిస్తుంది. అకాడమీ యొక్క ఆర్థిక వసతులను చూస్తూవుంటుంది.

## 19. ఇతరములు

1. అకాడమీయొక్క ఏదేని అధికారసంస్థ ఈ నియమావళిలో పేర్కొనబడిన దాని అధికారాలూ విధులప్రకారం వ్యవహరిస్తే తప్ప లేకపోతే జనరల్ కౌన్సిల్‌గాని లేక ఏదేని అకాడమీ అధికారసంస్థగాని చేసిన ఏదేని నియమమును లేక నిర్ణయమును జనరల్ కౌన్సిల్ సవరించవచ్చు లేదా త్రోసిపుచ్చవచ్చు.
2. ఈ నియమావళిని జనరల్ కౌన్సిలు, కౌన్సిల్ సమావేశానికి హాజరైన మొత్తం సభ్యులలో నాలుగింట మూడు వంతుల మందియొక్క మెజారిటీ వోటుతో జనరల్ కౌన్సిల్ నిర్ణయించినవిధంగా సవరించవచ్చు. అయితే వోటింగుకు హాజరైన సభ్యులు జనరల్ కౌన్సిల్ మొత్తం సభ్యులలో 51 శతికి తక్కువగాకుండా వుండవలెను.
3. అకాడమీ లెక్కలను ప్రతియేటా ఆడిట్ చేయుటానికై రాష్ట్రప్రభుత్వం ఆడిటర్లను నియమించును.

# అఖిల భారత సహకార సప్తాహం

భారత ప్రభుత్వ సహకార మంత్రి శ్రీ పంజాబ్ రావు దేశ్ ముఖ్ 1957 నవంబరు 2వ తేదీ నుంచి 8వ తేదీ వరకు జరుపబడిన అఖిల భారత సహకార సప్తాహానికి సందేశమిస్తూ "సామ్యవాద పద్ధతి సమాజం అనే ధ్యేయంమానవక్కృషికి సంబంధించిన ప్రతిరంగంలో ప్రజాస్వామ్యబద్ధమైన నిర్దిష్ట కార్య రూపందాల్చాలంటే జీవిత గమన మార్గాలలో సహకార సిద్ధాంత ఆదర్శాల అవలంబన, సహకార విధానం వర్తింపు అత్యంతావశ్యకం. ఆ ఆవశ్యకతను సహకారోద్యమంలో పనిచేస్తున్న కార్యకర్తలకూ ప్రజలకూ తెలియజెప్పవలెననే లక్ష్యంతోనే అఖిలభారత సహకార దినోత్సవం, అఖిలభారత సహకార సప్తాహమూ జరుపబడుతున్నాయి" అని అన్నారు.

హైద్రాబాదు కేంద్ర సహకార సంఘం వారు ఈ సంవత్సరం హైద్రాబాదుసికింద్రాబాదు జంటనగరాలలో సహకార సప్తాహం జరిపారు. ఈ సప్తాహంలో ఒక్కొక్క రోజును ఒక్కొక్క సంస్థకు కేటాయించారు. ప్రారంభోత్సవం మాత్రం కేంద్ర సహకారసంఘం ఆధ్వర్యానే నవంబరు 2వ తేదీన మధ్యప్రదేశ్ మాజీగవర్నరు డా. పట్టాభి సీతారామయ్యగారి అధ్యక్షతన జరిగింది. ఆంధ్రప్రదేశ్ రెవిన్యూమంత్రి శ్రీ కళా వెంకటరావు గారు సప్తాహానికి ప్రారంభోత్సవం జరిపారు. ఆరోజే 35వ అంతర్జాతీయ, అఖిలభారత సహకార దినోత్సవం కూడా కలిసివచ్చాయి. కేంద్ర సహకార సంఘం ఆవరణలోనే నవంబరు 8వ తేదీన "రచయితల దినోత్సవం" రాష్ట్రి



సహకార సప్తాహం ప్రారంభోత్సవానికి డా. పట్టాభి సీతారామయ్యగారు అధ్యక్షత వహించారు



"వినిమయదారులు, కార్మికుల దినోత్సవము"ను రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి ప్రారంభించారు



"పొదుపు దినోత్సవము"ను రాష్ట్ర సహకార మంత్రి నవాబ్ మెహదీ నవాజ్ జంగ్ ప్రారంభించారు

ఆర్థిక మంత్రి డా. బెజవాడ గోపాలరెడ్డిగారి అధ్యక్షతన జరిగింది. అది సప్తాహంలో ఆఖరిరోజు. "సహకార సమాచారము" పత్రికలో ఆ సంవత్సరం వ్యాసములు వ్రాసిన ముగ్గురు ఉత్తమ రచయితలకు నగదు బహుమతులు ఇవ్వబడినవి.

మిగిలిన ఆరురోజులలో (అంటే మొదటిరోజు, చివరి రోజుపోగా) "వినిమయదారుల దినోత్సవం", "ఉత్పత్తిదారుల దినోత్సవం", "కార్మికుల దినోత్సవం", "స్త్రీల దినోత్సవం", "సభ్యత్వ దినోత్సవం", "పొదుపు దినోత్సవం" జరుప బడ్డాయి.

"వినిమయ దారుల దినోత్సవం" ఆర్. టి. డి. పనివారల సహకార వినిమయ దారుల సంఘంలో రాష్ట్ర రహదార్ల మంత్రి శ్రీ యం. నరసింగరావు గారిచే ప్రారంభింప బడింది.

"వినిమయ దారులు మరియు కార్మికుల దినోత్సవము"నకు రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి పారిశ్రామిక సహకార సంస్థల సమాఖ్యలో ప్రారంభోత్సవం జరుపుతూ సహకారోత్పత్తిని ప్రశంసించారు. ప్రభుత్వం తగు విధంగా సహాయపడగలదని చెప్పారు.

"స్త్రీల దినోత్సవం" సికింద్రాబాదులోని జీరా బూట్ పాలిష్ సహకార పారిశ్రామిక కార్యకేంద్రంలో శ్రీమతి నాగరత్నమ్మ సంజీవరెడ్డి అధ్యక్షతన జరిగింది. గవర్నర్ సతీమణి శ్రీమతి లలితా సాచార్ సభను ప్రారంభిస్తూ ఆంధ్రప్రదేశ్ స్త్రీలు సహకారోద్యమంలో పాటు పడవలెనని ఉద్బోధించారు.

"సభ్యత్వము మరియు గృహవసతి" దినోత్సవం చిక్కడ పల్లిలోని శాంతినికేతన్ గృహ నిర్మాణ కాలనీలో వరంగలు అడ్వకేటు శ్రీ చంద్ర మౌళీశ్వరరావు అధ్యక్షతన జరిగింది.

"పొదుపు దినోత్సవం" లాలాగుడా సెంట్రల్ రైల్వే వర్కు షాపులో సెంట్రల్ రైల్వే డివిజనల్ సూపరింటెండెంట్ శ్రీ రఫీహైదరీ అధ్యక్షతన జరిగింది. రాష్ట్ర సహకారమంత్రి నవాబ్ మెహదీనవాబ్ జంగ్ ఈ ఉత్సవాన్ని ప్రారంభిస్తూ కార్మికులు సహకార భావాన్ని అలవరచుకొని, స్త్రీలలోను పిల్లలలోను పొదుపరితనమును వ్యాపింప జేయవలెనని ప్రబోధించారు.

ఈ సప్తాహం సందర్భంగా అనేక [illegible]ర సంస్థలు ప్రజలలో సహకారోద్యమ సిద్ధాం[illegible]ను ప్రచారం చేయగలిగినవి. సప్తాహోత్సవాలలో ఉత్పత్తిదారులు కార్మికులు బహుళంగా పాల్గొన్నారు.



"స్త్రీల దినోత్సవము"ను గవర్నర్ సతీమణి శ్రీమతి లలితా సాచార్ ప్రారంభించారు

# నల్లగొండలో జిల్లా ఉద్యోగ సాధక సంస్థ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సంఘసంక్షేమ, కార్మిక శాఖల మంత్రి శ్రీ డి. సంజీవయ్య 1957 నవంబరు 28వ తేదీన నల్లగొండలో జిల్లా ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజీకి ప్రారంభోత్సవం జరిపారు. నల్లగొండ జిల్లాలో ఉద్యోగాలకోసం, పనులకోసం వెదుకుతున్నవారికి ఉద్యోగాలను, పనులను సమకూర్చడమే ఈ ఎక్స్చేంజీ ముఖ్యోద్దేశం. సర్వీస్ కమీషనుక్రిందికి, లేక కొన్ని రకాల ఉద్యోగాలకు అభ్యర్థులను ఎన్నిక చేయడానికై ప్రత్యేకంగా నియమింప బడినట్టి అధికారుల విధుల క్రిందికి రానట్టి కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల ఉద్యోగాలకన్నిటికీ ఈ ఎక్స్చేంజీ అభ్యర్థులను ఎన్నికచేసి పంపుతుంది.

రెండవ పంచవర్ష ప్రణాళికననుసరించి ఆంధ్రప్రదేశ్‌లో జాతీయ ఉద్యోగ సాధకసంస్థ సర్వీసును విస్తృతం చేయాలన్న పథకము ననుసరించి ఈ ఎక్స్చేంజీ నెలకొల్పబడింది. ఈరాష్ట్రంలో తెరువబడుతున్న ఎక్స్చేంజీలలో ఇది పదునాల్గవది. తెలంగాణా ప్రాంతంలో ఇది మూడవ ఎక్స్చేంజి. తక్కిన రెండూ హైదరాబాదు, వరంగలు ఎక్స్చేంజీలు. హైదరాబాదు ఎక్స్చేంజీ 1945లోను, వరంగలు ఎక్స్చేంజీ 1947లోను తెరువబడినవి. రెండవ పంచవర్ష ప్రణాళిక యొక్క పథకను ననుసరించి త్వరలో నిజామాబాదు, ఆదిలాబాదు జిల్లాలలో ఎక్స్చేంజీలు తెరువబడగలవు. ఆ తరువాత తెలంగాణాలో మిగిలిన కరీంనగర్, ఖమ్మం, మెదకు,



*నల్లగొండలో జిల్లా ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజీ ప్రారంభింపబడిన సందర్భంలో రాష్ట్ర సంఘసంక్షేమ, కార్మిక శాఖలమంత్రి శ్రీ డి. సంజీవయ్య ప్రసంగిస్తున్న దృశ్యం*



*23-11-1957 తేదీన నల్లగొండ ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజీలో మొదటి కార్డును శ్రీ డి. సంజీవయ్యా రిజిష్టరు చేశారు*

మహబూబునగర్ జిల్లాలలో ఎక్స్చేంజీలు తెరువబడుతాయి.

ఆంధ్రప్రాంతంలో ఇదివరకే ప్రతిజిల్లాకూ ఒక ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజీ వుంది. విజయవాడ, విశాఖపట్నం ఎక్స్చేంజీలు 1945 లోను, అనంతపురం ఎక్స్చేంజీ 1946 లోను, గుంటూరు, కడప, చిత్తూరు, నెల్లూరు, కర్నూలు, కాకినాడ, ఏలూరు ఎక్స్చేంజీలు 1947 లోను, శ్రీకాకుళం ఎక్స్చేంజీ 1950లోను ఏర్పాటుచేయబడినవి. నాగార్జునసాగర్ ప్రాజెక్టు అవసరముల నిమిత్తమై అచ్చట త్వరలో ఒక ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజీ తెరువబడుతుంది. ఆంధ్రప్రదేశ్ లో ఇటువంటి ఎక్స్చేంజీ ఇది మొట్టమొదటిదని చెప్పవచ్చు.

# CURRENT PUBLICATIONS FOR SALE

| No. | Title | Price |
|---|---|---|
| 1. | Utility Diary — India 1958 | 3.00 |
| 2. | Prestige Diary — India 1958 | 5.00 |
| 3. | T. T. Krishnamachari's Speeches | 2.00 |
| 4. | Aspects of Indian Music | 0.75 |
| 5. | Gandhi in Champaran | 1.50 |
| 6. | India's Wild Life | 1.50 |
| 7. | Socialistic Pattern | 0.25 |
| 8. | Resources for the Second Plan | 0.25 |
| 9. | Hygienic Living | 0.25 |
| 10. | Elections in Kashmir | 0.25 |
| 11. | New Era of Science | 0.25 |
| 12. | Panchaseela | 0.25 |
| 13. | Akashvani Kavya-Sangam | 1.00 |
| 14. | 1857 — Pictorial Presentation | 4.00 |
| 15. | The Way of Buddha | 30.00 |
| 16. | Khir Ki Gudiya | 0.50 |
| 17. | Kashmir Album | 10.00 |
| 18. | Children of India | 1.50 |
| 19. | Major Water & Power Projects in India | 0.50 |
| 20. | Save Your Home From Fire | 0.75 |

Available from :

**INFORMATION CENTRE,**
C/o Information Department,
Hyderabad-Dn. 1.

# ఆంధ్రప్రదేశ్


జనవరి, 1958.

సంపుటి 2 సంచిక 3

పుష్యము, శాలివాహనశకము - 1879


## విషయసూచిక




— చందా వివరాలు —

సాలుసరి రూ. 1-8-0 లేక ఒక రూపాయి 50 నయాపైసలు

విడిప్రతి 0-2-0 లేక 12 నయాపైసలు

ఆంధ్రప్రదేశ్ సమాచార పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి సిటిజన్ ప్రెస్‌లో ముద్రింపబడినది.

# నాగార్జున సాగర్ ప్రాజెక్టు క్రింద ఆయకట్టు అభివృద్ధి

*నాగార్జున సాగర్ ప్రాజెక్టు క్రింది ఆయకట్టు పూర్తిగా అభివృద్ధి కావడమనేది* ***1967-68*** *సంవత్సరంలో జరుగగలదని ఆశింపబడుతున్నప్పటికీ, ఈ ప్రాజెక్టువల్ల సత్వర ప్రయోజనాలు కలిగే విధంగా దీనికి సంబంధించిన అన్ని పనులను సమన్వయ పద్ధతిద్వారా వెంటవెంటనే జరిపించ వలెనని నిర్మాతలు ఉద్దేశిస్తున్నారు. ఇందుకొరకై ప్రాజెక్టు అభివృద్ధి సమితి వారు ప్రాజెక్టు పని మొదలైన సంవత్సరం నుంచే దానికి సంబంధించిన వివిధ సమస్యలను పరిష్కరిస్తూ, పని జరిపిస్తూ వున్నారు. ఇంత వరకు గమనించదగిన అభివృద్ధి సాధింపబడింది.*

నాగార్జున సాగర్ ప్రాజెక్టుక్రింద సాగుకు నీరు ఎలా లభిస్తూ వుంటుందో దానితోపాటు ఆయకట్టునుకూడా అభివృద్ధి పరచవలెనని లక్ష్యంగా పెట్టుకో బడింది. ప్రాజెక్టు నిర్మాణం జరిగే కొద్దీ సాగునీరుకూడా లభిస్తూ వుంటుంది. అలా లభించే నీటిని తోడ్తోడనే పొలాలకు అందజేయబడుతుంది. ఏమైనా ఇది ముఖ్యమైన సమస్య. దీనిని వివిధ దృక్పథాలతో పరిష్కరించవలసి వుంటుంది. మొదటి విషయమేమిటంటే ఈ ప్రాజెక్టువల్ల ప్రయోజనము ను పొందే జనాభాయొక్క ఆర్థిక స్తోమతను నిర్ధారణ చేయడానికై ప్రాతిపదికగా ఉపకరించే ఒక తేదీ నిర్ణయించ బడాలి. ఈపని జరిగినప్పుడు ఈ ప్రాజెక్టు యొక్క ఆర్థిక సమస్యలను, భవిష్య దభివృద్ధిని అంచెనా కట్టడానికి వీలవుతుంది. రెండవది డాము నిర్మాణంతో పాటు కాలువల త్రవ్వకం, దానితోపాటు ఆయకట్టు అభివృద్ధి పని—ఈ మూడు పనులు వెంటవెంటనే జరుగడం. ఇలా జరిగినట్లయితే ప్రాజెక్టు పని నిర్ణీత కార్యక్రమం ప్రకారం జరిగి, నీరు లభించగానే దానిని పొలాల సాగుకు వినియోగించ డానికీ, ఆశించిన ఫలితాలను త్వరగా సాధించడానికీ వలను పడుతుంది. మూడవది నిర్ణీత కార్యక్రమం ప్రకారం పనులు జరుగుతూవుండగా ఎప్పటికప్పుడు ఆపనులు ఎంతదాకా అయినవీ తేల్చుకొని ప్రతిబంధకాలేమైనా ఎదురొక్కంటే వాటిని పరిష్కరించడం. లక్ష్యం నెరవేరే విధంగా కార్యక్రమాలను తిరిగి సర్దుబాటు చేసుకోవడం. ఈమూడు విషయాలకు సంబంధించిన పని ~~ప్రాజెక్టుని~~ మొదలైన మొదటి సంవత్సరంలోనె చేపట్టబడింది.

బహుళార్థ సాధక ప్రాజెక్టుల పథకాలను వేయడంలో ఇంజనీరింగు వివరాలపట్ల హెచ్చు శ్రద్ధ వహించబడినప్పటికీ, ప్రాజెక్టుయొక్క సాంఘిక ఆర్థిక విషయాల పట్ల ఎక్కువ శ్రద్ధచూపడం జరగలేదు. నాగార్జున సాగర్ ప్రాజెక్టు విషయంలో మాత్రం అభివృద్ధి సమితి మొదటి సమావేశంలోనే ప్రాజెక్టుయొక్క వ్యవసాయ సంబంధ విచారణ పూర్తి అయిన వెంటనే, ప్రాజెక్టువల్ల కలిగే సాంఘిక ఆర్థిక ఫలితాలను కూడా శాస్త్రీయ పద్ధతి ప్రకారం పరిశీలింప బడవలెనని నిర్ణయింప బడింది. ఈవిచారణ సందర్భంలో భారత వ్యవసాయ పరిశోధనా మండలివారి ప్రతినిధులతోను, ఇండియా రిజర్వుబ్యాంకు, గోఖలే రాజకీయ ఆర్థిక సంస్థ, ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రతినిధులతోను సంప్రదింపులు జరుపబడ్డవి.

ప్రాజెక్టు ఎడ్మినిస్ట్రేటర్ అభివృద్ధి సమితికి సమావేశకర్త. ఈ సమితిలో అభివృద్ధి కార్యక్రమానికి సంబంధించిన రాష్ట్ర ప్రభుత్వాధికార్లు సభ్యులుగా వున్నారు. ఇలాంటి సమితి వున్నప్పటికీ, సవివరంగా సర్వే పనిని రూపొందించడానికీ, ప్రాజెక్టు స్థలంలో ఎప్పటికప్పుడు జరిగే పనులను సమీక్షించి సలహాలివ్వడానికీ చిన్నపాటి సాంకేతిక సమితిని ఏర్పాటు చేయడం అవసరమని భావింప బడింది. సాంకేతిక సమితికి సలహాలిచ్చి సహాయ పడడానికీ, ముఖ్యంగా గ్రామీణ పరపతి, సహకారం మున్నగు అంశాల విచారణకుగల అవకాశమును నిర్ధారణ చేయడానికి సలహాలివ్వడానికై రిజర్వుబ్యాంకువారు తమ అధికారిని మొదట జరిగే ఒకటి, రెండు ప్రాథమిక సమావేశాలకు పంపడానికి అంగీకరించారు. అందుచేత

గోఖలే రాజకీయ ఆర్థికసంస్థ, భారతీయ వ్యవసాయ పరిశోధనా మండలి, ఆంధ్ర విశ్వవిద్యాలయం మొదలగు సంస్థల ప్రతినిధులను సభ్యులుగా తీసుకొని సమితిని ఏర్పాటు చేయడమైనది. ప్రాజెక్టుకు సంబంధించిన పరిశీలనలో వ్యవసాయ పరిశీలన విభాగం, సాంఘిక ఆర్థిక పరిశీలనా విభాగం వేరువేరుగా వుండవలెనా, లేక ఏకంగా ఒకటే సమగ్ర పరిశీలన జరుగవలెనా అన్న సమస్య సమితిని ఎదుర్కొన్నది. మొదట ఈ రెండు పరిశీలనలు విడివిడిగా జరుపబడవలెనని తలపెట్టబడింది. అందుకు కారణమేమంటే దానివల్ల వ్యవసాయ రంగంలో లక్ష్యం ప్రకారం భోగట్టాను నిర్ధారణ చేయవలను పడడమేగాక ఈ రెండు పరిశీలనల ఫలితాలను నిర్వచన దశలో ఏకంచేసి వినియోగించుకోవడానికి ఇబ్బంది వుండదన్న అభిప్రాయం కూడా అప్పుడు కలిగింది.

సమితి మొదటి సమావేశంలో ఈ విచారణ పరిశీలనావకాశాలను గూర్చి ఈ దిగువ నిర్ణయాలు చేయబడ్డవి.

1. ఇంతకు క్రితం అభివృద్ధి సమితి నిర్ణయించిన విధంగా పరిశీలన రెండు భాగాలుగా వుండాలి. మొదటిది వ్యవసాయ పరిశీలన. రెండవది సాంఘికఆర్థికపరిశీలన. ఈరెండు పరిశీలనలుదేనికదే స్వతంత్రంగా జరిగినప్పటికీ, రెండింటికీ సాధ్యమైనంత హెచ్చుగా సమన్వయం కలిగించి ఒకపరిశీలనలో జరిగేవనే మరో పరిశీలనలో కూడా జరుగకుండా చూడడానికి తగుచర్యలు గైకొనబడాలి. ఈ రెండు పరిశీలనల ఫలితాలను నిర్వచన దశలో ఏకంచేసి, ప్రాజెక్టువల్ల ప్రయోజనం పొందే ప్రాంతంలోని స్థితిగతులను, సమస్యలను సమగ్రంగా చిత్రించే స్వరూపాన్ని తయారు చేయాలి.

2. వ్యవసాయ సంబంధమైన భోగట్టా సేకరణ విషయంలో నమూనా పరిశీలన జరుపడానికి అవసరమైన సాంకేతిక సహాయాన్ని భారతీయ వ్యవసాయ పరిశోధన మండలివారు సమకూరుస్తారు. ఫీల్డువ్యవస్థ యొక్క సాంకేతిక పర్యవేక్షణ భారత వ్యవసాయ పరిశోధన మండలివారికే వున్నప్పటికీ పరిపాలన సంబంధమైన అజమాయిషీ కంట్రోలు బోర్డుకే వుంటుంది.



3. సాంఘిక ఆర్థిక విచారణను వాల్తేరులోని ఆంధ్ర విశ్వ విద్యాలయంవారు జరుపుతారు. ఉద్యోగుల విషయంలో పరిపాలన, సాంకేతిక సంబంధమైన అజమాయిషీని తనకే వుంచాలని ఆంధ్ర విశ్వవిద్యాలయం కోరింది. ఉద్యోగులను నేరుగా భర్తీ చేసుకోవడంద్వారాగాని లేక ప్రభుత్వశాఖలనుంచి బదిలీ చేయడంద్వారాగాని తీసుకోవడం జరుగుతుంది. అలా తీసుకున్న ఉద్యోగులను ఫీల్డుపనికి పంపేముందు వారికి కొంతకాలంపాటు శిక్షణ ఇవ్వడ మవుతుంది.

4. సాంఘిక ఆర్థిక పరిశీలనకొరకై విశ్వ విద్యాలయం నిర్దిష్టమైన పథకము నొకదానిని సిద్ధంచేస్తుంది. ఉద్యోగులు కనీసం ఎంతమంది కావలెనో, ఖర్చు ఎంత అవుతుందో కూడా విశ్వవిద్యాలయం సూచిస్తుంది.

5. పరిశీలన స్వరూపాన్ని భారత వ్యవసాయ పరిశోధన మండలి, ఆంధ్ర విశ్వవిద్యాలయం అంతిమంగా సిద్ధం చేస్తాయి. గ్రామాలను ఎన్నిక చేయడం, వాటిని గ్రూపులుగా చేర్చడం, పరిచయ పర్యటనలు, ఉద్యోగుల భర్తీ మొదలగు విషయాలలో ప్రాథమిక చర్యలు గైకొన బడుతాయి.

6. అంతిమంగా రూపొందించబడిన పథకమునుగూర్చి పరిశీలన జరిపే సంస్థలు, కంట్రోలుబోర్డు, గోఖలే సంస్థ, రిజర్వు బ్యాంకు (వ్యవసాయ పరపతిశాఖ) సంప్రదింపులు జరుపుకోవడానికి వీ లేర్పాటు చేయబడుతుంది.

7. పరిశీలనకయ్యే ఖర్చును ఎవరు భరించాలి అన్న ప్రశ్న ఆ తరువాత నిర్ణయించడానికి వదిలి వేయబడుతుంది.

ఈ నిర్ణయాలను అభివృద్ధి సమితి దాని రెండవ సమావేశంలో ఆమోదించింది—సంస్థలు, వ్యవహార సరళి, సూత్రాలు నిర్ణయింప బడ్డవి. పరిశీలన స్వరూపానికి అంతిమ రూపమిచ్చే పని జరుగుతూ ఉన్నది. బహుశా వచ్చే సంవత్సరం పరిశీలనలు ఆరంభింప బడవచ్చు.

అభివృద్ధి సమితి ముఖ్య విధులుఇవి: ఇంజనీరింగు, భూసార పరిశీలనలకు కాల నిర్ణయ పట్టికలను తయారు చేయడం, భూమిని స్వాధీన పరచుకోవడం, ఆయకట్టు స్థిరీకరణ. కార్యక్రమం ప్రకారం అభివృద్ధి సాధింపబడునట్లుగా ఈ రెండు పనులను సమన్వయ పరచడం. ఇంత వరకు నిర్ణయింపబడినకార్య క్రమాన్నిబట్టి డామునిర్మాణం 1963-64 సంవత్సరాంతానికల్లా + 520 లెవెల్ వరకు పూర్తి కావాలి. కాలువలు + 490 లెవెల్ నుంచి వెడతాయి కాబట్టి కాలువల ద్వారా నీటిసప్లయి జరుగడానికి నీటి నిలవ కనీసం + 510 లెవల్ లో వుండాలి. 1962-63 సంవత్సరంలో మాత్రమే డాము + 510 లెవల్ ఎత్తుకు పెరుగుతుంది. సాగు నీటిపారుదల సీజను జూనులో ఆరంభమవుతుంది, కాబట్టి 1963-64 సంవత్సరంలో మాత్రమే మొట్టమొదటిసారిగా కాలువల ద్వారా నీటి కట్టు సాధ్య మవుతుంది. కనుక అన్ని విషయాల రీత్యా నాగార్జున సాగర్ కాలువల నిర్మాణం ఎనిమిదో సంవత్సరం ఆఖరులో అంటే 1963-64 లో పూర్తి అవుతుంది. ఆయకట్టు పూర్తి అభివృద్ధి పన్నెండో సంవత్సరంలో అంటే 1967-68 లో పూర్తి కాగలదని ఆశింపబడుతున్నది. ఈవిధంగా కాలువలు, పిల్లకాలువలు, పంటకాలువల నిర్మాణం అన్నివిధాలా చాలాముందుగానే అంటే 1963-64 సంవత్సరానికి ముందే పూర్తి చేయవలసి వుంటుంది. ఈ లక్ష్యాన్ని సాధించ వలెనంటే వివిధ రంగాలలో సమన్వీకృత చర్యలు అవసరం. అభివృద్ధి సమితి యొక్క మొదటి రెండు సమావేశాలలో తీసుకో బడిన చర్చనీ యాంశాలు ఇవి. వీటిని బట్టి అభివృద్ధికి సంబంధించిన వివిధాంశాలు ఎలా సమగ్రంగా పరిశీలింప బడుతున్నవో విదితమవుతుంది.

వ్యవసాయార్థిక పరిశీలన.

పంటల పథకం.

ఆయకట్టు స్థిరీకరణ.

భూమి స్వాధీన పరచుకోవడం.

అడవులను పెంచడం, భూసార పరిరక్షణ.

పునరావాస విధానం, కార్యక్రమం.

ప్రజా భాగస్వామ్యం.

ఆయకట్టు ప్రాంతంలో వివిధ శాఖల రెండవ పంచవర్ష ప్రణాళికలు.

అభివృద్ధి కార్యక్రమంలో వివిధ అంశముల యొక్క ప్రాముఖ్యత, ముఖ్యమైన అంశాల విషయంలో అభివృద్ధి సమితిగైకొన్నచర్యలు ఈ దిగువ వివరింపబడ్డవి.

ఆయకట్టు స్థిరీకరణ పనిని చేపట్టేముందు కాలువలు, ఉపకాలువలు మొదలగు వాటికి పంక్తులు ఏర్పర్చడం, పెద్దకాలువ పోయ్యే మార్గంలో ఎంతభూమి ఏయే పంటల క్రిందికి రాగలదో మున్నగు విషయాలను గూర్చిన అంతిమ నిర్ణయాలు చేయబడాలి. ఈ విధంగా పంటల పథకాన్ని నిర్ణయించే పని పెద్ద సమస్య.

అవుతుంది. ఉదాహరణకు కుడి కాలువక్రింద ⅓ మాగాణి, ⅓ మెట్ట ప్రాతిపదిక పై సాగునీటి సౌకర్యం కల్పించ వలెనని తలపెట్టబడింది. ఈ కాలువ జూన్ నుంచి డిసెంబరు నెలవరకు పారుతుంది. దీని క్రింది ఆయకట్టును రెండు ప్రాంతాలుగా విభజించ వలెననీ, ఒక ప్రాంతంలో ఖరీఫ్ పంట, రెండవప్రాంతంలో రబ్బీ పంట వుండవలెననీ, ఒక సూచన చేయబడింది. ఖరీఫ్ పైరు ప్రాంతంకంటె రబ్బీ పైరుప్రాంతం భిన్నంగా వుండగలదు. ఈ ప్రతిపాదనవల్ల కలిగే సౌకర్య మేమిటంటే చిన్న కాలువ వల్లనే మొత్తం ఆయకట్టుకు నీరు సరఫరా అవుతుంది, మొత్తం సరఫరా ఎక్కువ కాలంవరకూ వుంటుంది. అంటే ఒక ప్రాంతానికి జూన్‌నుంచి అక్టోబరు నవంబరు వరకూ, రెండవ ప్రాంతానికి సెప్టెంబరు-అక్టోబరు నుంచి ఫిబ్రవరి వరకూ నీరు సరఫరా అవుతుంది. మొత్తం ఆయకట్టును ⅓ ఖరీఫ్ మాగాణి, ⅓ ఖరీఫ్ మెట్ట, ⅓ రబ్బీ మెట్టగా విభజించవలెనని సూచింపబడింది.

అభివృద్ధి సమితివారు ప్రత్యామ్నాయ పంటల స్వరూపాన్ని, ముఖ్యంగా సెప్టెంబరు-అక్టోబరులో వరి పైరు వేస్తే అది విజయమవుతుందా అన్న విషయాన్ని సవివరంగా పరిశీలించారు. సామర్లకోట, మారుటేరు, బుచ్చిరెడ్డిపాళెం, సిరుగుప్ప మొదలగు వ్యవసాయ పరిశోధన కేంద్రాలలో లోగడ జరుపబడిన పరిశోధనల దృష్ట్యా ఆయకట్టును ఖరీఫ్, రబ్బీ బ్లాకులుగా విభజించడం ఆచరణ సాధ్యం కాదని సమితి భావించింది. ఒకవేళ ఇది సాధ్యమైనప్పటికీ, దీనివల్ల రైతులు ఏయే పంటలను పండించ వలెనో శాశ్వతంగా నిర్ణయంచేసి వేసినట్లవుతుందనీ, పంటలను తమఇష్టంప్రకారం మార్చుకోవడానికి రైతులకు వీలుండదనీ ఒక అభ్యంతరం వస్తుంది. కనుక ఈ విషయంలో ఇంకా పరిశోధనలు జరుపడం నిమిత్తమై ఒక్కొక్క రకం ప్రాంతంలో వ్యవసాయపరిశోధన కేంద్రాలను, ఉపకేంద్రాలను నెలకొల్పవలెనని అభివృద్ధి సమితి అంగీకరించింది. ఈ కేంద్రాలలో వివిధ పైరుల నీటి అవసరాలను పొదుపుచేసేటందుకు గాను నీటి సాగు పరిశోధనలు కూడా జరుపడం ఒక ముఖ్యోద్దేశం. ఈ విషయంలోవ్యవసాయ శాఖ డైరెక్టరు అప్పుడే ఒక పథకాన్ని తయారుచేశారు. ఆ పథకంలో నాగార్జున సాగర్ ప్రాజెక్టు ప్రాంతంలో రూ. 25.86 లక్షల ఖర్చుతో రెండు ప్రధాన పరిశోధన కేంద్రాలను, మూడు ఉప కేంద్రాలను నెల కొల్ప వలెనని సూచింపబడింది. ఈ పథకాన్ని అభివృద్ధి సమితి వారు తమ రెండవ సమావేశంలో చర్చించి, అట్టి కేంద్రాలను ప్రత్యేకరకంగా వుండే ప్రాంతాలలో నదుల వద్దగాని లేక కాలువలవద్ద గాని పెట్టవలెననీ, అలా పెట్టితే పరిశోధనల కవసరమైన నీటిని పంపు చేసి తీయడానికి వీలవుతుందనీ అభిప్రాయపడ్డారు. ఆ ప్రకారమే కేంద్రాల స్థాపనకుతగు ప్రాంతాల ఎన్నిక ఇప్పుడు జరుగుతున్నది

## ఇంజనీరింగు భూసార పరిశీలనలు

ఇక ఆయకట్టు స్థిరీకరణ విషయం. ప్రాజెక్టునిర్మాణం విషయంలోను. ఆయకట్టు అభివృద్ధి విషయంలోను తోడ్తోడనే పనులు జరిగి త్వరగా లాభాలు చేకూరవలె నన్న దృష్టిని అనుసరించి ఇంజనీరింగు పరిశీలనల విషయంలో సాధారణ పద్ధతి ప్రకారం పని జరుగవలెనా లేక సమగ్రాభివృద్ధి అనే లక్ష్యాన్ని సాధించడానికై సంక్షేప పద్ధతిని అనుసరించవలెనా అన్న ప్రశ్న ఎదురొక్కంది. నిర్ణీత పద్ధతి ప్రకారం ఇంజనీరింగు పరిశీలన జరుగ వలెనంటే కొంతకాలం పడుతుంది. కాబట్టి మొత్తం ఆయకట్టును రెండు అర్థ్వమైన ప్రాంతాలుగా విభజించి, ఉపకాలువలకు పటములపై గుర్తుపెట్టి ఆ తరువాత ఒక్కొక్క బ్లాకు గ్రాండు, గ్రామ పటములకు మార్చబడుతాయి. అట్టి ఇంజనీరింగు పరిశీలనల ప్రాతి పదికపై మూడేండ్లపాటు సమగ్ర భూసార పరిశీలనను జరిపించ వలెనని సమితి నిర్ణయించింది. ఆ ప్రకారమే భూసార ఇంజనీరింగు పరిశీలనల దశలవారీ కార్యక్రమాన్ని అభివృద్ధి సమితి ఆమోదించింది. ఆ పరిశీలనలు డాము, కాలువల నిర్మాణం, ఆయకట్టు స్థిరీకరణ కార్యక్రమం యొక్క కార్యక్రమ పట్టికకు అనుగుణంగా వుండగలవని సంతృప్తి చెందిన తరువాతనే సమితి తన ఆమోదాన్ని తెలిపింది. ఈ కార్యక్రమాలు అప్పుడు భూమి సేకరణ కార్యక్రమంతో సరిపెట్టబడ్డవి- కార్యక్రమ నిర్ణయం అలా వుండనిచ్చి, ఆయకట్టు స్థిరీకరణ విషయంలో అవలంబించవలసిన ప్రాతిపదిక సూత్రాలను కూడా బాగా ఆలోచించ వలసి వున్నది. ఈ విషయంపట్లకూడా తగుశ్రద్ధ వహించబడుతున్నది.

రెండవ ప్రణాళిక :

# 1957-58 సంవత్సరపు రాష్ట్ర గృహవసతి కార్యక్రమం

ప్రజల జీవన ప్రమాణాన్ని హెచ్చించడానికీ, సర్వతోముఖాభివృద్ధి ద్వారా పరిపూర్ణ జీవితావకాశాలను వారికి కలిగించడానికీ మనదేశంలో ఆర్థిక ప్రణాళికలు అమలు జరుప బడుతున్నవి. అయితే గృహవసతి సమస్యను పరిష్కరించక పోయినట్లయితే ప్రజల జీవన స్థాయిని హెచ్చించడానికై మనంచేస్తూవున్న ప్రయత్నాలు విజయవంతం కానేరవని ఇప్పుడు సర్వత్రా అంగీకరింప బడుతూవుంది. గృహవసతి కూడా వైద్య సంఘ సంక్షేమ సేవలవంటిది. వైద్య, సంఘసంక్షేమ సేవలు ప్రభుత్వ బాధ్యతలు. రెండవ పంచవర్ష ప్రణాళికలో గృహవసతి నిమిత్తమై రూ. 120 కోట్లు కేటాయింపబడ్డవి. ఇందులో కొంత ధన సహాయం చేయడం ద్వారా పారిశ్రామిక గృహనిర్మాణం, తక్కువ ఆదాయాల వారికి గృహనిర్మాణం, మురికి పేటల నిర్మూలన, కాఫీ మొదలగు తోటల పనివారికి గృహనిర్మాణం, గ్రామాలలో గృహనిర్మాణం, మధ్యరకం ఆదాయంగల వారికి గృహనిర్మాణం మొదలగునవన్నీ చేరి వున్నవి.

1957-58 సంవత్సరంలో ఈ రాష్ట్రంలో రూ. 108.26 లక్షల ఖర్చుతో 11 గృహవసతి పథకాలను అమలు జరుప వలెనని తలపెట్ట బడింది. ఈ 11 పథకాలలోను 5 పథకాలు ఆంధ్ర ప్రాంతంలో రూ. 38.89 లక్షల ఖర్చుతో అమలు జరుప బడుతవి. మిగిలిన 6 పథకాలు రూ. 69.37 లక్షల ఖర్చుతో తెలంగాణాలో అమలు జరుప బడగలవు. ఈ పథకాలన్నిటికీ కేంద్రప్రభుత్వం రూ. 100.18 లక్షల సహాయంచేస్తుంది. ఆ మొత్తంలో రూ 85.85 లక్షలుఅప్పులరూపంలోను, రూ.14.33లక్షలు గ్రాంటుల రూపంలోను లభిస్తాయి.

## ఆంధ్ర

గ్రామీణ గృహవసతి :- గ్రామీణ ప్రాంతాలలో గృహవసతి స్థితి గతులను అభివృద్ధి పరచడం చాలా పెద్ద సమస్య. అందుచేత రెండవ పంచవర్ష ప్రణాళికలో గ్రామీణ గృహవసతి కార్యక్రమానికి తగు ప్రాముఖ్యమివ్వబడింది. ఆంధ్రప్రాంతంలో 170 ఇండ్ల నిర్మాణానికి రూ 7.13 లక్షలు కేటాయింపబడ్డవి. ఈ పథకం క్రింద నివాస గృహాలను నిర్మించడానికై గ్రామీణ గృహనిర్మాణ సహకార సంఘాల సభ్యులకు దీర్ఘ కాలిక ఋణాలివ్వబడుతవి. 1957-58 సంవత్సరంలో గ్రామీణ ప్రాంతాలలో 140 ఇండ్ల నిర్మాణం కొరకై రూ. 6 లక్షల మేరకు దీర్ఘ కాలిక ఋణాలను ఇవ్వవలెనని తలపెట్టబడింది. ఈ మొత్తమును కేంద్రప్రభుత్వమే అప్పుల రూపంలో ఇస్తుంది.

### సహకార సంఘాలద్వారా పట్టణాలలో గృహ నిర్మాణం.

గ్రామాలలో తగు పని పాటలు లభించకపోవడం చేతనూ, పట్టణాలలో పెద్ద పెద్ద పరిశ్రమలు వెలసి, వ్యాపారాలు హెచ్చి ఎక్కువ ఆదాయం లభించే మార్గం కన్పడ్డం చేతనూ గ్రామీణ జనాభా పట్టణాలకు వలస పోతూవున్నది. ఈ విధంగా పట్టణాల జనాభా నానాటికీ హెచ్చి అక్కడ గృహసమస్య క్లిష్ట రూపం దాలుస్తున్నది. అందుచేత ఆంధ్రలోని పట్టణాలలో రెండవ ప్రణాళిక కాలంలో 1,120 ఇండ్లను నిర్మించడానికై ఒక పథకం సిద్ధం చేయబడింది. ఈ పథకమునమసరించి నివాస గృహములను నిర్మించడానికై సహకార గృహనిర్మాణ సంఘాల సభ్యులకు దీర్ఘ కాలిక ఋణాలివ్వబడుతాయి. 1957-58 సంవత్సరంలో రూ. 20.35 లక్షల మేరకు ఋణాలివ్వడంద్వారా 270 ఇండ్లను నిర్మింప చేయవలెనని తలపెట్ట బడింది. ఈ మొత్తమును కేంద్ర ప్రభుత్వం అప్పులరూపంలో ఇస్తుంది.

## స్థానిక సంస్థలు

1957-58 సంవత్సరంలో స్థానిక సంస్థలు వాటి క్రింద పనిచేస్తున్న తక్కువ జీతాల వారికి దాదాపు 150 ఇండ్లను నిర్మించడానికై ఆ సంస్థలకు రూ. 4.85 లక్షల మేరకు అప్పు లివ్వవలెనని తలపెట్ట బడింది. ఈ మొత్తమును కేంద్ర ప్రభుత్వం అప్పుల రూపంలో ఇస్తుంది.

## పారిశ్రామిక గృహ నిర్మాణ పథకం

పారిశ్రామిక కార్మికులకు చిన్న చిన్న ఇండ్లను నిర్మించడమే ఈ పథకం ఉద్దేశం. అందుకయ్యే ఖర్చుకుగాను భారత ప్రభుత్వం అప్పులరూపంలోను, సబ్సిడీల రూపంలోను సహాయం చేస్తుంది. ఈ పథకం క్రింద రెండు రకాల ఇళ్ళు నిర్మింపబడుతాయి. ఒక్కొక్కటి రూ. 2,700 ల ఖర్చులో ఒకగది ఇండ్ల నిర్మాణం; ఒక్కొక్కటి రూ. 3,400 ల ఖర్చుతో రెండు గదుల ఇండ్ల నిర్మాణం. ఈ ఖర్చులో స్థలం ఖరీదు, స్థలాన్ని అభివృద్ధిచేయడానికయ్యే ఖర్చులు చేరి వున్నవి. అయితే నీటిసరఫరా పారిశుధ్యపు ఏర్పాట్లు, ఎలక్ట్రికల్ ఫిట్టింగుల కయ్యే ఖర్చులు చేరిలేవు. ఈ రెండోరకం ఖర్చులను రాష్ట్ర ప్రభుత్వం భరిస్తుంది.

ఈ పథకంక్రింద 1957-58 సంవత్సరంలో మొత్తం 500 ఇండ్లను నిర్మించవలెనని తలపెట్టబడింది. వీటిలో విజయవాడలో 200, రాజమండ్రిలో 100, అదోనిలో 100, నంద్యాల లో 50, గూడూరులో 50 ఇండ్లు నిర్మింపబడుతాయి. వీటన్నిటికీ రూ. 5.52 లక్షలు ఖర్చుకాగలవు. ఈ ఖర్చుకు గాను కేంద్రప్రభుత్వం నుంచి రూ. 5.24 లక్షలు-అంటే రూ. 2.09 లక్షలు అప్పుల రూపంలోను, రూ 3.15 లక్షలు గ్రాంటుల రూపంలోను లభ్యమవుతాయి.

## గుంతకల్లు నూలు మిల్లు గృహ వసతి పథకం

ఈ పథకం క్రింద రెండవ పంచ వర్ష ప్రణాళికలో కేంద్ర ప్రభుత్వంవారు పారిశ్రామిక గృహవసతి పథకం క్రింద ఇచ్చే సహాయంతో గుంతకల్లులోని ఆంధ్ర కోఆపరేటివ్ స్పిన్నింగ్ మిల్సు లిమిటెడ్ కార్మికులకు గృహవసతి కల్పించుటకై 200 ఇండ్లను నిర్మించ వలెనని తలపెట్టబడింది. ఈ 200 ఇండ్లకుగాను 100 ఇండ్లు ప్రస్తుత సంవత్సరం రూ. 1.51 లక్షల ఖర్చుతో నిర్మింపబడుతవి. వీటికయ్యేపూర్తి ఖర్చును కేంద్రమే భరిస్తుంది. రూ. 0.91 లక్షను అప్పురూపంలోను, రూ. 0.60 లక్షను గ్రాంటు రూపంలోను కేంద్రం ఇస్తుంది.

## మురికి పేటల నిర్మూలన

ఇండ్లనుకట్టడానికై పాటించవలసిన నిబంధనలను పాటించకపోవడం చేతను, పారిశ్రామిక కార్మికులగృహవసతి విషయంలో అట్టే శ్రద్ధ చూపబడక పోవడంచేతను ఇండ్ల స్థలాల ధరలు పెరుగుతూ వుండడం చేతను అన్ని పట్టణాలలో మురికి పేటలు ఎక్కువైనవి. అందుచేత 1957-58 సంవత్సరంలో గుంటూరు, రాజమండ్రి, విజయవాడ, విశాఖపట్నం, చీరాల మునిసిపాలిటీలలో మురికి పేటల నిర్మూలన పథకాన్ని చేపట్టవలెనని తలపెట్టబడింది. ప్రస్తుత సంవత్సరంలో ఆంధ్రప్రాంతంలోని 23 స్థానిక సంస్థలకు మేలు కలిగే విధంగా ఊడ్చు పనివారల గృహవసతి పథకాన్నికూడా చేపట్టవలెనని తలపెట్టబడింది.

## తెలంగాణా ప్రాంతం

పారిశ్రామిక గృహనిర్మాణ పథకం :- ఈ పథకము ననుసరించి పూర్వపు హైద్రాబాదురాష్ట్రప్రభుత్వం, భారత ప్రభుత్వం చేసిన ఆర్థిక సహాయంతో నగరంలోని చిక్కడపల్లి, సీతాఫల్ మండి, అంబర్ పేట కాలనీలలోను వరంగలు, ఖమ్మం, నిజామాబాదు పట్టణాలలోను పారిశ్రామిక కార్మికులకు రూ. 100.02 లక్షల ఖర్చుతో ఒక గది ఇండ్లు, రెండుగదుల ఇండ్లను నిర్మించేపనిని చేపట్టింది. 1957 మార్చి ఆఖరువరకు ఈ నిర్మాణాలపై రూ. 68.81 లక్షలు ఖర్చుపెట్టబడ్డవి. ఇంకా రూ. 31.21 లక్షలు మిగిలాయి. ఈ మిగిలిన పనులకుగాను 1957-58 సం॥లో రూ. 14.97 లక్షలనుఖర్చుపెట్టవలెనని తలపెట్టబడింది. 497 ఇండ్ల నిర్మాణం పూర్తి అయి, ఆఇండ్లు ఈ సంవత్సరమే పారిశ్రామిక కార్మికులకు కేటాయింప బడడానికి సిద్ధంకాగలవని ఆశింప బడుతున్నది. పారిశ్రామిక కార్మికులనుంచి ఒక గది ఇంటికైతే రూ. 8.50, రెండుగదుల ఇంటికైతే రూ. 13లు అద్దెగా వసూలు చేయబడుతుంది.

## తక్కువ ఆదాయపు వర్గాలవారికి గృహవసతి

ప్రభుత్వరంగం : దేశంలో నివాసగృహములకొరత తను తీర్చడానికై భారత ప్రభుత్వం తక్కువ ఆదాయపు వర్గములవారికి గృహనిర్మాణ పథకాన్ని ప్రారంభించింది. ఈ పథకము ననుసరించి ఏడాదికి రూ. 6000 లకు మించని ఆదాయంగల వ్యక్తులకు సమంజసమైన వడ్డీలపై దీర్ఘకాలిక ఋణాలివ్వబడుతాయి. ఇట్టి ఋణాలు వ్యక్తులకు, ఈ షరతును పూర్తిచేసేటువంటి సహ

కార సంఘాల సభ్యులకూ ఇవ్వబడుతాయి. ఈ పథకాన్ని అమలు జరపడానికై స్థలానికి, ఇంటి నిర్మాణానికి అయ్యే ఖర్చు అంచెనాకు గాను 80 శతి(ఒక్కొక్క ఇంటికి గరిష్ఠం రూ. 8,000 ల వరకు) వరకు భారత ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వానికి దీర్ఘకాలిక ఋణం క్రింద ఇస్తుంది. ఆ ఋణాన్ని నూటికి ఏడాదికి 4 1/2 రూ.ల వడ్డీతో 30 సాలుసరి వాయిదాలలో చెల్లించాలి. మిగిలిన 20 శతి వ్యయాన్ని మొదట రాష్ట్ర ప్రభుత్వమే భరించి, ఆతరువాత అద్దె-కొనుగోలు పద్ధతిపై ఇంటిని తీసుకొన్న వారివద్దనుంచి రాబట్టుకోవాలి. ఈపథకము ననుసరించి నాలుగురకాల ఇళ్ళునిర్మింప బడుతాయి. ఒక గది యిల్లు మొదలుకొని నాలుగు గదుల ఇండ్ల వరకూ వుంటాయి. ఈ ఇళ్ళు ప్రజలకు అద్దె-కొనుగోలు పద్ధతిపై కేటాయింప బడుతాయి. ఒక్కొక్క రకం ఇంటికయ్యే ఖర్చు ఈ దిగువ సూచింపబడింది.

| | |
|---|---|
| ఒక గది ఇల్లు | రూ. 3,500 |
| రెండు గదుల ఇల్లు | రూ. 4,600 |
| మూడుగదుల ఇల్లు | రూ. 7,000 |
| నాలుగు గదుల ఇల్లు | రూ. 10,000 |

హైదరాబాదు నగరంలో ఈ పథకం క్రింద ఇండ్ల నిర్మాణం సిటీ ఇంప్రూవ్‌మెంటు బోర్డుచే జరుపబడుతుంది. సికిందరాబాదులో టౌన్ ఇంప్రూవ్‌మెంటు ట్రస్టు చేజరుపబడుతుంది. జిల్లాలలోని పట్టణాలలో ఇండ్లనిర్మాణం హైదరాబాదు, వరంగలు స్థానిక పరిపాలనకు చెందిన డివిజనల్ ఇంజనీర్ల అజమాయిషీ క్రింద జరుగుతుంది. ఈ పథకం కొరకై 1957-58 సంవత్సరానికి రూ. 18.74 లక్షలు కేటాయింపబడ్డవి. ఇందులో నుంచి 1956-57 సంవత్సరపు తాలూకు మిగిలిపోయిన పనులకు రూ. 10.40 లక్షలు వినియోగింప బడుతాయి.

## పురపాలక రంగం

స్థానిక సంస్థలలో పనిచేసే తక్కువ జీతాలవారికి 202 ఇళ్ళను నిర్మించడానికి 1997-58 సంవత్సరానికిరూ. 7.26 లక్షలు కేటాయింప బడ్డవి. దీని వివరాలివి :-

1. హైదరాబాదు కార్పొరేషన్ (60) 2. సికిందరాబాదు కార్పొరేషన్ (80); 8 జహీరాబాదు పురపాలక సంఘం (8); 4. వికారాబాదు (8); 5. సంగారెడ్డి (5); 6. మహబూబునగర్ (10); 7. జోగిపేట(10 8. సూర్యాపేట (5) 9. వరంగలు (10);10. మహబూబాబాదు (5); 11. జనగామ (8); 12. ఖమ్మం (10); 18. కరీంనగర్ (5): 14. పెద్దపల్లి (5): 15. నిజామాబాదు (10); 16. కామారెడ్డి (4); 17. ఆదిలాబాదు(5) 18. మంచర్యాల (4); 19. గద్వాల (మిగిలిన పనులు)

## సహకార రంగం

ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం ఏర్పడి, ఈ రాష్ట్రరాజధాని హైదరాబాదు నగరం కావడంతో హైదరాబాదు సికిందరాబాదు జంట నగరాలలోను, తెలంగాణా జిల్లా ప్రధాన కేంద్రాలలోను ఇళ్ళకొరతను తీర్చడానికై కొత్త నివాస గృహములను కట్టవలసిన అవశ్యకత ఏర్పడింది. తెలంగాణాలో 30.6.1956 తేదీన 76 సహకార నిర్మాణ సంఘాలున్నవి. ఇవి ప్రభుత్వ ఆర్థిక సహాయంతో నివాస గృహముల నిర్మాణానికి దీర్ఘకాలిక ఋణాలు ఇస్తూ వుంటాయి. ఈ సంఘాలద్వారా 1957-58 సంవత్సరంలో రూ. 15.00 లక్షల అప్పులను లభింప జేయవలెనని తలపెట్ట బడింది. ఈడబ్బుతో హైదరాబాదు సికింద్రాబాదు నగరాలలోను,తెలంగాణా ప్రాంతాల లోని ఇతర పట్టణాలలోను దాదాపు 300 ఇండ్లు నిర్మింపబడుతాయి.

## గ్రామీణ గృహవసతి

తెలంగాణా ప్రాంతంలో గ్రామాలలో గృహవసతిని అభివృద్ధి పరచే ఉద్దేశంతో గ్రామీణగృహ నిర్మాణ సహకార సంఘాల సభ్యులకు నివాస గృహముల నిర్మాణం నిమిత్తమై దీర్ఘకాలిక ఋణా లివ్వబడుతాయి. 1957-58 సంవత్సరంలో రూ. 3 లక్షలమేరకు దీర్ఘకాలిక ఋణాలిచ్చి, 75 ఇండ్లను నిర్మింప జేయవలెనని తలపెట్టబడింది.

## మురికిపేటల నిర్మూలన

తెలంగాణా ప్రాంతంలో మురికి పేటల నిర్మూలనకూ, ఊడ్పుపని వారల గృహనిర్మాణ పథకాలకూ 1957-58 సంవత్సరంలో రూ. 10.40 లక్షలు కేటాయింపబడ్డవి. ఈ మొత్తం యావత్తు హైదరాబాదు నగరంలోని యాకూత్‌పూరా మురికిపేట నిర్మూలనా పథకానికి వినియోగించ బడుతుంది.

# మెట్ట ధాన్యములు

శ్రీ బి. యల్. నరసింహమూర్తి. బి. యస్. సి. (అగ్రి)

( అసిస్టెంట్ మిల్లెట్ స్పెషలిస్టు, స్త్రీగాస్కీము, నంద్యాల. )

మెట్టధాన్యములు సాధారణముగా ఉష్ణమండలములలో పండించబడుతాయి. మరీమెట్ట భూములలోను, వరి, గోధుమ పంటలకు ఉపయోగపడనట్టి భూములలోను ఇవి సాగుచేయబడుతాయి. మన దేశములో మెట్టధాన్యములు దక్షిణ పీఠభూమి, పశ్చిమ భారతములో విశేషముగా పండించబడుతాయి. మెట్టధాన్యములు జొన్నలు, సజ్జలు, రాగులు, కొర్రలు, అరికెలు, సాములు, వరిగెలు, ఊదలు అని యెనిమిది రకాలుగా వర్గీకరించ బడినవి.

భారత దేశములో 880 లక్షల ఎకరాలలో మెట్ట ధాన్యములు పండించ బడుతున్నవి. సాలీనా సుమారు 140 లక్షల టన్నుల ధాన్యం ఉత్పత్తి చేయబడుతున్నది. మెట్ట ధాన్యములు గ్రామీణ ప్రజలకు ముఖ్యఆహారము. భారత దేశములో వరిపంట తరువాత యీ మెట్ట ధాన్యములనే పేర్కొనవలెను. ఆ తరువాతనే గోధుమలు వస్తాయి. దేశములో వీటి వ్యాపారం అంతగా జరుగదు. ఎందుకంటే ఉత్పత్తి అయ్యే ధాన్యమంతా భుక్తికే సరిపోతుంది.

ఆంధ్రప్రదేశ్ లో 120 లక్షల యెకరాలలో మెట్ట ధాన్యములు పండించబడుతాయి. వాటి ఉత్పత్తి 20 లక్షల టన్నులుంటుంది. ఇవి ప్రజలకు ఆహారంగాను, పశువులకు మేత (-దాణా-) గాను ఉపకరిస్తున్నవి. వరి అన్నం కంటె వీటిలో పుష్టి యెక్కువ. దాదాపు మన అన్ని జిల్లాలలోను ఇవి పండించ బడుతున్నవి. సాధారణంగా ఈ పంటలు వర్షాధారంపైననే పండించ బడుతాయి. అయితే ఎరువు పెట్టి నీరుతోడినట్లయితే కూడా పంటలు బాగా పండుతాయి. ఇవి ఆహార విలువలో వరి, గోధుమల కన్నా విశేషమైనవి. వీటిలో ప్రోటీనులు క్రొవ్వు యెక్కువ నిష్పత్తిలో ఉంటాయి. ఈ ధాన్యములో అనేక రకాలున్నవి. ఆ యా ప్రాంతాలకు అనువైన రకాలు మాత్రమే పండించబడుతాయి.

1. జొన్న : ఇది ఉష్ణప్రాంతాలలో పండే పంట. సగటు ఉష్ణోగ్రత 80 ఫా డిగ్రీలుండేప్రాంతాలలో ఫలితమిస్తుంది. అయితే ఉష్ణోగ్రత 60 ఫా డిగ్రీలకు తక్కువగా ఉండే శీతప్రాంతాలు, సముద్ర మట్టానికి 5000 అడుగులు, అంతకన్నా యెక్కువగా ఉండు ప్రాంతాలు జొన్న పంటకు యోగ్యమైనవి కావు. ఈ పంటకు తేమ తక్కువగా ఉండాలి. వర్షపాతం 20-30 అంగుళాల మధ్య వుండే ప్రాంతాలలోనే జొన్న బాగా పండుతుంది. అయితే సముద్ర తీర ప్రాంతాలలో వలె 30-40 అంగుళాల వర్షం పడే ప్రాంతాలలో కూడా యీపంట బాగానే పండుతుంది.

మెట్ట ధాన్యములలో జొన్న పంట అతి ముఖ్యమైనది. భారతదేశంలో 430 లక్షల యెకరాలలో ఇది సాగు చేయబడుతున్నది. దీని సాలీనా ఉత్పత్తి 69 లక్షల టన్నులు. బొంబాయి, ఆంధ్రప్రదేశ్, మద్రాసు రాష్ట్రాలలో ఈ పంట కేవలం వర్షాధారంపైననే పండించ బడుతుంది. జొన్న పంటలో ఆంధ్రప్రదేశ్ ద్వితీయ స్థాన మాక్రమించి యున్నది. ఇక్కడ ఈ పంటక్రింద 60 లక్షల యెకరాలు సాగు అవుతాయి.

జొన్న పంటను అనేక రకాల భూసార ప్రాంతములో పండించవచ్చును. అయితే ఇసుక భూములలో యెక్కువగా ఎరువు వేయడం అవసరమవుతుంది. పొలాల్లో నీరు నిలవ వుంటే యీ పంట చెడిపోతుంది. పంట యెదిగే నాటికి వర్షపాతం 10 నుంచి 15 అంగుళాలకు మించని కాలాన్ని చూచి విత్తనాలు వేస్తారు. కర్నూలు జిల్లాలోని

నంద్యాలలోను, గుంటూరు జిల్లాలోని లాం లోను గల వ్యవసాయ పరిశోధనా కేంద్రములలో జొన్న పంటగూర్చి పరిశోధనలు జరుగుతున్నవి.

2. సజ్జలు:- సజ్జలు ఆసియాఖండములోనే గాక ఆఫ్రికా ఖండములో కూడా విశేషంగా పండించబడుతున్నవి. మన దేశములో జొన్నల తరువాత ముఖ్యమైనవి సజ్జలు. అస్సాం, ఉత్తర ప్రదేశాలలో తప్ప ఇతర అన్ని రాష్ట్రాలలోను ఇవి పండించబడుతున్నది. బొంబాయి రాష్ట్రములో జొన్నలు, సజ్జలు సరిసమానంగా పండించబడుతున్నవి. ఆంధ్ర ప్రదేశ్‌లో 17 లక్షల యెకరాలలో సాలీనా 4 లక్షల టన్నుల సజ్జలు పండించబడుతున్నవి.

సాలీనా 17 నుండి 30 అంగుళాల వర్షపాతం గల ప్రాంతాలలోను, జొన్న పంటపండని చోట్లలోను సజ్జ పంటను పండించవచ్చును. నల్లరేగడి భూమి మొదలు ఇసుక భూములవరకు గల అన్ని భూసారములలోను యీ పైరును వేయవచ్చును. ఈ పైరు వర్షాధారం పైననే పెరుగుతుంది. అయితే కొంతవరకు వేసవి పంటగా నీటి వనరుల క్రింద కూడా పెంచవచ్చును. జొన్నపంటను ఒక నిర్ణీత కాలంలోనే వేయాలి. కాని నీరు లభించేట్లయితే సజ్జ పంటను సంవత్సరంలో ఎప్పుడైనా వేయవచ్చును. అనకాపల్లి పరిశోధనా కేంద్రంలో మేలు రకం సజ్జ విత్తనాలు ఉత్పత్తి చేయబడినవి. విజయనగరం, లాం లలోని వ్యవసాయ కేంద్రములలో పరిశోధన కొనసాగుతున్నది.

3. రాగులు:- ప్రపంచంలో ఉష్ణమండలాలలో రాగులు విశేషంగా పండించబడుతున్నవి. భారత దేశములో 56 లక్షల యెకరాలలో రాగి పంట సాగుచేయబడుతున్నది. ఇందులో 8 లక్షల యెకరాలు ఆంధ్రప్రదేశ్‌లోనే సాగు అవుతాయి.

రాగి పంటను రాష్ట్రంలో ఏలాంటి భూములలో అయినప్పటికీ అన్ని ఋతువులలోను పండించవచ్చును. భూములలో క్షారము కొద్దిపాటిగా ఉన్నా కూడా రాగిపంట పెరుగుతుంది. ఇతర మెట్ట పంటలకంటె దీనికి వర్షపాతం యెక్కువగా ఉండాలి. నీటి వనరుల క్రింద పంటను వేసినట్లయితే నీరు తరుచుగా పెట్టడం అవసరమవుతుంది. అనకాపల్లిలోని చెరకు పరిశోధనా కేంద్రంలో మేలిరకం రాగి విత్తనాలు ఉత్పత్తిచేయబడినవి. విజయనగరంలోని ప్రాంతీయ కేంద్రంలో కూడా పరిశోధన కొనసాగుతున్నది.

4. కొర్రలు:-వర్షపాతం తక్కువగా ఉండు ప్రాంతాలలో యీ పంట పండించబడుతుంది. చైనా, జపాను, తూర్పుఆసియా, దక్షిణ ఆఫ్రికా, ఆగ్నేయ యూరపు ఖండము, ఉత్తర అమెరికాలలో ఇది సాగు అవుతున్నది. మన దేశములో బొంబాయి రాష్ట్రములో విరివిగా పండుతుంది.

కొర్రలను ఏలాంటి భూములలో అయినా ఏ ఋతువులో నైనా పండించవచ్చును. అయితే నల్ల లేక ఎర్ర రేగడి భూములలోను వర్షపాతం సాలీనా 15 నుంచి 30 అంగుళముల వరకు వుండే ప్రాంతాలలోను ఇది పండుతుంది. నంద్యాల, లాం లలోని వ్యవసాయ పరిశోధనా కేంద్రములలో మేలు రకం కొర్ర విత్తనాలు ఉత్పత్తి చేయబడినవి.

5. అరికెలు:— అరికెలు చాలా ముతక ధాన్యము. ఇది అంత ముఖ్యమైన పంట కాదు. మనరాష్ట్రంలో 3 లక్షల ఎకరాలలో యీ పంట పండించబడుతున్నది.

రాళ్ళు రప్పలుండే భూములు, కంకర లేని భూములలోను ఇతర సారహీనములైన భూములలోను యీపంట పండుతుంది. కాలమాన పరిస్థితులు సరిగా లేకపోయినప్పటికీ, ఇది కొంతవరకు ఫలసాయమిస్తుంది. పంట కాపుకొచ్చి కోతకురావాలంటే ఆరు నెలలు పడుతుంది. ఇతర మెట్టధాన్యాలకంటె అరికెలు చాలా దీర్ఘకాలికమైన పంట.

6. వరిగెలు :— వరిగె పంట గుంటూరు, నెల్లూరు కృష్ణా జిల్లాల్లో విశేషంగా పండించబడుతుంది. వర్షాలు సరిగా కురవకపోయి, నీటి ఎద్దడి వున్నా

యీ పైరు నిలువ గలుగుతుంది. ఇదిచాలా త్వరగా ఎదిగే పైరు. ఈ పైరును వర్షాధారం పైన కానీ, లేక నీటి వనరుల క్రింద కానీ పండించవచ్చును. సారహీనపు భూములలో కూడా ఇది ఎదుగు తుంది. పరిగె చొప్ప పశువులకు మంచి మేతగా ఉపయోగపడుతుంది.

7. **సాములు**:- భారత దేశంలో వివిధ రాష్ట్రాలలో చాలాకొద్ది పరిమితులలో యీ పంట పండించ బడుతున్నది. అనంతపురం, చిత్తూరు, విశాఖపట్నం జిల్లాల్లో సాములు విరివిగా పండించ బడుతున్నవి, సముద్ర మట్టానికి 7000 అడుగుల ఎత్తులోకూడా యీ పంట పెరుగుతుంది.

8. **ఊదలు** :- ఇది అంతముఖ్యమైన పంట కాదు. దేశం మొత్తంలో బహు కొద్దిచోట్లలో చాలా పరిమితంగా యీపంట పండించబడుతున్నది. దీనివల్ల లాభం ఏమంటే ఇది కరువు పంటగా ఉపకరిస్తుంది. పనికిరాని భూములలో కూడా యీపంట పెరుగుతుంది.

# కృష్ణా బ్యారేజీ

శ్రీ జి. ఎ. నరసింహారావు
(నాగార్జున సాగర్ కాలువల చీఫ్ ఇంజనీరు)

కృష్ణ ఆనకట్ట నిర్మాణం జరిగిన తరువాత సరిగ్గా నూరు సంవత్సరాలకు కృష్ణా బ్యారేజీగాథ మొదలవుతున్నది. 1952 సెప్టెంబరులో కృష్ణ ఆనకట్ట వరదలవల్ల పూర్తిగా దెబ్బతిని ఆనకట్ట పెద్దగోడకు గండి పడింది

## ఆనకట్ట

కృష్ణ ఆనకట్ట 1853-55 లో నిర్మింప బడింది. ఈ ఆనకట్ట క్రిందినీల ఆయకట్టు నానాటికీ పెరుగుతూ వచ్చింది. ఇంత పెద్ద ఆయకట్టుకు సాగునీరు సరఫరా చేయడం ఆనకట్ట తాహతుకు మించినపని అయిపోయింది. మొదట ఈ ఆనకట్ట 5.8 లక్షల ఎకరాలకు మాత్రమే నీటి సరఫరా చేయడానికి ఉద్దేశింప బడింది. ఆ లక్ష్యం అనుకున్న దానికంటె ముందే అనగా 1894 వరకల్లానే పూర్తి అయింది. ఆ తరువాత ఆనకట్టపై తలుపులు అమర్చ బడ్డవి. 1898 లో 3 అడుగుల ఎత్తుగల తలుపులు పెట్టబడ్డవి. ఆ తరువాత 1925 లో 6 అడుగుల తలుపులు అమర్చబడ్డవి. ఇప్పుడున్నవి 6 అడుగుల తలుపులు. వీటిని అవసరమైనప్పుడు దించివేసుకున్నారు. ఈతలుపులతో 8 లక్షల ఎకరాలకు సాగు నీటి సరఫరా తలపెట్ట బడింది. ఈ 6 అడుగుల తలుపులకు బదులుగా 8 అడుగుల తలుపులను అమర్చవలసిన ఆవశ్యకత ఎప్పుడో ఏర్పడింది. కాని 6 అడుగుల తలుపులకే ఆనకట్ట సురక్షితంగా వుండదని తేలింది. ఎందుచేతనంటే 6 అడుగుల తలుపులవల్ల పడే ఒత్తిడిని తట్టుకోనేటంత దృఢంగా మొదట్లో ఆనకట్ట నిర్మింపబడలేదు. 6 అడుగుల తలుపులకు బదులుగా 8 అడుగులు పెట్టవలసిన ఆవశ్యకత ఇంకా పరిశీలనలో వుండగానే ఆకస్మికంగా పెద్దవరదవచ్చి ఆనకట్ట దెబ్బతిని, కట్ట గోడకు గండిపడింది. అంతేగాక ఆనకట్ట ముందుభాగపు చప్టాలకు పెద్ద పెద్ద గోతులు పడ్డవి. ఆనకట్టకు 1952 సెప్టెంబరు 4 వ తేదీన గండిపడింది. ఆ గండిగుండా మహా ప్రవాహంగా నీరు ప్రవహిస్తూ క్షణక్షణానికీ గండిని ఇంకా పెద్దదిగా చేసింది, అప్పుడు దాదాపు 11 లక్షల ఎకరాలలో వరిపైరు వుంది. ఆపైరు వేయబడి మూడునెలలైంది. ఇంకా ఏడాడు నెలల పాటు నీరు సరఫరా చెయ్యాలి. నదిలో అక్టోబరు నవంబరు నెలల్లో కూడా వరదలొస్తాయి. ఆ వరదలవల్ల ఆనకట్టగోడ చాలాభాగంవరకు కొట్టుకు పోవచ్చు. అందువల్ల జూన్ నెలలో వరదలొచ్చేముందుగా తక్కువ నీరు ప్రవహించే మూడు నెల్లకాలంలోపలే ఆనకట్టను మరమ్మతుచేయడం అసాధ్యమవుతుంది. అందుచేత సాధ్యమైతే రెండు మూడు వారాలలోపలే వెంటనే గండిని పూడ్చి వెయ్యాలి. లేకపోతే నీటి సప్లయిలేక 7 లక్షల ఎకరాల పైరు దెబ్బతింటుంది. అంటే రూ. 14 కోట్లు చేసే అయిదున్నర లక్షల టన్నుల బియ్యం నష్టపడేవాళ్ళమన్నమాట.

## అపూర్వ పద్ధతి

ఆ గండిని పూడ్చే ప్రయత్నంలో అప్పటి సూపరింటెండింగ్ ఇంజనీరు (శ్రీ) వేపా కృష్ణమూర్తి, ఆయన ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, అసిస్టెంట్ ఇంజనీరు, సూపర్వైజర్, మేస్త్రీలు, లస్కర్లు ప్రాణాలు కోల్పొయ్యారు. అసలే ప్రపంచంలో వరిధాన్యంకొరత బాగా వున్నరోజులవి. అప్పుడు బియ్యం దిగుమతికి విదేశీ మారక ద్రవ్యం పుష్కలంగా వుపయోగించుకున్నారు. 7 లక్షల ఎకరాల వరిపంట నష్టమైతే పంకావాలి అని సర్వత్రా ఆందోళన కలిగింది. అందువల్ల గండిని పూడ్చే విషయంలో నిపుణులైన ఇంజనీర్లను సంప్రదించడం, వారి సూచనలను ప్రయోగించి చూడడం జరిగింది. మట్టితో వుంగరపు కట్ట నిర్మాణం, రాళ్ళతో వుంగరపు కట్ట నిర్మాణం, పీపాలలో రాళ్ళు నింపి వాటిని నీళ్ళలోదింపడం వంటి పద్ధతులన్నీ ప్రయత్నించి చూడడం జరిగింది. కాని ప్రయోజనం లేకపోయింది. నదికి ఎగువన వంద గజాల దూరంలో వేసిన బండలు కూడా అడుగుకుపోక, గండి ద్వారా దిగువకు కొట్టుకు పోతున్నవి. రాళ్ళతోనింపిన పెద్ద పెద్ద పీపాలుకూడా నీళ్ళలో మునగక కాగితాల మాదిరిగా అవతలికి కొట్టుకు పోతున్నాయి. ఆనకట్టకు ఎగువన నీటిలోతు 30 అడుగులు వుంది. గండి వెడల్పు 180 అడుగులు. కనుక రాళ్ళతో గాని మట్టితో గాని ఉంగరపుకట్ట వెయ్యాలంటే కొన్ని నెలలు పట్టివుం

డేది. ఆలోగా డెల్టాలోని సైరంతా నీరులేక ఎండి పోయివుండేది. అందుచేత ఆ ప్రమాదాన్ని నివారించేందుకు ఒక అపూర్వ పద్ధతి అవలంబించబడింది. నేను ఇంజనీరింగు విద్యార్థిగా వుండగా విశాఖ నౌకా కేంద్రంలో ప్రముఖ ఇంజనీరు సర్ యం విశ్వేశ్వరయ్య సలహాపై పాతనౌక నొక దానిని ముంచడం ద్వారా త్వరగా తక్కువ ఖర్చుతో గోడను కట్టడం చూచి ఆశ్చర్యపోయాను. ఆపద్ధతి ప్రకారమే ఇక్కడ ఒక కొత్తపద్ధతి రూపొందించాను. ముప్పై టన్నుల బరువుగల ఇనుప పడవలను ఉపయోగించినట్లయితే అవి గండిగుండా అవతలికి కొట్టుకుపోవు. అయితే వాటిని గండిదగ్గర ఎలా ముంచడమనేది ఒక సమస్య అయింది. రాళ్ళతో నింపిన పాత బల్లకట్టులను రాళ్ళతో నింపి గండికి ఎగువ నదిలో అరఫర్లాంగు దూరాన, బలంగా స్టీమరును నిలబెట్టి అందులోనుంచి బల్లకట్టులను నదిలోకి వదిలి పెట్టాము. ఆ బల్లకట్లు గండి దగ్గరగా ఒడ్డుకి వెళ్ళగానే ప్రాణాలకు తెగించిన పనివాళ్ళు బల్లకట్టులకు చిల్లులు పెట్టి అమాంతం ఏటిలోకి దూకాలి. ఆ దూకినవాళ్ళను అతి వేగంగా నడిచే లాంచీ బైటికి తీసుకురావాలి. చిల్లులు పడడంతో బల్లకట్టు నీటిలో మునిగి పోతుంది. ఇనుప మోకులతో స్టీమరుకు కట్టివేయబడిన బల్లకట్టును సమయంచూచి త్రాళ్ళను తెంపడం ద్వారా వేరుచేయడం జరుగుతుంది అప్పుడది దిగువకు పోయి సరిగ్గా గండి దగ్గర నదీగర్భం చేరుకుంటుంది. అయితే మొదటి బల్లకట్టును స్టీమరునుంచి తొందరగా విడదీయడం జరిగినందువల్ల అది గండివద్ద క్రిందికి మునిగి పోకుండానే కొట్టుకు పోయింది రెండవదానిని ఆలస్యంగా స్టీమరు నుంచివేరు చేయడంవల్ల గండికి చాలా ఎగువననే నదిలో మునిగి పోయింది ఇటా కొన్నిసార్లు ప్రయత్నించగా తొందరలేకుండా సరైన పద్ధతి ప్రకారం రాళ్ళతో నిండిన బల్లకట్లను సరిగా గండివద్ద నదిలో ముంచగలిగాము. మొత్తం 42 బల్లకట్లను ముంచివేశాము ఆ బల్లకట్లకు మధ్య రాళ్ళు నింపాము. ఈ విధంగా 12 రోజులలో అంటే 1 ఎప్రిల్ 24 వ తేదీకి గండిని పూడ్చివే



కృష్ణా బ్యారేజి ప్రారంభోత్సవానికి వచ్చిన ప్రేక్షకులు



బ్యారేజీ దృశ్యం

శాము. ఈ విధంగా 7 లక్షల ఎకరాల వరిపైరును కాపాడడానికి నీరుసప్లయి చేశాము.

తిరిగి 1953 వేసవిలో లోగడవుంచిన బల్లకట్టుల నన్నిటినీ తీసివేసి ఆనకట్ట పెద్దగోడకు పడిన గండికి మరమ్మతుచేయవలసిన సమస్యను ఎదుర్కొన్నాము. మళ్ళ వరదలు రావడానికి మూడు లేక నాలుగు నెలల వ్యవధి మాత్రమేవుంది. మట్టితో కాఫర్‌డాము నిర్మించి నీరులేకుండా చేయడానికి ప్రయత్నించగా ఆనకట్ట పునాదుల క్రిందనుంచి ఇసుక వేగంగా అవతలికిపోయి గండికి ప్రక్కన ఆనకట్ట పెద్దగోడ పడిపోవడం జరిగింది. నీళ్ళల్లోనే ఆ బల్లకట్టులను యంత్రాల సహాయంతో పగులగొట్టి ముక్క చెక్కలుగా బైటికి తీయడమే మిగిలిన మార్గం. అటువంటి యంత్రం దేశంలోకల్లా కొచ్చిన్ రేవులో మాత్రమే వున్నది. దాన్ని తెప్పించి, నీళ్ళలోనే బల్లకట్టులను పగులగొట్టే పనిని ఇక్కడి పనివాళ్ళకు నేర్పించాము. ఆ విధంగా బల్లకట్టుల నన్నిటినీ పగులగొట్టించి ఒకదాని తరువాత మరొకదానిని బైటికి తీయించాము. ఆ తరువాత ఆనకట్ట పెద్దగోడను పునర్నిర్మించాము.

ఇక ఆనకట్ట ముందుభాగాలకు పడినగోతులను పూడ్పించవలసివచ్చింది. ఆ పనికి 26 టెండర్లు వచ్చాయి. అయితే ఆ టెండర్లన్నీ అంచెనాలకంటె హెచ్చు మొత్తాలను పేర్కొన్నందువల్ల వాటిని తోసేసి, పబ్లికువర్క్సు శాఖ స్వయంగా గోతులను పూడ్చేపనిని జరిపించింది. ఆ పనికి మొత్తం రూ 40 లక్షలు ఖర్చు కావలసి వుండగా పబ్లికు వర్క్సుశాఖ స్వయంగా జరిపించినందువల్ల రూ 5 లక్షల ఖర్చు కలిసివచ్చింది. కార్మికులకు సక్రమంగా ప్రతివారం కూలీ చెల్లించినందువల్లను, వాళ్ళతో సరిగా వ్యవహరించినందువల్లనే ఇది సాధ్యమైంది.

## బ్యారేజీ ఎందుకు?

పోతే ఆనకట్టను పూర్తిగా మరమ్మతు చేశారుకదా, ఇక బ్యారేజి ఎందుకు? అని ఎవరైనా ప్రశ్నించవచ్చు.

ఆరడుగుల తలుపులవత్తిడికి తట్టుకునేటట్లు కృష్ణాఆనకట్ట మొదట్లో నిర్మింపబడలేదు. ఆరడుగుల తలుపులను అమర్చిన తరువాత ఆనకట్ట అడుగున నదిగర్భంలో కొన్నిచోట్ల 40 అడుగులలోతు గోతులుపడ్డవి. ఇటువంటి పరిణామాన్ని నివారించడమే బ్యారేజి ముఖ్యోద్దేశం. రెండవ కారణ మేమిటంటే కృష్ణాడెల్టాలో ఆనకట్టక్రింది ఆయకట్టు విప రీతంగా పెరిగిపోవడంవల్ల దాని కంతటికి నీరు సరఫరా చేయాలంటే ఆనకట్టమీద 8 అడుగుల నీరు ప్రవహింప జేయవలసివస్తుంది. అంటే ఆరడుగుల తలుపుల మీదుగా రెండడుగుల నీటి ప్రవాహం పోతుంది. ఇట్లా తలుపుల మీదుగా రెండడుగుల ప్రవాహం ముందు చప్టాపై పడటం క్షేమంకాదు. పైగా నీరు వృథాగా పోతూ వుంటుంది. మూడవదేమిటంటే ఇప్పటి తలుపులు హైడ్రాలిక్ వత్తిడి ఏర్పాటుద్వారా పనిచేస్తున్నవి. ఇది అంత క్షేమకరమైన ఏర్పాటు కాదు. ఒక్కొక్కసారి పని చేయక పోవచ్చు. హైడ్రాలిక్ పద్ధతికి తలుపులు పని చేయకపోతే ఆనకట్టపైకి 'ఫ్లో' తేవలసివస్తుంది. అయితే ఆనకట్టపై నీటిఎత్తు 7 1/2 అడుగులమాత్రం వుంటేనే 'ఫ్లో' ఆనకట్టపై నిలువగలుగుతుంది. ఒకవేళ ఆకస్మికంగా వరదప్రవాహం వొచ్చి, తలుపులు హైడ్రాలిక్ పద్ధతి ప్రకారం పనిచేయకపోతే ఆనకట్టకు ముప్పువచ్చిందన్న మాటే. 11 లక్షల ఎకరాల నీటి వనరుకు ఇటువంటి ప్రమాదకరమైన పద్ధతి ప్రకారం వినియోగించుకోవడం మంచిదికాదు. ఇందువల్లనే బ్యారేజీ నిర్మాణం అత్యావ సరమైంది. బ్యారేజీ నిర్మింపబడితే పెద్ద వరదలప్పుడు కూడా వంతెనపైనుంచి తలుపులను ఎత్తడం, దించడం జరుపవచ్చు. నాలుగవ కారణమేమిటంటే, అనవసరంగా ఆందోళన బయలుదేరుతుందేమోనని, జనం కలతపడతా రేమోనని ఈ సంగతిని బైటికిరానివ్వలేదు. 1953 వేసవి లో ఆనకట్టకు పడిన గోతులనన్నింటినీ మరమ్మతు చేయించిన తరువాత ఒక చప్టాలో చిన్న బెజ్జం కన్పిం చింది. పైగా చప్టాలంతా బాగానే కనిపించింది. కాని ఆ బెజ్జాన్ని ఇంకా పెద్దదిచేసిచూడగా చప్టా అడుగున పెద్ద సొరంగం కన్పించింది. సకాలంలో ఆ సొరంగాన్ని మరమ్మతుచేశాము. కాని ఆనకట్ట చప్టా అడుగున ఇంకా ఇటువంటి సొరంగాలున్నయ్యేమోనన్న భయం కలిగింది. ఈ విషయాన్ని విశ్వవిద్యాలయాలకూ, పరిశోధనాసంస్థ లకూ, పూనాలోని కేంద్ర జల, విద్యుచ్ఛక్తి కమీషన్ తాలూకు పరిశోధన కేంద్రానికీ తెలిపాము. వారు పరి శోధనలు జరిపి, ఆనకట్టకు ఇంకా ఇటువంటి సొరంగా లున్నవనీ, కాని ఎక్కడ ఎంత సొరంగాలున్నదీ చెప్ప లేమనీ అన్నారు. అందుచేత ఈ మూడు సంవత్సరాల లోనూ చప్టాలకు పడే బెజ్జాలను కనుక్కోవడానికి తగు ఏర్పాట్లు చేశాము. చప్టాకు ఎక్కడైనా బీటలుపడితే వెంటనే మరమ్మతుచేసే ఏర్పాట్లు చేశాము. వరదను అవతలికి పంపించివేయడానికి ఎన్నో కట్టడులు, నిబంధ నలు చేశాము. ఇక ఇప్పుడు బ్యారేజీ నిర్మాణం పూర్తి అయింది కాబట్టి ఎట్టి భయానికీ తావులేదు.

## బ్యారేజీ ప్రయోజనాలు

బ్యారేజీవల్ల ప్రయోజనాలేమిటి ? ఈ బ్యారేజీవల్ల డెల్టాలోని 11 లక్షల ఎకరాలకు నీటి సప్లయి స్థిరంగా జరుగుతుంది. దెబ్బతిన్న ఆనకట్టవల్ల భయంలేదు. ఆన కట్ట తలుపులను ఉపయోగించే ఏర్పాటులో ఎత్తడం దించడం వుండదు. నాట్ల రోజులలో కాలువలలోకి కావ లసినన్ని నీళ్ళు పుష్కలంగా సప్లయి చేయగలము. దీని వల్ల ఇదివరకుకంటె రెండు వారాలుముందుగా నాట్లు పూర్తికావడం జరుగుతుంది. డెల్టాలోని పల్లపు ప్రాం తాలలోఇంతవరకూ నాట్లు ఆలస్యంగా వేయడం జరుగు తూవుంది. పైగా ఆ ప్రాంతాలు వర్షాకాలంలో నీట మునిగిపోతవి. ఈ బ్యారేజీవల్ల ఆ ప్రాంతాలకు చాలా మేలు కలుగుతుంది. కృష్ణాబ్యారేజీవల్ల ఒక లక్ష ఎక రాలు అదనంగా సాగులోకి వస్తవి. తగినంత నీరులేక పోవడంవల్ల ఒక లక్ష ఎకరాలను సాగుచేయడానికి ఉద్దే శించిన సహాయక పథకాలను అమలు జరుపడం సాధ్యంకాలేదు అయితే ఇంతవరకు అమలు జరిపిన పథకాలవల్ల దాదాపు 40 వేల ఎకరాలు సాగులోకి వచ్చాయి. ఇందుకోసమై డెల్టాలో తాత్కాలికంగా కొన్ని చర్యలు తీసుకోబడ్డవి. కాలువగట్లకు కొత్తపైపులు పెట్టడానికి అనుమతించాము. రైతులు కొత్త కాలువలు తవ్వుకున్నారు. ఆ తరువాత కృష్ణాబ్యారేజీక్రింద ఆయకట్టు స్థిరీకరణను సత్వరంగా జరిపించడానికి అవసరపు నిధులు కేటాయించబడ్డవి.

కృష్ణా బ్యారేజీవల్ల మరొక ప్రయోజనమేమిటంటే దీనివల్ల రోడ్డువంతెన ఏర్పడుతుంది. ఇది మద్రాసు-కల కత్తా జాతీయ రహదారిలోవున్నది. ఇంతవరకు ఆనకట్ట పై ఏడాదికి ఐదు నెలలు మాత్రమే రాకపోకలు జరుగు తున్నవి. రైలువంతెనక్రింద రహదార్లశాఖ అనుకున్న ట్లుగా విడిగా వంతెన కట్టడానికి రూ. 80 లక్షలు అయి వుండేది. బ్యారేజీతోపాటు ఇప్పుడు రోడ్డు వంతెనను నిర్మించడంవల్ల వంతెనకు అదనంగా రూ. 55 లక్షలు మాత్రమే అయింది. ఈ రు 55 లక్షలను జాతీయ రహ దార్ల నిధినుంచి భారతప్రభుత్వం భరిస్తూవుంది.

బ్యారేజీపొడవు 3736 అడుగులు. ఇది నదీగర్భంపై 20 అడుగుల మట్టందాకా నీటిని ఆపుతుంది. దీనికి 40 అడుగుల ఎడాన 70 తూములున్నవి. వీటిలో నదిలోని

వరదను క్రమబద్ధంచేసి వరదనీటిని కాలువల్లోకి మళ్ళించేందుకు 12 అడుగుల తలుపులున్నవి. ఇంతవరకు ఆనకట్టపై అరడుగుల నీటిని మాత్రమే పంపించవచ్చు. ఇక ముందు పది అడుగులనీళ్ళు పంపవచ్చు. బ్యారేజీపై రోడ్డు వెడల్పు 24 అడుగులు. బాటసారుల సౌకర్యం కొరకై రోడ్డుకు రెండు ప్రక్కలా అయిదడుగుల వెడల్పు గల కాలిబాట లున్నవి. ఈ బ్యారేజీ నిర్మాణానికి 10 వేల టన్నుల ఉక్కు, 50 వేల టన్నుల సిమెంటు పట్టినవి. దీనికి 70 లక్షల ఘనపు టడుగుల కాంక్రీటు, రాతిపని, 900 రీఇన్ ఫోర్స్డ్ కాంక్రీటు బావులు వేయబడ్డవి.

## కొన్ని ప్రత్యేక చిక్కులు

ఈ పని వరదలు లేని కాలంలో అంటే డిసెంబరు, మే మధ్య ఆరునెలలు మాత్రమే జరగవలసి వచ్చింది. ఈ ఆరు నెలల్లో ఆనకట్టకు ఎగువన నదీగర్భంలో 25 అడుగుల ఎత్తున కాఫర్ డామును నిర్మించి, కాఫర్ డాము లోపలి నీటిని తోడి వెయ్యాలి. పునాదులలో జరిగినపని అత్యంత ప్రమాదకరమైనది. ఒక యేడు నిర్మించిన కాఫర్ డాము మరుసటి సంవత్సరపు వరదలకు కొట్టుకు పోతుంది. తిరిగి పని ప్రారంభించేముందు మళ్ళీ కాఫర్ డాము నిర్మించాలి. పని జరిపించే రోజులలో కూడా ఆకస్మాత్తుగా వరదవొచ్చి పనికి అవరోధం కలిగే అవకాశం వుండనేవుంది. కాఫర్ డాముకు రెండు సంవత్సరాలు గండిపడింది. అయితే రెండు నిమిషాలలో అక్కడినుంచి పని మనుషులనూ సామానులనూ తరలించాము కనుక జననష్టం, యంత్ర సామగ్రి నష్టం ఏమీ జరగలేదు. ప్రమాదమేమీ కలుగకుండా వుండేందుకని ఉక్కు రేకుల కాఫర్ డామును నిర్మించుదామని మొదట అనుకున్నాం. కాని ఎంత ప్రయత్నించినా కాఫర్ డాములో కొంత భాగానికి సరిపడే ఉక్కు రేకులు మాత్రమే లభించాయి. క్రిందటి రెండు సంవత్సరాలు మట్టితో వేయబడిన కాఫర్ డాముతోనే పని జరిపించవలసి వచ్చింది. ఉక్కు రేకలు వచ్చేదాకా ఆగాలంటే పని ఏడాదో రెండేండ్లో వాయిదా పడుతుంది. కాని ఇలా చేయడం చాలా ప్రమాదకరం. ఎందుకంటే కాఫర్ డాముకు గండి పడిందంటే బావిలో పనిచేసే 6000 మంది మనుషులకు ప్రమాదం సంభవిస్తుంది. ఇరవై అడుగుల లోతు నీటిలో జారుడు భూమిపై నుంచి మట్టి వేసుకుంటూ ఈ కాఫర్ డామును కట్టుకు రావాలి. అంటే ఎప్పుడైనా జారవచ్చు. అకస్మాత్తుగా గండి పడ



పబ్లిక్ వర్క్సు శాఖ కార్ఖానాలో బ్యారేజీ తలుపుల నిర్మాణం

వచ్చు. కాని ప్రమాదమేమీ జరగకుండా కట్టుదిట్టాలన్నీ చేశాము. బల్ల కట్టులతో, రాళ్ళతో మట్టితో, ఇసుక సంచులతో స్టీమర్లు తయారుగా వుంచాము. జాగ్రత్త నిమిత్తమై ప్రతి క్షణం హెచ్చరికలు చేయడం, పని వాళ్ళను భద్రమైనచోట్లకు చేరవేయడం మొదలగు చర్య లన్నింటి ద్వారా ఉక్కు రేకులు లేకుండానే పని పూర్తి చేయించాము.

మరికొన్ని చిక్కులుకూడా ఏర్పడ్డాయి. ఇనుము, ఉక్కు చాలినంతగా సరఫరా కాలేదు. నదీ గర్భంలో చాలా లోతున కూడా పెద్దపెద్ద రాతిబండ లున్నవి. బహుశా వంద సంవత్సరాల క్రిందట ఆనకట్టను కట్టి నప్పుడు వాటిని వేసివుంటారు. ఆ బండల మూలకంగా బావుల త్రవ్వకం పని నెమ్మదిగా కష్టంగా జరిగింది. బ్యారేజీ నిర్మాణం ప్రారంభించి నప్పుడు నదిలో నీటి మట్టాన్ని ఆనకట్ట ఎత్తుకంటె తగ్గించి వేద్దామని అను కున్నాము. కాని ఆ తరువాత తుంగభద్ర రిజర్వాయర్ నీటితో కృష్ణా డెల్టాలో రెండవ పంటను పండించాలని ప్రభుత్వం నిర్ణయించింది. దీనివల్ల ఆనకట్టపైగా మూడు న్నర అడుగుల నీరు సప్లయి చేయించవలసి వచ్చి పని చాలా కష్టమయింది.

ఇంత పెద్ద నిర్మాణంలో చాలా ప్రమాదాలు జరగవచ్చు. కాని ప్రాణనష్టం జరుగకుండా ప్రత్యేకశ్రద్ధ వహించడంవల్ల ముగ్గురు మాత్రమే మరణించారు.

ఈ కృష్ణాబ్యారేజీతోపాటు కృష్ణ పడమటికాలువ వంతెన నిర్మాణంకూడా జరిగింది. ఆ వంతెనకు ఒక్కొక్కటి 120 అడుగుల చొప్పున రెండు తూములున్నవి. దీని నిర్మాణం అయిదునెలల్లో పూర్తిచేయవలసి వచ్చింది. ఎందుచేతనంటే రెండవ పంటకూ, పడవలరాకపోకలకూ నీళ్ళుకావాలి; కనుక నీటిమట్టం తగ్గించకుండానే వంతెన నిర్మాణం పూర్తిచేశాము. ఈ నిర్మాణంలో కొత్త పద్ధతులు అవలంబించ బడ్డవి. పునాది బావుల త్రవ్వకంతో పాటు సూపర్ స్ట్రక్చర్ బాక్స్ట్రింగ్ గర్డర్ల నిర్మాణం కూడా ప్రారంభింపబడింది.

## బ్యారేజీ తలుపులు

ఈనిర్మాణంలో బ్యారేజీతలుపులు ప్రధానాంశం. సీతానగరం వద్ద వున్న పబ్లికువర్క్సు శాఖ వర్కుషాపులో ఈ తలుపులు తయారు చేయబడుతున్నవి. తలుపుల మొత్తం బరువు రెండువేల టన్నులుంటుంది. వీటికి ఒక్కొక్క చదరపు అడుగుకు రూ. 150లు పడింది. ఇతరత్రా ఈ తలుపులను కొన్నట్లయితే ఇంత తక్కువ ఖర్చుకు వచ్చేవి కావు. ఆంధ్రప్రదేశ్ ప్రత్యేకచీఫ్ ఇంజనీరు శ్రీ వెంకట కృష్ణయ్యర్ సూచనల ననుసరించి కృష్ణా బ్యారేజీ సిబ్బంది ఈ తలుపులను తయారు చేస్తున్నారు.

ఇంతవరకు సగం తలుపులు తయారైనవి. ఇంకా 500 టన్నుల ఉక్కు సప్లయి కాగానే మిగతా తలుపులు కూడా వచ్చే జూన్ నాటికి అమర్చబడుతాయి.

ఈ నిర్మాణానికి మొత్తం రూ. 2 కోట్ల 84 లక్షలు ఖర్చు అవుతుందని అంచనా వేయబడింది. ఇంతవరకు రూ. 2 కోట్ల 30 లక్షలు ఖర్చు అయింది. అనుకున్నదాని కంటే రూ. 15 లక్షల తక్కువ ఖర్చుతో పని పూర్తవుతున్నది. 1953 సంవత్సరపు ధరలప్రకారం ఈ నిర్మాణానికి రూ. 2 కోట్ల 84 లక్షలు అవుతుందని అంచనావేశాము. ఆ తరువాత సిమెంటు ఉక్కుధరలు విపరీతంగా పెరిగాయి. అయినా 15 లక్షల తక్కువ ఖర్చుతో పని పూర్తయింది. ఇందుకు కారణం పబ్లికువర్క్సు శాఖాధికారులు, కంట్రాక్టర్లు సమర్థవంతంగా పని జరుపడం, కార్మికుల సహకారం, సిబ్బంది పనివారు రాత్రింబగళ్ళు దీక్షతో ఒక్కొక్కమారు రెండు షిప్టులు కూడా పని చేయడం. ఈ విధంగా ఈ ప్రాజెక్టు యొక్క ఎస్టాబ్లిష్మెంట్ ఖర్చులు అంచెనా ఖర్చుకు 2 1/2 శతి మాత్రమే పడ్డవి. పైగా బ్యారేజీ పని అనుకున్నదానికంటే ఆరు నెల్ల ముందుగానే పూర్తయింది.

భారతదేశంలోని ఇతరబ్యారేజీలతో పోల్చి చూచినట్లయితే కృష్ణాబ్యారేజీ చాలా తక్కువ ఖర్చుతోనూ చాలా త్వరగానూ, జరిగింది. తక్కువరాతిపని, తక్కువ [illegible]టు అవసరమయ్యే బ్యారేజీలకు కూడా ఖర్చు ఎక్కువైంది. కృష్ణకంటె తక్కువ ప్రవాహంగల బ్యారేజీలకు ఎక్కువ ఖర్చు అయింది. చిన్ననదులపై కట్టబడిన బ్యారేజీలకు ఎక్కువఖర్చుఅయింది. లోకసభలో 1-8-1957 తేదీన యూనియన్ ప్రభుత్వ నీటిపారుదల విద్యుచ్ఛక్తి శాఖా మంత్రి శ్రీ యస్. కె. పాటిల్ ప్రసంగంలో ఈ దిగువభాగాన్ని గమనించడం ఈ సందర్భంలో ఉచితం కాగలదు. ఆయన ఇలా అన్నారు.

"నేను ఇంజనీరునుకాను. కాని సంగతి సందర్భాలను అర్థంచేసుకొనే లోకజ్ఞానం నాకుంది. కృష్ణాబ్యారేజీ చాలా తక్కువ ఖర్చుతో నిర్మించబడింది. దేశంలోని మిగతా డాములన్నిటి కంటె ఈడాముపై మనంపెట్టిన పెట్టుబడికి ఎక్కువ ఆదాయం వస్తుందన్న సంగతిని మీరే తెలుసుకోగలుగుతారు."

## హైడ్రాలిక్ వివరాలు

ఉనికి :- ప్రస్తుత ఆనకట్ట తలుపులకు ఎగువన 104′ × 5″

రెగ్యులేటర్ :-

(అ) పొడవు : రెగ్యులేటర్

| | |
|---|---|
| స్కవరింగు స్లూయిసులు | 3400′ — 0″ |
| కుడిప్రక్క | 192′ — 0″ |
| ఎడమ ప్రక్క | 144′ — 0″ |
| మొత్తం | 3736′ — 0″ |

(ఆ) వెంట్స్ :

రెగ్యులేటర్ స్కవరింగు స్లూయిసులు : ఒక్కొక్కటి 40′ 0″ చొప్పున 70.

ఎడమప్రక్కన ఒక్కొక్కటి 17′ × 2″ చొప్పున 6.

కుడిప్రక్కన ఒక్కొక్కటి 17′ × 12″ చొప్పున 8

(ఇ) మట్టములు :

| | |
|---|---|
| రెగ్యులేటరు ఫ్లోర్ | + 40 05 |
| స్కవర్ వెంట్సు ఫ్లోర్ | + 36.30 |
| రెగ్యులేటర్ సిల్ | + 45 05 |
| రెగ్యులేటర్ గేట్ల పైభాగం | + 57.05 |
| నదీగర్భం సగటు మట్టం | + 37.00 |
| రెగ్యులేటర్ ఫ్లోర్ గర్భం | + 33.55 |
| స్కవరింగ్ స్లూయిసులగర్భం : | |
| కుడిప్రక్క | + 28.50 |
| ఎడమ ప్రక్క | + 31.80 |
| నూతుల అడుగు | + 16.00 |
| వంతెనపై రోడ్డు మార్గం పైభాగం : | + 82.10 |
| హాయిస్టు వంతెన పైభాగం | + 99.60 |

(ఈ) నూతులు : మూడువరుసలలోను

మొత్తం నూతులు 900

ఒక్కొక్కనూతికి 7′ 0″ × 12′ 6″ పరిమాణములు గల 2 ఛేంబర్లు (4′ × 4′ వున్నవి.

ఎగువ నూతిలోతు 16′ 0″

మధ్యన, దిగువన 20′ 0″

(ఉ) సూపర్ స్ట్రక్చర్ :

స్తంభములు 8′ 0″ మందం

స్కవర్ స్లూయిసులలో మధ్యమధ్య స్తంభములు 6′ 0″ మందం లోపల ఆర్. సి. స్టెయిర్ కేసుతో అబట్‌మెంట్ స్తంభాలు.

(ఊ) కృష్ణానది ఆరగాణి ప్రాంతం : 97,050 చ. మైళ్ళు.

(ఎ) గరిష్ఠ వరద :

7-10-1903 తేదీన కృష్ణఆనకట్టకు

ఎగువన యం. యఫ్. యల్. రికార్డు 70.55

దిగువన + 68.00

గరిష్ఠ వరద లెక్క ... 11.9 లక్షల క్యూ సెక్కులు.

(ఏ) మధ్యన బ్యారేజీ వుండుటవల్ల వచ్చే ప్రవాహం 2.16 అడుగులు

(1) ఆయకట్టు : ప్రస్తుతం 11 లక్షల ఎకరాలు
అదనంగా : 1 లక్ష ఎకరాలు

వంతెన : రోడ్డుమార్గం 24′ 0″ కెర్బుల మధ్య కాలిబాటలు 5′ 0″ రెండువైపులా

సామగ్రి : సిమెంటు 44,000 టన్నులు

ఉక్కు, రేకులుకూడా కలుపుకొని 3,000 టన్నులు

యంత్రం సామగ్రి నికరం రూ. 8 లక్షలు.

# భారతదేశ భూములలో నత్రజని కొరత

శ్రీ యం. యస్. శివరామన్. ఐ. సి. యస్.

( ప్లానింగు కమీషన్ సలహాదారు )

భారత దేశంలో వ్యవసాయోత్పత్తి తక్కువ స్థాయిలో వుండడానికి ఒక ముఖ్య కారణం ఉష్ణ మండల స్థితిలో ఇచటి భూములలో నత్రజని లోపించి వుండడమే. కనుక ఈ విషయాన్ని విస్మరించి అధికోత్పత్తికి ఎంత కృషి చేసినప్పటికీ అది ఫలించదు. ప్రస్తుత ఉత్పత్తి స్థాయిని బట్టి చూచినా భారతదేశం లోని ప్రధానమైన పైర్లు ఇచటి భూముల నుంచి 37.70 లక్షల టన్నుల నత్రజనిని పీల్చి వేస్తున్నవి. ఇది ఖర్చు. ఇక జమ సంగతి. పశువుల ఎరువు, చీకుడు ఎరువు, పచ్చి ఆకు ఎరువు, నూనె పిట్టు, నిరింద్రియపు రసాయనిక ఎరువుల వల్ల 8.5 లక్షల టన్నుల నత్రజని భూములకు లభిస్తున్నది. అంటే పైరులకు అవసరమైన దానిలో 22.5 శతి మాత్రమే లభిస్తున్నదన్న మాట. మిగిలింది పైరు పోగా మిగిలిన చెత్తా చెదారం వల్ల, ఇతర సహజ సిద్ధమైన ఆధారముల వల్ల లభిస్తున్నది.

కనుక పంటల దిగుబడిని హెచ్చించ వలెనంటే నత్రజని వాడకం స్థాయిని కూడా హెచ్చించాలి. ఆ హెచ్చించడం కూడా ఇతర సాగు ప్రాంతాలకు సైతం వర్తించే విధంగా జరుగాలి. అయితే ఆచరణ రీత్యా యీ విషయంలో కొన్ని చిక్కులున్నవి. భారతదేశ మంతటా పొలాలకు నత్రజని లభించే ఆధారం ఒక్కటే వున్నది. అది పెరటి ఎరువు. కాని ఈ ఎరువు బహు పరిమితంగా సరఫరా అవుతుంది. కారణ మేమంటే పశువుల పేడను మన దేశస్థులు పిడకలుగా చేసి పొయ్యి క్రిందికి ఉపయోగిస్తారు. 1955-56 సంవత్సరంలో పట్టణ చీకుడు ఎరువు మొత్తం ఉత్పత్తి 17.90 లక్షల టన్నులు. ఇది మూడు లక్షల ఎకరాలకు వేయడానికి మాత్రమే సరిపోతుంది. ఈ ఉత్పత్తిని ఇంతకంటె హెచ్చించడం కష్ట సాధ్యం. భారత దేశంలో పండే వ్యవసాయ పంటలు మనుషులకు ఆహారాన్ని, వస్త్రమును, పశువులకు గ్రాసమునూ లభింప జేస్తున్నవి. కాబట్టి భూములకు నత్రజనిని సరఫరా చేయడానికై ఏవేని చెత్తా చెదారములతో చీకుడు ఎరువు తయారు చేదామంటే అటువంటి పైరు సంబంధమైన చెత్తా చెదారాలు పొలాలలో లభించవు. కనుక గ్రామాలలో తయారయ్యే చీకుడు ఎరువుతోపాటు భూములకు మరికొంత ఎరువు లభింప జేయాలంటే ఆ భూములలో నుంచే ఎరువుగా ఉపయోగ పడే మొక్కలను, చెట్లను పెంచాలి. అయితే అలా పెంచడమనేది సాధారణ సేద్య విధానానికి ప్రతి బంధకం కారాదు. నత్రజనితరసాయనిక ఎరువులను, పచ్చిఆకు ఎరువులను సాగునీటి వల్ల సేద్యం చేయబడే భూములకూ, నమ్మకంగా 30 అంగుళాలు అంతకంటె ఎక్కువ వర్షపాతంవుండే భూములకూ ఉపయోగించ వచ్చు. ఈ భూములలో 50 లక్షల అమోనియం సల్ఫేట్ వరకూ వాడవచ్చు. కాని ఇప్పుడు 6 లక్షల టన్నుల అమోనియం సల్ఫేట్ మాత్రమే లభిస్తున్నది. దానికి ఏడాదికి రూ. 22 కోట్లకు పైగా ఖర్చవుతున్నది. నూనె పిట్టులలో సేంద్రియ నత్రజని వుండే మాట నిజమే. కాని నూనె పిట్టు సప్లయి కూడా పరిమితంగానే వుంది. పైగా దానిని కాయధాన్యపు పైరులకు వేయాలంటే ఎక్కువ ఖర్చు చేయడమన్న మాట. కనుక భూములకు చవుకగా నత్రజని లభించాలంటే పచ్చి ఆకు ఎరువు ఉచితమైనదని భారతదేశం మొత్తంపై జరుపబడ్డ ప్రయోగముల వల్ల తెలియవచ్చింది పచ్చి ఆకు ఎరువు వాడకాన్ని 1000 లక్షల ఎకరాలకు పైగా విస్తరింప జేయవచ్చు. అందుకు 40 లక్షల ఎకరాలలో పచ్చి ఆకు ఎరువును పండిస్తే చాలు. పచ్చి ఆకు ఎరువు విత్తనం దొరకడమే కొంచెం దుర్లభం కాని, లేకపోతే ఎంతైనా పండించవచ్చు.

## సులభమైన పద్ధతి

నత్రజని లభించడానికి ఎన్నో ఆధారాలున్నప్పటికినీ వాటన్నిటిలో పచ్చి ఆకు ఎరువు, గ్రామంలోని చీకుడు ఎరువు అతి ప్రధానమైనవి. వాటిని వ్యాప్తం చేయడం కూడా సులభం. అయితే అలా వ్యాప్తం చేయడానికి ఇప్పుడున్న ప్రతి బంధకాలను తొలగించి సామాన్య

రైతు వాటిని కొద్ది ఖర్చుతో పొందే విధంగా సులభ తరమైన పద్ధతిని రూపొందించాలి.

భారత దేశంలో 3300 లక్షల ఎకరాల భూమిలో పైర్లు వేయబడు తున్నవి. అందులో సాగునీటి వల్ల సేద్యం చేయబడే భూమి 600 లక్షల ఎకరాలు. నీటి కట్టు లేకుండా సేద్యం చేయబడే భూమి 2700 లక్షల ఎకరాలు. సేద్యం చేయబడే భూమిలో ఎక్కువ భాగం 30 అంగుళాలు, అంతకంటె ఎక్కువ వర్షం కురిసే ప్రాంతాలలో వున్నది. మిగిలిన భూమి ఏటా 20 అంగుళాల కంటె తక్కువ వర్షం కురిసే ప్రాంతంలోనూ, మరి కొంత భూమి 20 మరియు 30 అంగుళాల మధ్య వర్షం కురిసే ప్రాంతంలోను వుంది. 30 అంగుళాల కంటె తక్కువ వర్షం పొందే భూమి పంజాబు, రాజస్థాన్, దక్కన్ పీఠభూమిలో వుంది.

30 అంగుళాల కంటె తక్కువ వర్షం పొందుతూ నీటి కట్టు లేకుండా సాగు చేయబడే భూముల్లో పంట ఉత్పత్తికి ఎరువు ఎంత ముఖ్యమో, భూమిలో తేమ ఉండడం కూడా అంతే ముఖ్యం. కాబట్టి ఇట్టి భూములలో నిరింద్రియపు రసాయనిక ఎరువులు, పచ్చి ఆకు ఎరువులు వేయడం మంచిదికాదు. కారణమేమంటే ఆ ఎరువులవల్ల ప్రయోజనం కలుగాలంటే తగువిధంగా తేమ వుండాలి. అందుచేత ఈ భూముల్లో నీటికట్టు లేకుండా పండించబడే పైరులకు పచ్చి ఆకు ఎరువును సేంద్రియపు ఎరువులను వేసేముందు అట్టి ఎరువులను పూర్తిగా కుళ్లింప జెయ్యాలి.

ఏటా 20 అంగుళాల కంటె తక్కువ వర్షపాతం కలిగివుండి, నీటి కట్టువల్ల సేద్యం చేయబడని భూముల్లో సేంద్రియపుఎరువులను చీకింపజేసి వేయడం వల్లకూడా ఏమీ ఉపయోగం కన్పించలేదు. కారణమేమంటే ఈ భూముల్లో తేమబహు తక్కువగా వుంటుంది. కనుక 20 అంగుళాలకంటె తక్కువ వర్షపాతంగల భూముల్లో ఉత్పత్తి సమస్యను పరిష్కరించవలెనంటే ఎరువుతోపాటు నీటికట్టు కూడా వుండాలి. నీటికట్టుకు వీలు లేకపోయి నట్లయితే అప్పుడప్పుడు పెరటి ఎరువు లేదా చీకుడు ఎరువు మొదలగు సేంద్రియపుఎరువులు వేసి, ఉత్పత్తి స్థాయి తగ్గకుండా చేయవచ్చు. చీకుడు ఎరువునే కంపోస్టు ఎరువు అని కూడా అంటున్నారు.

## పరిశోధనల వల్ల తేలిన ఫలితాలు

ఏటా వర్షపాతం 30 అంగుళాలకు పైగా వుండి, ఆ వర్షపాతం సమంగా వున్నట్లయితే అట్టి భూముల్లో రసాయనిక ఎరువులను, పచ్చి ఆకు ఎరువును వేయవచ్చు. భూముల్లో నత్రజనిని పెంపొందించి తద్వారా కాయ ధాన్యాల ఉత్పత్తిని హెచ్చించ వలెనంటే అమోనియం సల్ఫేట్ వంటి రసాయనిక ఎరువులను, లేదా పచ్చి ఆకు ఎరువులను లేక రెండింటినీ ఉపయోగించడం మంచిదని భారత దేశంలో వివిధ ప్రాంతాలలో జరుపబడిన పరిశోధనల వల్ల తేలినది ఉదాహరణకు కటక్ వరి పరిశోధనా కేంద్రంలో జరుపబడిన ప్రయోగం విషయం గమనించండి. రెండు చేలల్లో నత్రజని సమానంగా, వుండగా, ఒకదానిలో పచ్చి ఆకు ఎరువు, రెండవ దానిలో అమోనియం సల్ఫేట్ వేయబడ్డవి. అమోనియం సల్ఫేట్ వేసిన చేనుకంటె పచ్చి ఆకు ఎరువు వేసిన చేనులోనే ఎక్కువ పంట పండింది. రెండు చేలల్లోనూ ఎకరానికి 20 పౌనుల చొప్పున నత్రజని వేసి ఒక దానిలో అమోనియం సల్ఫేట్ వేయగా ఒక పౌను నత్రజనికి 11.06 పౌనుల ధాన్యం పండింది. రెండవ దానిలో పచ్చి ఆకు ఎరువు వేయగా ఒక పౌను నత్రజనికి 25.9 పౌనుల ధాన్యం పండింది. కేవలం అమ్మోనియం సల్ఫేట్ మాత్రమే వేసే దాని కంటె అమోనియం సల్ఫేటును పచ్చి ఆకు ఎరువుతో కలిపివేయడం మంచిదని తేలింది. అయితే ఇది కూడా సమాన నత్రజని ప్రాతిపదికపై పచ్చి ఆకు ఎరువు కంటె శ్రేష్ఠమైనది కాదు. క్రొత్త ఢిల్లీలోని భారతీయ వ్యవసాయ పరిశోధనా సంస్థలో చేయబడిన పరిశోధనల వల్ల గోధుమ పంటకు నత్రజని అవసరమని తేలింది. ఈ నత్రజనిని పెరటి ఎరువు ద్వారా—అంటే పచ్చి ఆకు ఎరువు ద్వారా గాని లేక కృత్రిమ ఎరువు ద్వారా గాని లభింప జేయవచ్చు.

పంటల దిగుబడిని హెచ్చించాలంటే పచ్చి ఆకు ఎరువు మిక్కిలి ప్రయోజనకరమైందని భారతదేశం లోని పరిశోధకులంతా తేల్చినప్పటికీ, దక్షిణాది కొన్ని రాష్ట్రాలలో తప్ప ఇతర చోట్ల పచ్చి ఆకు ఎరువు వాడకం అంతగా వ్యాప్తి జెందలేదు. ఇందుకు ముఖ్య కారణం పచ్చి ఆకు ఎరువు విత్తనం తగు మొత్తాలలో లభించక పోవడమే. ఉత్తర భారతంలో వేసవి, చలికాలమూ చాలా తీవ్రంగా ఉంటాయి. అందుచేత అక్కడ ఖరీఫ్ తరుణంలో మాత్రమే పచ్చి ఆకు ఎరువు విత్తనాలను పండించ వీలవుతుంది. ఇందువల్లనే విత్తనం ఉత్పత్తి జరగడం లేదు. ఖరీఫ్ తరుణంలో విత్తనాలను ఉత్పత్తి చేయడానికి పొలమంతా పచ్చి ఆకు ఎరువు పైరును వేస్తే అందువల్ల సేద్యదారుడు నష్టపడతాడు. ఆ పైరులకు బదులుగా ఇతర పైరులను వేసుకుంటే అతనికి లాభించవచ్చు. కొన్ని ప్రాంతాలలో నారకొర్రకై

జనుము వేస్తారు. దీనివల్ల పరోక్షంగా కొన్ని విత్తనాలు లభిస్తాయి. మరికొన్ని ప్రాంతాలలో ఖరీఫ్ తరుణంలో వెల్లువ లేనట్లయితే ధ్యాంచా వేస్తారు. కాని దక్షిణాది రాష్ట్రాలలో వేసవి, చలి అంత తీవ్రంగా వుండవు. అందుచేత అక్కడ వరికోత తైనతరువాతనే వేసవి కాలంలో పచ్చి ఆకు ఎరువు పైరుగా వెంపలి, పిల్లిపెసర, జీలుగ వేస్తారు. వాటి వల్ల విత్తనం ఉత్పత్తి అవుతుంది. అయితే ఆ విత్తనం ఉత్పత్తి అంతగా నమ్మ దగింది కాదు. ఎందుచేత నంటే వేసవిలో అకస్మికంగా పెద్ద వర్షాలు కురిశాయంటే విత్తనం ఏర్పడదు.

## పొలంగట్లపై మొక్కలు వేయడం

జూన్ మొదలు డిసెంబరు నెలవరకు మామూలు పైరులు గల పొలంలోనే పచ్చి ఎరువు మొక్కలను వేస్తే మామూలు పైరులకు ఎట్టి నష్టము కలుగ నట్లయితే పెద్ద మొత్తాలలో పచ్చి ఆకు ఎరువు విత్తనాలను పండించి అన్ని ప్రాంతాలకూ రకరకాల విత్తనాలను లభింప జేయవచ్చు. ఈ సమస్య మద్రాసు రాష్ట్రం లో చక్కగా పరిష్కరింప బడింది. ఆ రాష్ట్రంలో ఒక పద్ధతి అవలంబింప బడింది. ఆ పద్ధతి ప్రకారం పొలాల గట్లపైన పచ్చి ఆకు ఎరువు పైరు వేయబడింది. ఆ వేయడం కూడా మామూలు సేద్య తరుణంలో వేయబడింది. అంటే జూన్ లేక జూలై మొదలు నవంబరు వరకు. దీన్ని బట్టి పొలంలో వున్న ముఖ్యమైన పంటకు దెబ్బ తగులకుండా ఆ పొలానికి సరిపడే జీలుగ విత్తనాలను దాని గట్లపైననే పండించ వచ్చని తేలింది.

ఏ పొలానికి ఏ పచ్చి ఆకు ఎరువు వేయవలె ననేది యీ క్రింది అంశాలను బట్టి ఆలోచించవలసి వుంటుంది. తేలిక నేలలలో 8 వారాల లోపలనే త్వరగా పచ్చి ఆకు ఎరువు పెరగవలె నంటే జనుము మంచిది. జీలుగ వేసినా 8 వారాల లోపలే సరిపడే పచ్చి ఆకు ఎరువు పెరుగుతుంది. కాని జనుముకంటె తక్కువే అని చెప్పాలి. అయితే జీలుగ, తేలిక నేలలలోనూ నీరు ఇంకని గట్టి నేలల్లోనూ, చవిటి నేలల్లోనూ, నీరు నిలిచే భూములలోనూ పెరుగుతుంది. భారీ వర్ష పాతం గల ప్రాంతాలలో జనుము విత్తనాలు సంతృప్తి కరంగా పండవు, అసలు చవిటి నేలల్లో, నీరు నిలిచే నేలల్లో జనుము పెరగజాలదు.

ముండ్లు లేనట్టి ఒక రకపు జీలుగను అన్ని భూముల లోనూ, అన్ని విధములైన వర్షపాత పరిస్థితులలోనూ పండించవచ్చు. అయితే దీనివల్ల 8 వారాల లోపల తక్కువ పచ్చి ఆకు ఎరువు పండుతుంది. ఈ రకం జీలుగను పండించడానికి, పొలంలో అసలు పైరు వేయడానికి మధ్య 3 లేక 4 నెలల వ్యవధి వుందంటే జనుము కంటె దీని వల్లనే ఎక్కువ పచ్చి ఆకు రొట్ట లభిస్తుంది. ఆ వ్యవధి 6 నెలలు గనుక వున్నట్లయితే ఎకరానికి లక్ష పౌనుల జీలుగ రొట్ట పండుతుంది జీలుగ మూడు నెలల తరువాత కాడలు ముదిరి గట్టి పడిపోతుంది కాని ముండ్లు లేనట్టి జీలుగ మాత్రం ఆ తరువాత కూడా పచ్చిగా లేతగా వుంటుంది.

వెంపలి తేలిక నేలల్లో బాగా పెరుగుతుంది. దీనిని మేకలు, ఇతర పశువులు తినవు. ఒక పర్యాయం దీన్ని గనుక వరి పొలంలో వేసినట్లయితే దానంతట అదే స్వతస్సిద్ధంగా పెరుగుతూ వుంటుంది. కాని జూలై నెలకు ముందు పొలంలో సేద్యం లేని 5 లేక 6 నెలల కాలంలో పెరిగే పచ్చిఆకు రొట్టమాత్రం 2000 లేక 3000 పౌనులు మాత్రమే వుంటుంది. వేసవిలో అదరా బాదరాగా వేసిన భూములలో పైరు పూర్తిగా నశించి పోవచ్చును. పిల్లిపెసర నీరు ఇంకని గట్టి భూములలో పెరుగుతుంది. దీనివల్ల మూడు నెలల కాలంలో 20,000 పౌనుల పచ్చి ఆకు రొట్ట లభిస్తుంది. అయితే ఇది అతివృష్టికి నిలువలేక చెడి పోవచ్చు.

పచ్చి ఆకు ఎరువునకుపకరించు వన్యజాతుల బాగోగులను బాగా పరిశీలించిన మీదట 30 అంగుళములు లేక అంతకంటె ఎక్కువ వర్షపాతం గల అన్ని ప్రాంతాలకు జీలుగను, ముండ్లులేని జీలుగను సిఫారసు చేయవచ్చు. పొలాలలో రొట్ట తొక్కుటకు ముందు 4 మొదలు 5 వారాల గడువు మాత్రమే వున్న సందర్భాలలో జీలుగ వేయడం మంచిది.

పచ్చి ఆకు ఎరువు వాడకాన్ని వ్యాప్తంచేసే సందర్భంలో 20,000 మొదలు 30,000 పౌనుల వరకు పచ్చి ఆకు రొట్టను ఎరువుగా వేయవలసి వుంటుందేమో నన్న అభిప్రాయాన్ని పూర్తిగా తొలగించాలి. వరి పైరుకు ఎక్కువలో ఎక్కువ 2,000 మొదలు 8,000 పౌనుల వరకు పచ్చి ఆకు రొట్ట చాలు. ఈ మొత్తం రొట్టను సేద్యతరుణానికి క్రితం తరుణంలో పొలం గట్లపైన పండించిన విత్తనాలలో మంచి కొన్ని విత్తనాలు వేసి పండించవచ్చు. ఖరీఫ్ పైరు వేయు నప్పుడు ఒక ఎకరం పొలం గట్లపై 2 ఔన్సుల జీలుగ విత్తులు లేక ముండ్లులేని జీలుగ విత్తులు వేసినట్లయితే డిసెంబరు లోపుగా 60 మొదలు 160 పౌనుల వరకు విత్తనాలను పండించవచ్చు. వాట్లు వేసి వరి పైరును

పండించు ప్రాంతాలలో నారు మడిలో వడ్ల విత్తనాలతోపాటు జీలుగ లేక ముండ్లు లేని జీలుగ విత్తనాలు కూడా వేసి, పొలంలో నాట్లువేసిన తరువాత పొలంగట్లపైన జీలుగ మొక్కలను కూడా నాటాలి. ఖరీఫ్ తరుణంలో నీటికట్టు వల్ల సాగయ్యే భూములలో జనుము బాగా పెరగదు. కాని మెరక భూముల లోనూ, వర్షపాతం ఎక్కువగా లేనిచోట్ల నీటి కట్టువల్ల సాగయ్యే పొలాల గట్లపైననూ జనుము పెంచ వచ్చు. వర్షంవల్ల సాగయ్యే పైరులగు జొన్న, ఖరీఫ్ పప్పుధాన్యాలు మొదలగు పైరులు వేయబడుచోట్ల ఆ పైరులతోపాటు పొలంలో జనుముకూడా వేసినట్లయితే విత్తనం ఉత్పత్తి అవుతుంది. జనుము, జీలుగ, ముండ్లు లేని జీలుగ విత్తనాలు డిసెంబరు నెలకల్లా లభిస్తాయి. నాటువేసి పండించబడు వరిపైరు కొరకు ఏప్రిల్ మొదలు జూన్‌వరకు గల కాలంలో 20 మొదలు 30 పౌనుల జీలుగ విత్తనాలు, లేక ముండ్లులేని జీలుగ విత్తనాలు, లేక 50 మొదలు 60 పౌనుల వరకు జనుము విత్తనాలు వేసి వేసవి జల్లుల సహాయంతోగాని లేదా సాగునీటితో గాని పండించి పచ్చిఆకు రొట్టను తయారు చేయవచ్చు.

నాట్లపద్ధతి గాకుండా, విత్తనాలు పొలంలో చల్లి వరిపైరు పండించబడు ప్రాంతాలలో ఎకరానికి 15పౌనుల జీలుగ విత్తనాలను వడ్ల విత్తనాలతోపాటు చల్లినట్ల యితే, ఒక నెల తరువాత వరిపైరులో ఎక్కువగా వున్న మొక్కలను తొలగించు నప్పుడు జీలుగ మొక్కలను పీకి పచ్చిఆకు ఎరువుగా పొలంలో తొక్కవచ్చు. ఇలా చేయడంవల్ల పంట దిగుబడి 12 శాతం హెచ్చింది. ఇది కటక్‌లో జరుపబడ్డ ప్రయోగంవల్ల తెలియవచ్చింది.

నీటికట్టు సేద్యంలేని ప్రాంతాలలో గోధుమ పైరు విషయంలో ఎటి కష్టంలేకుండా జనుము, జీలుగ, ముండ్లులేని జీలుగ మొదలగు పచ్చిఆకు రొట్టలను పండించవచ్చు. వీటిని గోధుమ పొలంలో ఖరీఫ్ పైరు లేనప్పుడు పండించాలి. ఈ విధంగా పండించబడిన పచ్చి ఆకు రొటను ఆగస్టునెల మధ్యలో పొలంలోవేసి దున్నాలి. నీరు ఇంకని నల్లరేగడి భూములలో ఈపద్ధతి సాధ్యం కాకపోవచ్చు. అప్పుడు పచ్చిఆకు రొట్ట పైరుముకోసి లేక పెరికి చీకుడు ఎరువుగాచేసి ఆ తరువాత వచ్చేరబ్బీ పైరుకు వాడవచ్చు.

నీటికట్టువల్ల సేద్యం చేయబడే రబ్బీ పొలాలైతే పెసర, మినుము, ఉలవ, వంటి స్వల్పకాలిక ఖరీఫ్ పప్పు ధాన్యాల పైరునుగాని లేక గోరుచిక్కుడుగాని పండించి, వర్షాకాలంలో పొలంలో వ్యవసాయం జరగ నట్లయితే పొలాన్ని సకాలంలో దున్నవచ్చు. భారత దేశంలోని అనేక ప్రాంతాల రైతులు ఈ విత్తనాలను తగు విధంగా నిల్వచేసుకొని వుంటారు. అందుచేత విత్తనాల సరఫరా సమస్య అంత ప్రబలంగా వుండదు. రబ్బీపైరు వేసే ముందుగా మొక్కజొన్న వంటి కాయ ధాన్యపు పైరు వేయబడుచోట్ల మొక్కజొన్న పైరు లోనే చాలు విడిచి చాలులో ఖరీఫ్ పప్పుధాన్యం పైరును, జీలుగ, ముండ్లులేని జీలుగ, గోరుచిక్కుడువంటి పైరులను కూడా వేసి, ఖరీఫ్ పైరు కోత లవడంతోటే ఈ పచ్చిఆకు ఎరువు పైరులను పొలంలో కలిపి వేయ వచ్చు. ఢిల్లీలోని భారతీయ వ్యవసాయ పరిశోధనా సంస్థలో రూపొందించబడ్డ గోధుమ పైరుతోపాటు హ్యూబాంక్లోవర్ కూడా వేసినందువల్ల వేసవిలో పశు గ్రాసం లభించడమేగాక మొక్కజొన్నకు పచ్చిఆకు రొట్టకూడా లభించగలదని తేలింది.

## ఎప్పుడూ వుండేటి వన్యజాతులు.

20 అంగుళాలు మొదలు 30 అంగుళాలవరకు వర్షం కురిసే ప్రాంతాలలో నీటి కట్టువల్ల సేద్యం చేయబడని భూములలోనూ, 30 అంగుళాలకు పైగా వర్షం కురిసినా అసలు పైరు పెరుగుతూవున్న దశలో వర్షాలు కురవని ప్రాంతాలలోను పొలాల గట్లపై ఎప్పుడూ వుండేటి వన్యజాతి పొదలను పెంచాలి. వాటి ఆకులను ఆ పొలం లోనే చీకుడు ఎరువుగా తయారు చేయాలి. అయితే ఎటువంటి పొదలను పెంచాలనే విషయం పరిస్థితుల్నిబట్టి నిర్ణయించాలి. నీటి ఎద్దడికి ఆ పొదలు నిలువగలగాలి. ఆ పొదల వేర్లవల్ల అసలు పైరుకు దెబ్బ తగలకూడదు. పెరుగుతూ వుంటే కొట్టివేస్తున్నా అవి నిలువగలిగి వుండాలి. భారతదేశంలోని అన్ని ప్రాంతాలలోనూ, వర్షాధార పరిస్థితులలో స్వరతీత, మరొక రకపు జీలుగ బాగా పెరగ గలవని తెలుస్తున్నది. ఒకజాతినీలి, ఒకజాతి వెంపలి; గిలగిచ్చ మొదలగు వన్యజాతులు అధికవర్షం గల ప్రాంతాలలో బాగా పెరుగుతవి. మద్రాసు రాష్ట్రంలో 4000 అడుగులకంటె తక్కువ ఎత్తునవున్న అన్ని ప్రాంతాలలో వర్షాధార పరిస్థితుల్లో మాత్రమే, ఒకజాతి నీలి తగినవని తెలుస్తున్నది.

కోయిల్‌పట్టి వ్యవసాయ పరిశోధన కేంద్రంలో నల్లని వండలిభూమి వుంది. అక్కడ ఏడాదికి 25 మొదలు 30 అంగుళాల వర్షం కురుస్తుంది. అదికూడా మూడు నెల్ల లోపలనే కురుస్తుంది. అక్కడ నూరు ఎకరాల భూమిలో పొలంగట్లపై మాత్రమే. సవరతీగ మొక్కలు నాటబడినవి. వీటివల్ల మూడో సంవత్సరంలో ఏడాదికి అదనంగా 346 టన్నుల చీకుడు ఎరువు లభించింది. అంటే సేద్యం చేయబడ్డ ప్రాంతంలో ఎకరానికి 3½

టన్నుల చొప్పున అన్నమాట. ఈ ఉత్పత్తి సాధారణంగా మెట్టపైర్లకు సరిపోతుంది. ఈ విధంగా పొలంగట్లపై మొక్కలు వేయడానికి ఎక్కువ ఖర్చుకూడా కాదు. ఒక మోపెడు కొమ్మలతో కోయలపట్టిలో ఏడాదిలో పదిమైళ్ల పొడవున సవరతీగకంచె వేయబడింది.

ప్రతి గ్రామంలో మాద్రే, సవరతీగె మొక్కల పెంపకపు కేంద్రాలను ఏర్పాటు చేయాలి. ఏప్రిల్ నెల ఆ ప్రాంతంలో నారుమళ్ళలో మాద్రే, మరో రకపు జీలుగ విత్తనాలు వెయ్యాలి. వాటి మొక్కలు పెరగగానే వాటిని పెరికి, పొలం గట్లపై తొలకరి ఆరంభం కాకమునుపే అడుగుకొకటి చొప్పుననాటాలి. సవరతీగెను మొక్క వేసిన మొదటి సంవత్సరంలోనే కొమ్మలు నరకవచ్చు. కానీ ఇతర వన్యజాతులను సంవత్సరం పైగా పెరగనిచ్చిన మీదటే కొమ్మలు నరకాలి. మద్రాసు రాష్ట్రంలోవున్న పరిస్థితులనుబట్టి ఒకజాతి నీలిని వేసినట్లయితే ఏడాదిలోపలే కావలసినన్ని విత్తనాలు లభిస్తాయి. ఒక్కొక్క మొక్కవల్ల ఏడాదికి దాదాపు ౫౦,౦౦౦ విత్తులు లభిస్తాయి. మరో రకపు జీలుగవల్ల కూడా పెద్ద మొత్తంలో విత్తనాలు లభించగలవు.

కనుక పొలాల గట్లపై సత్వరంగా మొలిచి, ఎప్పుడూ వుండేటటువంటి మొక్కలను పెంచాలి. ఈ విధంగా ప్రతి పొలంలో రెండు మూడేండ్ల లోపల, దానికి ఏడాదికి అవసరమైన చీకుడు ఎరువును తయారు చేయడం రైతుల లక్ష్యం కావాలి. ఒక ఎకరం పొలంలో 8'x 6'x 8' అడుగుల పరిమాణం గల కంపోస్టు గుంటను త్రవ్వి అందులో చీకుడు ఎరువును తయారు చేసినట్లయితే ఆ ఎరువు ఆ పొలానికి సరిపోతుంది. పొలాలలో ఇటువంటి గుంటలను త్రవ్వడం చాలా ముఖ్యమైన పని. ఆ గుంటలలో రొట్టను, కొమ్మలను రెమ్మలను వేసి అక్కడి కక్కడే చీకుడు ఎరువు తయారు చేయవచ్చు

ఈవిధంగా వర్షాధారంపై సేద్యం చేయబడే పొలాల గట్లపై వన్య జాతులను పెంచడంవల్ల వాటి ప్రక్కన వున్న పైరులకు పెద్ద నష్టం కలుగదని అనుభవం వల్ల తేలింది. కనుక గ్రామసీమలలోని పంట పొలాల గట్ల నన్నిటినీ పైరులకు ఎట్టి నష్టం లేకుండానే ఆ పొలాలకు అవసరమయ్యే ఎరువును తయారు చేసే ఫ్యాక్టరీలుగా మార్చాలి. ఈ విధంగా ఎక్కడి కక్కడ ఎరువును ఉత్పత్తి చేయడంవల్ల ఆవరణ సాధ్యమైన రీతిని ఎక్కువ ఖర్చు లేకుండా భారతదేశ భూముల నత్రిజని లోపాన్ని తొలగించవచ్చు. దేశంలో సేద్యం చేయబడే ప్రతి భూమిలో ఆ భూమికి అవసరమయ్యే సేంద్రియపు ఎరువులను ఉత్పత్తి చేయడానికి శ్రద్ధగా ప్రయత్నం జరగాలి. మన దేశ భూములలోని నత్రిజని కొరతను తీర్చడానికి గట్టి ప్రయత్నం చేయకపోయి నట్లయితే దేశ వ్యవసాయోత్పత్తిని శాశ్వతంగా పెంపొందించడం సాధ్యపడదు. ఈ విషయాన్ని వ్యవసాయదారులు గమనించాలి.



ఆంధ్రప్రదేశ్ జిల్లాలు :

# పశ్చిమ గోదావరి

పశ్చిమ గోదావరిజిల్లా ఎల్లలు ఇవి: ఉత్తరాన తెలంగాణా ప్రాంతము; దక్షిణాన బంగాళాఖాతము, కృష్ణా జిల్లా; తూర్పున గోదావరినది; పడమట కృష్ణాజిల్లా.

ఈ జిల్లా విస్తీర్ణం 3,015 చదరపుమైళ్ళు, జనాభా 1,697, 727 (1951 సంవత్సరపు జనాభాలెక్కలనుబట్టి).

ప్రజలు మాట్లాడేభాష తెలుగు. ఈ జిల్లా మిగుల సారవంతమైనది. చింతలపూడి, పోలవరం తాలూకాలలో తప్ప మిగతా అంతటా ఒండునేల వున్నది.

ఈ జిల్లాలో ఏలూరు, భీమవరం, పాలకొల్లు, నర్సాపురం మునిసిపలుపట్టణాలు. నర్సాపురం చిన్నపాటి రేవు. 1951 జనాభా లెక్కలనిమిత్తం ఏలూరు మాత్రమే పట్టణంగా పరిగణింపబడింది. ఏలూరులో జనుముమిల్లు వున్నది. ఏలూరు తివాచీ పరిశ్రమకూ, తోళ్ళపరిశ్రమకూ ప్రసిద్ధికెందినది. జిల్లాలో రెండు పంచదారమిల్లులున్నవి. తణుకులో వస్త్రముల మిల్లు ఒకటి వున్నది. నర్సాపురంలో లేసుపని కుటీరపరిశ్రమగా వున్నది.

## శీతోష్ణ స్థితి

జిల్లా అంతటా శీతోష్ణస్థితి ఆరోగ్యకరంగా వుంటుంది. పోలవరం తాలూకాలోని కొండప్రాంతాలలో ఇతర మైదాన ప్రాంతాలకంటె డిసెంబరు జనవరి నెలల్లో చలి ఎక్కువగా వుంటుంది.

జూన్ నెలనుంచి సెప్టెంబరు నెలవరకు నైఋతి ఋతుపవనాలమూలంగా ఎక్కువగా వర్షం కురుస్తుంది. అక్టోబరు, నవంబరు నెలల్లో ఈశాన్య ఋతుపవనాల మూలకంగాకూడా కొద్దిగా వర్షం కురుస్తుంది. సగటు వర్షపాతం 40 4 అంగుళాలు.

ఈ జిల్లాలో వరి ముఖ్యమైనపంట. మిరపకాయలు, చెరకు, వేరుసెనగ, అల్లం, పొగాకు వాణిజ్యపంటలు, చింతలపూడి తాలూకాలోను, నర్సాపురం తాలూకాలోని పాలకొల్లు పట్టణంలోను బత్తా నారింజ తోటలున్నవి. డెల్టాప్రాంతాలలో ముఖ్యంగా నర్సాపురం, తణుకు తాలూకాలలో కొబ్బరిచెట్లు విశేషంగా వుంటాయి.

## వృత్తి

ప్రజల ముఖ్యవృత్తి వ్యవసాయం. దాదాపు 78.88 శతిప్రజలకు వ్యవసాయమే జీవనోపాధి. కుటీరపరిశ్రమలలో నేత పరిశ్రమ అనేక గ్రామాలలో వున్నది. నర్సాపురం దగ్గరిగ్రామాలలో అనేక కుటుంబాలకు లేసుపని ముఖ్యవృత్తి. ఏలూరులోను, తంగెళ్ళమూడిలోను తివాచీలు నేయబడుతవి. ఏలూరుతాలూకాలో తోళ్ళ ఊనకం జరుగుతుంది. అక్కడ 11 తోళ్ళ ఊనకం సంస్థలున్నవి. తణుకుతాలూకాలోని పెనుగొండలో ఇనుపట్రంకులు తయారుచేయబడుతవి. తణుకుతాలూకాలోని అజ్జరంగ్రామం ఇత్తడి పరిశ్రమకు ప్రసిద్ధి కెందినది. ఏలూరుతాలూకాలోని భీమడోలులో జాడీలు, పింగాణీపాత్రలు తయారుచేయబడుతవి. నరసాపురం, భీమవరం తాలూకాలనుంచి ఎండుచేప ఎగుమతి చేయబడుతుంది. ఆకివీడు, భీమవరం, పాలకొల్లు, తాడేపల్లిగూడెముల నుంచి బాతుగుడ్లు కలకత్తాకు ఎగుమతి చేయబడుతవి. ఏలూరులో గోనెసంచులు తయారుచేసే ఫ్యాక్టరీ ఒకటి వుంది.

## రాకపోకలు

చింతలపూడి, పోలవరం తాలూకాలు తప్ప మిగతా జిల్లా అంతటా రైలుమార్గమున్నది. మద్రాసు కలకత్తా రైలుమార్గం ఈ జిల్లాగుండా పోతుంది. ఏలూరు రైలు స్టేషన్‌నుంచి రోడ్డుద్వారా రెండుమైళ్ళ దూరంలో చింతలపూడి వున్నది. కొవ్వూరు రైలుస్టేషన్‌నుంచి 26 మైళ్ళదూరంలో పోలవరం వున్నది.

జీలకర్ర గూడెంలో గుహలు, స్తూపకట్టడములు, శిథిలావస్థలోవున్న మండపములు వున్నవి. తడికలపూడిలో బుద్ధుని శిలావిగ్రహంవుంది. చింతలపూడి

తాలూకాలోని గుంటుపల్లిలో బౌద్ధ శిల్పావశేషా లున్నవి.

జిల్లా ప్రధాన కేంద్రం ఏలూరు

ఈ జిల్లాలోని ముఖ్యపట్టణాల జనాభా వివరాలు ఇవి:—

| | | |
|---|---|---|
| ఏలూరు | (ము) | 87,213 |
| భీమవరం | (ము) | 30,928 |
| పాలకొల్లు | (ము) | 23,037 |
| నరసాపురం | (ప) | 20,999 |
| తణుకు | (ప) | 16,606 |
| తాడేపల్లిగూడెం | (ప) | 13,543 |
| మొగల్తురు | (ప) | 12,904 |
| కొవ్వూరు | (ప) | 12,807 |
| పెనుగొండ | (ప) | 12,200 |
| నిడదవోలు | (ప) | 11,628 |
| వేల్పూరు | (ప) | 11,394 |
| అత్తిలి | (ప) | 10,964 |
| ఆకివీడు | (ప) | 10,307 |
| ఆచంట | (ప) | 9,647 |
| రేలంగి | (ప) | 9,549 |
| వీరవాసరం | (ప) | 8,866 |
| పెంటపాడు అగ్రహారం | | 9,584 |
| ఉండి | (ప) | 7,157 |
| మారుటేరు | (ప) | 7,129 |
| పెనుమంట్ర | (ప) | 6,097 |

["ము" అనగా మునిసిపాలిటీ, "ప" అనగా పంచాయితీ]



అభివృద్ధి కార్యక్రమం :

# జాతీయ విస్తరణ సేవా కేంద్రాలు, సామాజికాభివృద్ధి కేంద్రాలు అనంతర తీవ్రకృషి బ్లాకులు, బహుళార్థ సాధక ప్రాజెక్టులు

భారత ప్రభుత్వ సామాజికాభివృద్ధి మంత్రిత్వశాఖ సూచించిన పద్ధతిప్రకారం ఒక జాతీయ విస్తరణ సేవా కేంద్రంలో దాదాపు నూరు గ్రామాలు. 150 మొదలు 200 చదరపు మైళ్ల విస్తీర్ణం, దాదాపు 66,000 జనాభా వుంటాయి. ఏజన్సీ ప్రాంతం తాలూకు కేంద్రంలో దాదాపు అన్నే గ్రామాలు, అంతే విస్తీర్ణం దాదాపు 25,000 జనాభా వుంటుంది. జాతీయ విస్తరణ సేవా కేంద్రం యొక్క వివరణలే సామాజికాభివృద్ధి బ్లాకుకు కూడా వర్తిస్తాయి. జాతీయ విస్తరణ సేవా కేంద్రానికీ, సామాజికాభివృద్ధి బ్లాకుకూ కార్యక్రమ కాలం మూడేండ్లు. అయితే జాతీయవిస్తరణ సేవా కేంద్రం యొక్క మూడేండ్ల గడువు పూర్తి కాక పూర్వమే అది ఆదశలో సాధించిన అభివృద్ధిని ఆధారంగా తీసుకొని దానిని సామాజికాభివృద్ధి బ్లాకుగా మార్చ వచ్చు. కార్యక్రమకాలం పూర్తి అయిన తరువాత ప్రతి సామాజికాభివృద్ధి బ్లాకు అనంతర తీవ్ర కృషి దశలోకి ప్రవేశిస్తుంది. అప్పుడది అనంతర తీవ్రకృషి బ్లాకు అని వ్యవహరింప బడుతుంది.

బ్లాకు యొక్క ప్రధాన కార్యస్థానమును ఈ దిగువ అంశాలను దృష్టియందుంచుకొని నిర్ణయించడం జరుగుతుంది.

(అ) ప్రధాన కార్యస్థానం బ్లాకుకుమధ్యలో వుండవలెను. ప్రజలందరూ వచ్చిపోవడానికి వీలుగా వుండవలెను.

(ఆ) బ్లాకు ప్రధాన కార్యస్థానమును నిర్ణయించు సందర్భంలో సాధ్యమైనంతవరకు జిల్లా కేంద్రములను, తాలూకా కేంద్రములను విడిచి పుచ్చవలెను.

(ఇ) ఆఫీసు భవనములను, సిబ్బందికి నివాస గృహము లను కట్టుటకై ప్రభుత్వస్థలంగాని లేదా ప్రైవేటు వ్యక్తులు ఉచితంగా ఇచ్చేస్థలం గాని లభించే వీలుండ వలెను.

(ఈ) అభివృద్ధి కార్యక్రమానికి ప్రజల సహాయ సహ కారాలు లభించే అవకాశాలుండవలెను.

జాతీయ విస్తరణ సేవాకేంద్రాలను ఎన్నిక చేయడం లో ఈక్రింది విషయాలు ముఖ్యంగా గమనింప బడు తాయి:—

(అ) సాధారణంగా ఇదివరకే బ్లాకులు పనిచేస్తున్నట్టి ప్రాంతాలకు ప్రక్కనవున్నట్టి ప్రాంతాలకు ప్రాధాన్య మివ్వబడుతుంది. అందువల్ల పథకరచన, అజమాయిషీకి సంబంధించిన పనులు సులభంగా, సమర్థవంతంగా జరుగడానికి వీలుంటుంది.

(ఆ) భారీనీటివనరు ప్రాజెక్టుల క్రింద ఆయకట్ల అభివృద్ధి.

(ఇ) గ్రామ సేవకులకు శిక్షణ ఇచ్చే కేంద్రాలచుట్టూ బ్లాకులు నెలకొల్ప బడుతాయి. దీనివల్ల శిక్షణపొందే వారికి ప్రత్యక్ష శిక్షణ ఇవ్వడం వీలుపడుతుంది.

(ఈ) వెనుకబడ్డ తరగతులవారు, గిరిజనులు నివసించే ప్రాంతాల ప్రత్యేకావసరాలు, లేదా వెనుక బడిన ప్రాంతాల ప్రత్యేకావసరాలు

(ఉ) వ్యవసాయోత్పత్తుల సత్వర హెచ్చింపు లక్ష్యం.

(ఊ) ఆయాప్రాంతాలలో స్థానికాభివృద్ధి పనులు జరి పించడం.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 2.10-1957 తేదీన ఈ దిగువ జాతీయ విస్తరణ సేవాకేంద్రాలు, సామాజికాభి వృద్ధి బ్లాకులు, అనంతర తీవ్రకృషి బ్లాకులు, బహుళార్థ సాధక ప్రాజెక్టులు వున్నవి.

| బ్లాకు పేరు | తాలూకా | బ్లాకువివరం |
|---|---|---|
| **శ్రీకాకుళం జిల్లా** | | |
| 1. బారువ | సోంపేట | జాతీయవిస్తరణ సేవా కేంద్రం |
| 2. మందసా | —డిటో— | -డిటో- |
| 3. బురజ | పాలకొండ | -డిటో- |
| 4. మేర్మహమ్మద్‌పురం | చీపురుపల్లి | ,, |
| 5. సర్వకోట | పాతపట్నం | ,, |
| 6. ఉర్లం | నరసన్న పేట | ,, |
| 7. సీతంపేట | పాలకొండ | ,, |
| 8. కొత్తపొమ్మాళి | నరసన్న పేట | ,, |
| 9. గార | శ్రీకాకుళం | సామాజికాభివృద్ధి బ్లాకు |
| 10. ఆముదాలవలస | -డిటో- | ,, |
| 11. ఇచ్ఛాపురం | ఇచ్ఛాపురం | అనంతర తీవ్ర కృషి బ్లాకు |
| **విశాఖపట్నం జిల్లా** | | |
| 12. కణితి | విశాఖపట్నం | జాతీయవిస్తరణ సేవా కేంద్రం |
| 13. రోలుగుంట | నర్సీపట్నం | ,, |
| 14. గొలుగుంట | ,, | ,, |
| 15. తగరపువలస | భీమునిపట్నం | ,, |
| 16. కోడూరు | చోడవరం | ,, |
| 17. కసింకోట | అనకాపల్లి | ,, |
| 18. పెందుర్తి | విశాఖపట్నం | సామాజికాభివృద్ధి బ్లాకు |
| 19. సబ్బవరం | అనకాపల్లి | ,, |
| 20. కోటవరుట్ల | నర్సీపట్నం | ,, |
| 21. నక్కపల్లి | యలమంచిలి | ,, |
| 22. అరకు | శృంగవరపుకోట | బహుళార్థసాధక ప్రాజెక్టు |
| 23. హుకుంపేట | చింతపల్లి | ,, |
| **తూర్పు గోదావరి జిల్లా** | | |
| 24. కొత్తపేట | కొత్తపేట | జాతీయవిస్తరణ సేవాకేంద్రం |
| 25. పుల్లేటికుర్రు | ,, | ,, |
| 26. తుని | తుని | ,, |
| 27. ముమ్మిడివరం | అమలాపురం | ,, |
| 28. తొండంగి | తుని | ,, |
| 29. రాజానగరం | రాజమండ్రి | సామాజికాభివృద్ధి బ్లాకు |
| 30. కోరుకొండ | ,, | ,, |
| 31. రాయవరం | రామచంద్రాపురం | అనంతరతీవ్ర కృషి బ్లాకు |
| 32. చోడవరం | ,, | ,, |
| 33. కపిలేశ్వరపురం | ,, | ,, |
| 34. పిఠాపురం | పిఠాపురం | ,, |
| 35. గొల్లప్రోలు | ,, | ,, |
| 36. గొల్లపాలెం | కాకినాడ | ,, |
| 37. సామర్లకోట | ,, | ,, |
| 38. కిర్లంపుడి | పెద్దాపురం | ,, |
| **పశ్చిమ గోదావరి జిల్లా** | | |
| 39. మలకపల్లి | కొవ్వూరు | జాతీయవిస్తరణ సేవా కేంద్రం |
| 40. గోపాలపురం | ,, | ,, |
| 41. గణపవరం | తాడేపల్లి గూడెం | ,, |
| 42. నల్లజెర్ల | ,, | ,, |
| 43. పెంటపాడు | ,, | ,, |
| 44. ఆకివీడు | భీమవరం | ,, |
| 45. మొగల్తుర్రు | నరసాపురం | ,, |
| 46. కొయ్యలగూడెం | పోలవరం | సామాజికాభివృద్ధి బ్లాకు |
| 47. భీమడోలు | ఏలూరు | ,, |
| 48. చింతలపూడి | చింతలపూడి | ,, |
| **కృష్ణా జిల్లా** | | |
| 49. వీరవల్లి | గన్నవరం | జాతీయవిస్తరణ సేవాకేంద్రం |
| 50. గన్నవరం | ,, | ,, |
| 51. మైలవరం | విజయవాడ | ,, |
| 52. కంచికచర్ల | నందిగామ | ,, |
| 53. కలిదిండి | కైకలూరు | ,, |
| 54. గూడూరు | బందరు | ,, |
| 55. నాగాయలంక | దివి | ,, |
| 56. బంటుమిల్లి | బందరు | ,, |

| బ్లాకు పేరు | తాలూకా | బ్లాకువివరం |
|---|---|---|
| 57. నూజివీడు | నూజివీడు | సామాజికాభివృద్ధి బ్లాకు |
| 58. తిరువూరు | తిరువూరు | ,, |

## గుంటూరు జిల్లా

| బ్లాకు పేరు | తాలూకా | బ్లాకువివరం |
|---|---|---|
| 59. మంగళగిరి | గుంటూరు | జాతీయవిస్తరణ సేవాకేంద్రం |
| 60. మాచెర్ల | పల్నాడు | ,, |
| 61. ఈపూరు | వినుకొండ | ,, |
| 62. కర్లపాలెం | బాపట్ల | ,, |
| 63. అమరావతి | సత్తెనపల్లి | ,, |
| 64. రాజుపాలెం | ,, | ,, |
| 65. ఈమని | తెనాలి | ,, |
| 66. పల్లపట్ల | రేపల్లె | ,, |
| 67. నాదెండ్ల | నరసారావుపేట | ,, |
| 68. వేటపాలెం | బాపట్ల | ,, |
| 69. మద్దిపాడు | ఒంగోలు | సామాజికాభివృద్ధి బ్లాకు |
| 70. అమ్మనబ్రోలు | ,, | ,, |

## నెల్లూరు జిల్లా

| బ్లాకు పేరు | తాలూకా | బ్లాకువివరం |
|---|---|---|
| 71. ఇందుకూరుపేట | నెల్లూరు | జాతీయవిస్తరణ సేవాకేంద్రం |
| 72. తోటపల్లి గుండూరు | ,, | ,, |
| 73. ఉదయగిరి | ఉదయగిరి | ,, |
| 74. తాళ్ళూరు | దరిశి | ,, |
| 75. కురిచేడు | ,, | ,, |
| 76. బంగారుపేట | వెంకటగిరి | ,, |
| 77. చేజెర్ల | ఆత్మకూరు | ,, |
| 78. చింతవరం (ప్రధానకార్యస్థానం ఇంకానిర్ణయంకాలేదు) | గూడూరు | ,, |
| 79. పొదలకూరు | రాపూరు | సామాజికాభివృద్ధి బ్లాకు |
| 80. వెంకటాచలం | నెల్లూరు | ,, |

## చిత్తూరు జిల్లా

| బ్లాకు పేరు | తాలూకా | బ్లాకువివరం |
|---|---|---|
| 81. కార్వేటినగరం | పుత్తూరు | జాతీయవిస్తరణ సేవాకేంద్రం |
| 82. కాటూరు | కాళహస్తి | ,, |
| 83. రేణిగుంట | చంద్రగిరి | ,, |
| 84. పులిచర్ల | ,, | ,, |
| 85. తంబళ్ళపల్లి | మదనపల్లి | ,, |
| 86. రామకుప్పం | పలమనేరు | ,, |
| 87. కాళహస్తి | కాళహస్తి | ,, |
| 88. పల్లిపట్టు | తిరుత్తని | సామాజికాభివృద్ధి బ్లాకు |
| 89. నగరి | పుత్తూరు | ,, |
| 90. వాయల్పాడు | వాయల్పాడు | అనంతరతీవ్ర కృషిబ్లాకు |
| 91. కలికిరి | ,, | ,, |
| 92. చిన్నగొట్టిగల్లు | ,, | ,, |

## కడప జిల్లా

| బ్లాకు పేరు | తాలూకా | బ్లాకువివరం |
|---|---|---|
| 93. పోరుమామిళ్ళ | బద్వేలు | జాతీయవిస్తరణ సేవాకేంద్రం |
| 94. పూండ్లచెన్నుపల్లి | ,, | ,, |
| 95. కోడూరు | రాజంపేట | ,, |
| 96. యర్రగుంట్ల | కమలాపురం | ,, |
| 97. బలపనూరు | పులివెందుల | ,, |
| 98. ఖాజాపేట | సిద్ధవటం | ,, |
| 99. కోనంపేట | రాయచోటి | ,, |
| 100 జమ్మల మడుగు | జమ్మల మడుగు | సామాజికాభివృద్ధి బ్లాకు |
| 101 చెన్నూరు | కడప | అనంతర తీవ్ర కృషి బ్లాకు |
| 102 మైదుకూరు | ప్రొద్దుటూరు | ,, |

## అనంతపురం జిల్లా

| బ్లాకు పేరు | తాలూకా | బ్లాకువివరం |
|---|---|---|
| 103 గోరంట్ల | హిందూపురం | జాతీయ విస్తరణ సేవాకేంద్రం |
| 104 సింగనమల్ల | అనంతపురం | ,, |
| 105 కుడేర | ,, | ,, |
| 106 ముదిగుబ్బ | కదిరి | ,, |
| 107 చెన్నెకొత్తపల్లి | ధర్మవరం | ,, |
| 108 కంబదూరు | కల్యాణదుర్గం | ,, |
| 109 ఉరవకొండ | ఉరవకొండ | ,, |

| బ్లాకు పేరు | తాలూకా | బ్లాకు వివరం |
|---|---|---|
| 110 పెనుకొండ | పెనుకొండ | సామాజికాభివృద్ధి బ్లాకు |
| 111 మడకశిర | మడకశిర | ,, |
| 112 కొడిగెనహళ్ళి | హిందూపురం | ,, |
| 113 తలుపుల | కదిరి | ,, |

## కర్నూలు జిల్లా

| బ్లాకు పేరు | తాలూకా | బ్లాకు వివరం |
|---|---|---|
| 114 కొదుమూరు | కర్నూలు | జాతీయ విస్తరణ సేవా కేంద్రం |
| 115 బెస్తవారపేట | కంభం | ,, |
| 116 దేవనకొండ | పత్తికొండ | ,, |
| 117 కొమరవోలు | కంభం | ,, |
| 118 సంజామల | కోయిలకుంట్ల | ,, |
| 119 ఆలూరు | ఆలూరు | సామాజికాభివృద్ధి బ్లాకు |
| 120 ఎర్రగొండపాలెం | మార్కాపురం | ,, |
| 121 గిద్దలూరు | కంభం | ,, |
| 122 కర్నూలు | కర్నూలు | ,, |
| 123 పెద్దతుంబలం | అదోని | ,, |
| 124 కోసిగి | ,, | ,, |
| 125 ఎమ్మిగనూరు | ,, | ,, |
| 126 బండిఆత్మకూరు | నంద్యాల | అనంతర తీవ్ర కృషి బ్లాకు |
| 127 మల్లారెడ్డి వేదా నగరం | సిర్వేలు | ,, |

## హైదరాబాదు జిల్లా

| బ్లాకు పేరు | తాలూకా | బ్లాకు వివరం |
|---|---|---|
| 128 హాయాత్ నగరం | తూర్పు హైదరాబాదు | జాతీయ విస్తరణ సేవా కేంద్రం |
| 129 చేవెళ్ళ | షాహాబాదు | ,, |
| 130 తాండూరు | తాండూరు | ,, |
| 131 మోమిన్ పేట | వికారాబాదు | ,, |
| 132 ఇబ్రాహింపటం | ఇబ్రాహింపటం | ,, |
| 133 వికారాబాదు | వికారాబాదు | సామాజికాభివృద్ధి బ్లాకు |
| 134 రాజేంద్రనగర్ | పశ్చిమ హైదరాబాదు | ,, |
| 135 మేడ్చల్ | మేడ్చల్ | ,, |

## మెదకు జిల్లా

| బ్లాకు పేరు | తాలూకా | బ్లాకు వివరం |
|---|---|---|
| 136 నర్సాపురం | నర్సాపురం | జాతీయ విస్తరణ సేవా కేంద్రం |
| 137 వరగలు | గజ్వేలు | ,, |
| 138 దుబ్బాక | సిద్దిపేట | ,, |
| 139 మిర్జాపురం | జహీరాబాదు | సామాజికాభివృద్ధి బ్లాకు |
| 140 పటంచెర్వు | సంగారెడ్డి | ,, |
| 141 సదాశివపేట | ,, | ,, |

## నల్లగొండ జిల్లా

| బ్లాకు పేరు | తాలూకా | బ్లాకు వివరం |
|---|---|---|
| 142 రాయగిర్ | భోనగిరి | జాతీయ విస్తరణ సేవా కేంద్రం |
| 143 దురాచపల్లి | సూర్యాపేట | ,, |
| 144 నకిరెకల్లు | నల్లగొండ | ,, |
| 145 చౌటుప్పల | రామన్నపేట | ,, |
| 146 మిర్యాలగూడెం | మిర్యాలగూడెం | సామాజికాభివృద్ధి బ్లాకు |
| 147 దేవరకొండ | దేవరకొండ | ,, |
| 148 పెదవూర | మిర్యాలగూడెం, దేవరకొండ | ,, |

## ఖమ్మం జిల్లా

| బ్లాకు పేరు | తాలూకా | బ్లాకు వివరం |
|---|---|---|
| 149 కల్లూరు | మధిర | జాతీయవిస్తరణ సేవా కేంద్రం |
| 150 బూర్గంపాడు | బూర్గంపాడు, పాల్వంచ | ,, |
| 141 అశ్వారావు పేట | ,, | ,, |
| 152 వైరా | మధిర | సామాజికాభివృద్ధి బ్లాకు |
| 153 పాలేరు | ఖమ్మం | ,, |
| 154 తిరుమలాయపాలెం | ,, | ,, |

## మహబూబునగర్ జిల్లా

| బ్లాకు పేరు | తాలూకా | బ్లాకు వివరం |
|---|---|---|
| 155 కొందుర్గు | షాద్‌నగర్ | జాతీయ విస్తరణ సేవా కేంద్రం |
| 156 కల్వకుర్తి | కల్వకుర్తి | ,, |
| 157 ఆమనగల్లు | ,, | |

| బ్లాకు పేరు | తాలూకా | బ్లాకువివరం |
|---|---|---|
| 158 కొల్లాపురం | కొల్లాపురం | ,, |
| 159 దేవరకదర | ఆత్మకూరు | ,, |
| 160 బిజినేపల్లి | నాగరకర్నూలు | ,, |
| 161 గద్వాల | గద్వాల | ,, |
| 162 షాద్‌నగర్ | షాద్‌నగర్ | సామాజికాభివృద్ధి బ్లాకు |

## ఆదిలాబాదు జిల్లా

| బ్లాకు పేరు | తాలూకా | బ్లాకువివరం |
|---|---|---|
| 163 లక్సెట్టిపేట | లక్సెట్టిపేట | జాతీయ విస్తరణ సేవా కేంద్రం |
| 164 కడం | కానాపురం | ,, |
| 165 చిన్నూరు | చిన్నూరు | ,, |
| 166 సిర్పూరు | సిర్పూరు | ,, |
| 167 ఆదిలాబాదు | ఆదిలాబాదు | సామాజికాభివృద్ధి బ్లాకు |
| 168 ఉట్నూరు | ఉట్నూరు | బహుళార్థ సాధక ప్రాజెక్టు |

## కరీంనగర్ జిల్లా

| బ్లాకు పేరు | తాలూకా | బ్లాకువివరం |
|---|---|---|
| 169 మానకొండూరు | కరీంనగర్ | జాతీయ విస్తరణ సేవా కేంద్రం |
| 170 భీమదేవర పల్లి | హుజూరాబాదు | ,, |
| 171 మంథెన | మంథెన | ,, |
| 172 సుల్తానాబాదు | సుల్తానాబాదు | ,, |
| 173 మెట్టుపల్లి | మెట్టుపల్లి | సామాజికాభివృద్ధి బ్లాకు |
| 174 గంగాధర | కరీంనగర్ | ,, |

## వరంగలు జిల్లా

| బ్లాకు పేరు | తాలూకా | బ్లాకువివరం |
|---|---|---|
| 175 మహబూబాబాదు | మహబూబాబాదు | జాతీయ విస్తరణ సేవాకేంద్రం |
| 176 పరకాల | పరకాల | ,, |
| 177 సంగం | వరంగలు | ,, |
| 178 ములుగు | ములుగు | అనంతర తీవ్ర కృషి బ్లాకు |
| 179 నర్సంపేట | నర్సంపేట, పాఖాల | బహుళార్థ సాధక ప్రాజెక్టు |

## నిజామాబాదు జిల్లా

| బ్లాకు పేరు | తాలూకా | బ్లాకువివరం |
|---|---|---|
| 180 ఆర్మూరు | ఆర్మూరు | జాతీయ విస్తరణ సేవా కేంద్రం |
| 181 నిజామాబాదు | నిజామాబాదు | అనంతర తీవ్ర కృషి బ్లాకు |
| 182 నవీపేట | ,, | ,, |
| 183 బాన్సువాడ | బాన్సువాడ | ,, |
| 184 బోధన్ | బోధన్ | ,, |
| 185 యడపల్లి | ,, | ,, |

గమనిక:—1. బ్లాకు పేరే ఆ బ్లాకుయొక్క ప్రధాన కార్య స్థానం కూడా. అయితే ఈ క్రింది బ్లాకుల విషయంలో మాత్రం వాటి ప్రధాన కార్య స్థానములు వాటి కెదురుగా చూపబడిన చోట్ల తాత్కాలికంగా నెలకొల్ప బడినవి.

| బ్లాకు పేరు | తాత్కాలిక ప్రధాన కార్య స్థానం |
|---|---|
| 1 గోలుగొండ | నర్సీపట్నం |
| 2 తగరపువలస | భీముని పట్నం |
| 3 పూండ్ల చెన్నుపల్లి | బద్వేలు |
| 4 బండి ఆత్మకూరు | నంద్యాల |
| 5 భీమదేవర పల్లి | ముల్కనూరు |

జాతీయ విస్తరణ సేవా కేంద్రానికి, సామాజికాభివృద్ధి బ్లాకుకు, అనంతర తీవ్రకృషి బ్లాకుకు, బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరు అధికారి. బహుళార్థ సాధక ప్రాజెక్టుకు ప్రాజెక్టు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు అధికారిగా వ్యవహరిస్తాడు.

# మెట్రిక్ పద్ధతి తూకములు కొలమానములు ప్రజలెదుర్కొంటున్న ఇబ్బందులను తొలగిస్తాయి

దేశంలో అనేక రకాల తూకములు, కొలమానములు అమలులో వున్నవి. ఒక రాష్ట్రంలో అమలులోవున్న వాటికీ, మరొక రాష్ట్రంలో అమలులోవున్న వాటికీ ఎక్కడా పోలికే వుండదు. జిల్లా జిల్లాకు కూడా ఇవి వేరు వేరుగా వున్నవి. ఇందువల్ల దైనందిన లావాదేవీలలో పెద్ద చిక్కుగా వున్నది. ముఖ్యంగా చదువురాని ప్రజలు ఎన్నో చిక్కుల పాలవుతున్నారు. అయినా కొన్ని శతాబ్దాలనుంచి ప్రజలు ఈ చిక్కులకు అలవాటు పడి పోయ్యారు. మరో మార్గమేదీ కన్పించలేదు. అయితే ఇప్పుడు ఒకమార్గం కనుగొన బడింది. సార్వజనీనమైన మెట్రిక్ పద్ధతి తూకములు, కొలమానములు 1958 అక్టోబరునుంచి మన దేశంలో క్రమేణా ప్రవేశ పెట్టబడ నున్నవి. అందు చేత చిరకాలంనుంచి ప్రజల నెదుర్కొంటున్న చిక్కులు ఇక తొలగి పోతాయి.

ఇంత వరకూ దేశంలో అమలులోవున్న తూకములు, కొలమానములు ఎన్ని రకాలుగా, ఎంత చిక్కుగా వున్నవో, మన రాష్ట్రంలోని ఆంధ్రప్రాంతపు జిల్లాలలో వాడకంలోవున్న ఈ దిగువ వాటినిబట్టి తెలుసుకోవచ్చు.

## శ్రీకాకుళం-విశాఖపట్నం జిల్లాలు

### తూకములు

| | | |
|---|---|---|
| 2 చటాకులు | 1 నవటాకు | 1 1/4 ఔన్సులు |
| 8 నవటాకులు | 1 శేరు | 10 ఔన్సులు |
| 5 శేర్లు | 1 వీసె | 3 1/8 పౌనులు |
| 8 వీసెలు | 1 మణుగు | 25 పౌనులు |
| 8 మణుగులు | 1 కంట్లం | 200 పౌనులు |
| 20 మణుగులు | 1 పుట్టి లేక ఖండి | 500 పౌనులు |
| 2 ఏబులములు | 1 పదలం | 1 1/2 పౌనులు |
| 2 పదలములు | 1 వీసె | 3 పౌనులు |
| 8 వీసెలు | 1 మణుగు | 24 పౌనులు |
| 8 మణుగులు | 1 కంట్లం | 192 పౌనులు |
| 20 మణుగులు | 1 ఖండి | 480 పౌనులు |

### ధాన్యము, ద్రవ పదార్థముల కొలమానములు

| | |
|---|---|
| 4 గిద్దలు | 1 సోల |
| 2 సోలలు | 1 తవ్వ 2. 1/8 పింట్లు |
| 2 తవ్వలు | 1 అడ్డ లేక మానిక. 4 1/2 పింట్లు |
| 4 అడ్డలు | 1 కుంచం 17 పింట్లు |
| 20 కుంచములు | 1 బుడిపుట్టి |
| 80 కుంచములు | 1 పెద్దపుట్టి |
| 600 కుంచములు | 1 గరిసె |

## తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలు

### తూకములు

| | |
|---|---|
| 2 పంపులు | 1 ఏబులం |
| 2 ఏబులములు | 1 పదలం |
| 2 పదలములు | 1 వీశె 5 శేర్లు లేక 120 తులాలు |
| 2 వీసెలు | 1 ఎత్తు |
| 4 ఎత్తులు | 1 మణుగు లేక 25 పౌనులు |
| 20 మణుగులు | 8 పుట్టి లేక ఖండి |

( 1 పుట్టి బెల్లము 504 పౌనులకు సమానము )

### కొలమానములు

5 తులముల బరువుగల 1 గిద్ద బియ్యము]

| | |
|---|---|
| 2 గిద్దలు | 1 సోల |
| 2 సోళ్లు | 1 తవ్వ |

2 తవ్వలు — 1 మానిక లేక శేరు 80 తులముల బరువుగల బియ్యము.
2 మానికలు — 1 అడ్డ
2 అడ్డలు — 1 కుంచము లేక 320 తులాలు
20 కుంచములు — 1 ఏదుము లేక కావడి
2 ఏదుములు — 1 పందుం
2 పందుములు — 1 పల్లిపుట్టిలేక 80 కుంచములు
7 1/2 పల్లిపుట్లు — 1 గరిసె—600 కుంచములు లేక 192,000 తులముల బరువుగల బియ్యము.]

1 బస్తాధాన్యము (వడ్లు) 166 పౌనులు

## కృష్ణా జిల్లా

### తూకములు

| | |
|---|---|
| 3 తులాలు | 1 పలము |
| 8 పలములు | 1 శేరు |
| 5 శేర్లు | 1 వీసె |
| 8 వీసెలు | 1 మణుగు |
| 20 మణుగులు | 1 ఖారువ |

### కొలమానములు

| | |
|---|---|
| 2 శేర్లు | 1 మానిక |
| 2 మానికలు | 1 కుంచము |
| 20 కుంచములు | 1 బస్తా |
| 10 బస్తాలు | 1 పుట్టి లేక ఖండి |

## గుంటూరు జిల్లా

### తూకములు

| | |
|---|---|
| 3 తులాలు | 1 పలము |
| 8 పలములు | 1 శేరు |
| 30 తులాలు లేక 10 పలములు | 1 సవాశేరు |
| 5 శేర్లు లేక 4 సవాశేర్లు | 1 వీసె |
| 2 వీసెలు | 1 కట్టు లేక ఎత్తు |
| 8 వీసెలు | 1 మణుగు |
| 20 మణుగులు | 1 ఖారువ లేక పుట్టి |

### కొలమానములు

| | |
|---|---|
| 2 అర గిద్దలు | 1 గిద్ద |
| 2 గిద్దలు | 1 అరసోల |
| 2 అర సోలలు | 1 సోల |
| 2 సోలలు | 1 తవ్వ లేక శేరు |
| 2 తవ్వలు | 1 మానిక |
| 2 మానికలు | 1 అడ్డ |
| 640 మానికలు | 1 పుట్టి |

## నెల్లూరు జిల్లా

### తూకములు

| | |
|---|---|
| 3 తులాలు | 1 పలము |
| 5 తులాలు | 1 ఏబులం |
| 10 పలములు | 1 కాలవీసె |
| 20 పలములు | 1 అరవీసె |
| 40 పలములు | 1 వీసె (3 1/8 పౌనులు) |
| 8 వీసెలు | 1 మణుగు |
| 20 మణుగులు | 1 ఖారువ లేక పుట్టి |

### కొలమానములు

| | |
|---|---|
| 2 చటాకులు | 1 నవటాకు |
| 2 నవటాకులు | 1 పావుశేరు |
| 4 పావుశేర్లు | 1 శేరు |
| 3 1/2 శేర్లు | 1 ముంత |
| 4 ముంతలు | 1 కుంచము |
| 2 కుంచములు | 1 ఇరస |
| 2 ఇరసలు | 1 తూము |
| 5 తూములు | 1 ఏదుము |
| 2 ఏదుములు | 1 పందుం |
| 2 పందుములు | 1 పుట్టి |

## చిత్తూరు జిల్లా

### తూకములు

| | |
|---|---|
| 2 వీసెలు | 1 దడియం |
| 2 దడియములు లేక 8 వీసెలు | 1 మణుగు |
| 20 మణుగులు | 1 ఖారువ |
| 6 వీసెలు | 1 ముద్దడియం |
| 1 1/2 వీసెలు | 1 దడియం (చిత్తూరు, చంద్రగిరి తాలూకాలలో) |

## మదనపల్లి డివిజన్‌లో

### కొలమానములు

| | |
|---|---|
| 2 మద్రాసు పడులు | 1 ముంత |
| 8 ముంతలు | 1 తూము |

| | |
|---|---|
| 5 తూములు | 1 ఏదుము |
| 2 ఏదుములు | 1 పందుం |
| 2 పందుములు | 1 పుట్టి (320 మద్రాసు పడులు) |

## చిత్తూరు, చంద్రగిరి తాలూకాలలో

కొలమానములు

| | |
|---|---|
| 60 మద్రాసు పడులు | 1 పుట్టి |
| 1 1/2 మద్రాసు పడులు | 1 బల్ల |
| 20 బల్లలు | 1 పందుం |
| 2 పందుములు | 1 పుట్టి |

## అనంతపురం జిల్లా

తూకములు

| | |
|---|---|
| 21 తులాలు | 1 శేరు ( 0.4114 ఔన్సులు-) |
| 1 1/2 శేరు | 1 సవాశేరు |
| 2 సవాశేర్లు | 1 అదిశేరు-3 శేర్లు- |
| 2 ఆదిశేర్లు | 1 పంచశేరు-6 శేర్లు- |
| 12 శేర్లు | 1 దడియం |
| 4 దడియములు | 1 మణుగు (25.92 పౌనులు) |
| అర శేరు | 1/2 శేరు |
| పావు | 1/4 శేరు |
| అరపావు | 1/8 శేరు |
| చటాకు | 1/16 శేరు |

ధాన్యము కొలమానములు

| | |
|---|---|
| 1 శేరు | 88 తులాల బరువుగల రెండవరకం బియ్యం రాశి. తూకములు మొదలైన వాటి వలె అరశేరు, పావుశేరు. |

"శేరు," కంటె పెద్ద కొలమానము "ముంత". ఈ ముంత ప్రమాణం ఒక్కొక్క తాలూకాలో ఒక్కొక్క విధంగా వుండును.

| | |
|---|---|
| 16 ముంతలు | 1 తూము |
| 20 తూములు | 1 పుట్టి |

'ముంత' వలెనే "తూము", "పుట్టి" కూడా ఒక్కొక్క ప్రదేశంలో ఒక్కొక్క విధంగా వుండును.

## ద్రవపదార్థముల కొలమానములు

ధాన్యమునకుపయోగింపబడే శేరు, పాలు మొదలైనవాటికికూడా వాడుతారు. నూనె, నెయ్యి సాధారణంగా తూకం ప్రకారం అమ్ముతారు.

| | |
|---|---|
| 32 మద్రాసు పడులు | 1 తూము |
| 20 తూములు | 1 పుట్టి |

## కర్నూలుజిల్లా-తూకములు (నంద్యాలతాలూకాలో)

| | |
|---|---|
| 80 పౌనుల ప్రత్తి | 3 మణుగులు |
| 63 మణుగులు | 1 కంట్లం |
| 80 పౌనులు ప్రత్తివిత్తులు | 3 మణుగులు |
| 45 మణుగులు | 1 కంట్లం |

లింట్ ఒక్కొక్క ఖండికి 500 పౌనుల చొప్పున అమ్మబడుతుంది.

కొలమానములు

| | |
|---|---|
| 32 మద్రాసు పడులు | 1 తూము |
| 20 తూములు | 1 సింగం పుట్టి |
| 64 మద్రాసు పడులు | 1 తూము |
| 20 తూములు | 1 పెద్దపుట్టి [లేక నంద్యాల పుట్టి] |

# అభివృద్ధి కార్యక్రమ కేంద్రాల విశేషాలు

## కర్నూలుజిల్లా చర్చాగోష్ఠి

రాష్ట్రప్రణాళికలమంత్రి డిసెంబరు 16 వ తేదీన కలెక్టరు కార్యాలయంలో కర్నూలుజిల్లా మూడవ చర్చాగోష్ఠికి ప్రారంభోత్సవం జరిపారు. మంత్రిగారు తమ ప్రారంభోపన్యాసంలో ఇలా అన్నారు: "ఆహారోత్పత్తిని అధికం చేయవలసిన సమస్య ఈనాడు మన దేశాన్ని ఎదుర్కొంటున్నది. ఆహారరంగంలో విజయం సాధిస్తే తప్ప లేకపోతే మనం వాంఛిస్తున్న పారిశ్రామికాభివృద్ధి సాధ్యంకాదు. ఆహారస్వయం సమృద్ధి ప్రాతిపదికపై మనం వేసుకున్న పారిశ్రామిక పథకాలు ఆధారపడి వున్నవి. జిల్లాకలెక్టర్లు దీనిని ఒక పెద్ద సమస్యగా పరిగణించి, ఆహారకొరతను పరిష్కరించాలి. పట్టువీడకుండా స్వల్ప నీటి వనరులను నిర్మిస్తూ వాటివల్ల లాభంపొందుతూపోవాలి. ఎందుచేతనంటే భారీ ప్రాజెక్టులే పూర్తికావాలి, ఆహారసమస్య తీరాలని కూర్చుంటే ఆ ప్రాజెక్టులు త్వరగా ఫలితాన్నిచ్చేవికావు. ఆంధ్రప్రదేశ రాష్ట్రపరిస్థితి విచిత్రంగావుంది. ఆహారం విషయంలో మనది మిగులు రాష్ట్రం. కాని అక్కడక్కడా కొరత ప్రాంతాలున్నవి. అందుచేత స్థానికావసరాలను తీర్చి, ఆ తరువాత ఇతరరాష్ట్రాలకు సహాయపడడం మన విధ్యుక్తధర్మం."

ఆ తరువాత మంత్రిగారు అభివృద్ధి బ్లాకుల పరిపాలనా స్వరూపాన్ని ప్రస్తావిస్తూ "బలవంతరాయ మెహతా కమిటీ నివేదిక తమ అభిప్రాయాలలో విప్లవాన్ని తెచ్చింది" దన్నారు. పంచాయతీ అధ్యక్షులలోనుంచి బ్లాకు కమిటీ అధ్యక్షుణ్ణి ఎన్నుకోవాలనీ, ఆబ్లాకుకమిటీకి బ్లాకు డెవలప్‌మెంట్ ఆఫీసరు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా వ్యవహరించవలెననీ మెహతా కమిటీ నివేదిక సూచించింది. మెహతా కమిటీ నివేదికను అమలు జరుపడంలో ఆంధ్రప్రదేశ్‌దే మొదటి స్థానం. అయితే అధికార్లవల్ల పని జరగకపోవడం చేతనే మనం ఇలా అమలుజరపడానికి పూనుకున్నామని ఎవరూ భావించరాదు. అసలు కారణమేమంటే ప్రజాస్వామికవ్యవస్థలో ప్రజాభిప్రాయ మేమన్నింపబడాలి. ఈ బ్లాకు కమిటీలు ప్రజాసంస్థలుగా వ్యవహరిస్తాయి. వాటికి సంపూర్ణ స్వాతంత్ర్యం వుంటుంది. ప్రభుత్వం ఆమోదించిన కార్యక్రమాలను వారు స్వేచ్ఛగా అమలు జరుపుకోవచ్చు. ఈ పద్ధతి మొదట ప్రతిజిల్లాలో ఎన్నికచేయబడిన కొన్ని గ్రామాలలో అమలు జరుపబడుతుంది, అని మంత్రిగారు తెలియపరిచారు.

## తిరుపూరు బ్లాకుకు ఆరోగ్యకేంద్రం

తిరుపూరు సామూహికాభివృద్ధి బ్లాకులోని తెల్లదేవరపల్లి గ్రామంలో 11.12.1957 తేదీన బ్లాకుడెవలప్‌మెంట్ ఆఫీసరు ప్రాథమిక ఆరోగ్యకేంద్రానికి ప్రారంభోత్సవం జరిపారు. ఈ కేంద్రం ఇప్పుడు రూ 13,500 ల ఖర్చుతో నిర్మింపబడిన కమ్యూనిటీ సెంటర్‌లో నెలకొల్పబడి పనిచేస్తున్నది. ఈ ఖర్చుకుగాను ప్రజలు సగభాగం విరాళంగా ఇచ్చారు.

## కంచికచర్లలో మేలా

కంచికచర్లలో డిసెంబరు 13, 14 తేదీలలో జాతీయ విస్తరణ సేవాకేంద్రం ఉద్యోగులు మేలా జరిపారు. ఆటలపోటీలు జరిగాయి. సాయంత్రాలు నాటకాలు, బుర్రకథలు మొదలైన వినోదకార్యక్రమాలు జరిగాయి. పేలాది గ్రామస్తులు వీటిలో పాల్గొని ఆనందించారు. 14 వ తేదీ సాయంత్రం జిల్లాపశువైద్య శాఖాధికారి అధ్యక్షతన సభజరిగింది. అందులో వివిధ పోటీలలో గెల్చిన వారికి బహుమతులు పంచిపెట్టబడ్డవి.

## బాలల ఉద్యానవనం

వెల్లుర్తి సమీపాన అన్నకూరు గ్రామంలో స్థానిక స్వపరిపాలనా మంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి పేరిట నెలకొల్పబడిన బాలల ఉద్యానవనాన్ని 4 12.1957 తేదీన రాష్ట్రకార్మిక సంఘ సంక్షేమ శాఖలమంత్రి ప్రారంభించారు.

## గ్రామనాయకుల శిక్షణశిబిరం

ఆలూరు సామాజికాభివృద్ధి బ్లాకులోని నాగాయూరు గ్రామంలో రెండవగ్రామ నాయకుల శిక్షణశిబిరం



*గద్వాల జాతీయ విస్తరణ సేవా కేంద్రానికి ప్రణాళికల మంత్రి శ్రీ వి. బి. రాజు ప్రారంభోత్సవం చేశారు.*

ఏర్పాటు చేయబడింది ఈ శిబిరానికి తుంగభద్ర ప్రాజెక్టు స్పెషల్. కలెక్టరు ప్రారంభోత్సవంచేశారు. 50 మంది గ్రామనాయకులకు (వీరిలో 8 మంది స్త్రీలు కూడా వున్నారు) ఆధునిక వ్యవసాయ పద్ధతులు, కుటీర పరిశ్రమలు, పశుసంరక్షణ, అగ్నిమాపకము, ప్రథమ చికిత్స మున్నగు విషయాలలో నవంబరు 22 వ తేదీ నుంచి 27 వ తేదీవరకు శిక్షణ ఇవ్వబడింది. శిక్షణ పొందినవారు, అధికార్లు, గ్రామస్తులు కలిసి ఒక కచ్చా రోడ్డును మరమ్మతు చేశారు. గ్రామ వీధులను శుభ్రం చేశారు. శిబిర నిర్వహణకై ప్రజలు రూ 600 విరాళంగా ఇచ్చారు.

## దోమకొండ జనతాకళాశాల

ఆంధ్రప్రదేశ్ రహదార్లు, భవనములమంత్రి శ్రీ యం. నరసింగరావు పోయిన నెలలో నిజామాబాదుజిల్లా కామారెడ్డి తాలూకాలోని దోమకొండ జనతా కళాశాలను సందర్శించారు. కళాశాల డిపార్టుమెంటు, సిబ్బంది, సంచాయితీ సభ్యులు, కామారెడ్డి తహశీల్దారు మంత్రిగారికి స్వాగతమిచ్చారు.

కళాశాలలో "ఎక్స్" జట్టు అభ్యర్థులు శిక్షణపొందుతున్నారు. ఆ అభ్యర్థులను మంత్రిగారికి పరిచయం చేశారు. మంత్రిగారు సాంస్కృతిక కార్యక్రమాలను తిలకించారు. మంత్రిగారు అభ్యర్థుల నుద్దేశించి ప్రసంగిస్తూ యుద్ధానంతరం చైనా, జర్మనీ, రష్యా మున్నగు దేశాలలో జరిగిన పునర్నిర్మాణాన్ని ప్రస్తావించి ఆ ఉత్సాహం అందరకీ ఆదర్శంగా వుండవలె నన్నారు. గ్రామాల అభివృద్ధికి పాటుపడవలసిందిగా అభ్యర్థులకు విజ్ఞప్తి చేశారు. కార్మికులలో, రైతులలో, విద్యార్థులలో క్రమశిక్షణ లోపిస్తున్నందుకు తమ విచారం వెలిబుచ్చారు. సాంఘికవిలువల ప్రాముఖ్యాన్ని నొక్కిచెప్పి, హక్కులకోసం పోరాడేముందు అంతా తమ బాధ్యత

తేమిటో గుర్తించాలని అన్నారు. సామూహిక గానంతో సభ సమాప్తమైంది.

## అనంతపురం జిల్లాలో ప్రణాళికల మంత్రి

రాష్ట్రప్రణాళికలమంత్రి శ్రీ వి. బి. రాజు 21-12-1957 తేదీన అనంతపురంలో జరిగిన అనంతపురం పంచాయితీ అధ్యక్షుల ప్రథమ మహాసభలో ప్రసంగించారు. సభకు రాష్ట్రస్థానిక స్వపరిపాలనామంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి అధ్యక్షత వహించారు.

రాష్ట్రముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి ఈ మహాసభను ప్రారంభిస్తూ పంచాయితీల అధ్యక్షులు, సభ్యులు నిస్వార్థసేవ, బాధ్యతల గుర్తింపు మొదలగు సద్గుణాలను పెంపొందింప జేసుకోవలెనని ప్రబోధించారు. మంత్రుల కంటె పంచాయితీల అధ్యక్షులకే ప్రజాసేవ చేయడానికి ఎక్కువ అవకాశాలున్నాయన్నారు. గ్రామాలలో తగు అభివృద్ధి సాధింపబడకపోతే అది విచారించవలసిన విషయమేకాదు. పంచాయితీ ఎన్నికలవల్ల గ్రామాలలో కక్షలు, విద్వేషాలు పెరిగాయంటే అది సంఘానికే ఉపద్రవకరమని అన్నారు.

ప్రణాళికలమంత్రి శ్రీ వి. బి. రాజు ప్రసంగిస్తూ పంచాయితీలు ఎక్కువ అధికారాలకోసం ప్రయత్నించేటప్పుడు తమ బాధ్యత లేమిటో గుర్తించవలెనని అన్నారు. ఎందుకంటే అధికారాలతోపాటు బాధ్యతలూ వుంటాయి. ప్రభుత్వం ప్రతిజిల్లాలో ఒక బ్లాకును ఎన్నిక చేస్తుందనీ, ఆ బ్లాకులో సామాజికాభివృద్ధిని సాధించడానికై ప్రచారబాధ్యతను ఆ బ్లాకు ప్రాంతంలోని గ్రామ పంచాయితీలచే ఎన్నుకోబడిన పంచాయితీ సమితికి అప్పగిస్తుందనీ, బలవంతరాయ్ మెహతా కమిటీ అలా సిఫారసు చేసిందనీ తెలిపారు. ఇదొక ప్రయోగాత్మకచర్య. పరిపాలనా సంస్కరణ రంగంలో ఇది విప్లవాత్మకమైన ముందడుగు. ఈ పథకం విజయవంతం కావడంపైననే భవిష్యత్తులో అభివృద్ధివ్యవస్థ ఆధారపడివుంటుంది. ఆరునెల్ల లోపల గమనించదగిన అభివృద్ధి సాధ్యంకాకపోతే ప్రభుత్వం ఈ పథకాన్ని విరమించుకోవలసి వస్తుంది. కనుక పంచాయితీలు ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని ముందంజ వెయ్యాలి. ప్రస్తుతం దేశంలో ఆహారధాన్యాలను అధికంగా పండించవలసిన ఆవశ్యకత ఎంతైనావుంది, అని శ్రీ రాజు అన్నారు.

స్థానిక స్వపరిపాలనామంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి తమ ప్రసంగంలో పంచాయితీ అధ్యక్షులు తమ తమ గ్రామాలను అభివృద్ధి చేయవలెనంటే ప్రజావిశ్వాసాన్ని చూరగొనవలెననీ, ప్రజాసహకారాన్ని పొందవలెననీ ఉద్ఘాటించారు.

స్థానిక పరిపాలన ఇనస్పెక్టర్ జనరల్ శ్రీ ఏ రాఘవరెడ్డి ప్రసంగిస్తూ ప్రభుత్వం పంచాయితీలకు సహాయపడ నుద్దేశిస్తున్నదనీ, అయితే పంచాయితీలకు గ్రామాభివృద్ధిపట్ల శ్రద్ధాసక్తులుండడం అవసరమనీ తెలిపారు.

## బహుమతి ప్రదానం

కదిరితాలూకా వరవళ్ళ గ్రామస్తుడు శ్రీ నాదెళ్ళ సిద్దప్ప రాయలసీమలో ఎక్కువ వరిపంటపండించినందుకుగాను ఆయనకు ముఖ్యమంత్రి రూ 200/- ల బహుమతి అందజేశారు. అనంతపురం జిల్లాలోకెల్లా ఎక్కువపంట పండించినందుకు మరో బహుమతి రు॥ 100/ లు కూడా ఇచ్చారు.

ముఖ్యమంత్రి, ప్రణాళికలమంత్రి అనంతపురం పోలీసు శిక్షణ కళాశాలలో జరిగిన అనంతపురంజిల్లా నాల్గవ రెవిన్యూ ఆటలపోటీలలో పాల్గొన్నారు. శ్రీ వి. బి. రాజు ఆటలలో పాల్గొన్న అధికార్లను అభినందిస్తూ వారంతా పరిపాలనా రంగంలోకూడా అలాంటి కులాసా మనస్తత్వాన్ని అలవరచుకోవలెనని ప్రబోధించారు.

22-12-1957 తేదీ ఉదయం హిందూపురం ప్రయాణికుల బంగళాలో వాల్మీకి సంఘం అధ్యక్షుడు శ్రీ డి. యన్. ఉగ్ర శ్రీ వి. బి. రాజుగారికి పూలమాలవేశారు. కొండాపురం హరిజనులు తమకునివేశనస్థలాలుమంజూరు చేయవలసిందిగా మంత్రిగారికి మహజరు సమర్పించారు. వారి ఇబ్బందిని సత్వరమే తీర్చవలసిందిగా మంత్రిగారు తహశీల్దారును, బ్లాకు డెవలప్‌మెంట్ ఆఫీసర్ను ఆదేశించారు.

బ్లాకు డెవలప్‌మెంట్ కమిటీలన్నీ కొంతకాలంవరకు ఇతర విషయాలన్నిటినీ అలావుంచి "అధికాహారోత్పత్తి"కి సంబంధించిన సమస్యలను చర్చించేట్టు చూడవలసిందిగా ప్రణాళికలమంత్రి జిల్లాప్లానింగ్ ఆఫీసరునుఆదేశించారు.

ప్రణాళికలమంత్రి, స్థానిక స్వపరిపాలనామంత్రి హిందూపురానికి రెండుమైళ్ళదూరంలోవున్న సేవామందిరం దర్శించారు. సీనియర్ బేసికుస్కూలు, బేసిక్ సెకండరీ ట్రెయినింగు స్కూలు విద్యార్థులు సమర్పించిన గౌరవవందనాన్ని మంత్రులు స్వీకరించారు.

సేవామందిరం ధర్మకర్తల సమితి అధ్యక్షుడు శ్రీ కల్లూరు సుబ్బారావు మంత్రులిద్దరినీ గ్రంథాలయం



*2-12-1957* రేచెన కడం ప్రాజెక్టు వద్ద నీటి పాపడల, విద్యుచ్ఛక్తి శాఖల మంత్రి శ్రీ జె. వి. నరసింగరావు.

లోకి, ఉచిత గ్రామీణ ఆసుపత్రిలోకి తీసుకువెళ్ళి వాటిని చూపించారు. విద్యార్థులు విజయమంటపంవద్ద ప్రార్థన జరిపారు.

## సేవా మందిరం

శ్రీ కల్లూరు సుబ్బారావు సేవామందిరం చరిత్రను వివరించారు. శ్రీ వి. బి. రాజు ప్రసంగిస్తూ సామూహిక ప్రార్థన ప్రయోజనాన్ని విశదీకరించి, అలాంటి పద్ధతిని ప్రభుత్వకార్యాలయాలలో కూడా ప్రవేశ పెట్టవచ్చు నన్నారు. విద్యార్థులు యోచనా శక్తిని పెంపొందించుకొని, పరిశుద్ధ హృదయంతో వ్యవహరించవలె నన్నారు.

స్థానిక స్వపరిపాలనా మంత్రి శ్రీ కె. బ్రహ్మానంద రెడ్డి మాట్లాడుతూ సేవా మందిరం సభ్యుల సత్ప్రవర్తనకూ, వారి సంఘ సేవా నిరతికి తమ ఆనందం వెలిబుచ్చారు. చక్కని పని చేస్తున్నందుకు సేవా మందిరం నిర్వాహకులను అభినందించారు.

సీనియర్ బేసిక్ స్కూలు ప్రధానోపాధ్యాయులు శ్రీ పి. సత్యనారాయణ శాస్త్రి కృతజ్ఞతాభి వందనాలు

సమర్పించారు. మంత్రులు బేసిక్ స్కూలును సందర్శించారు.

ఆ తరువాత మంత్రిలు కొడిగెనహళ్ళి బ్లాకు డెవలప్ మెంటు ఆఫీసరు కార్యాలయం వద్ద వడ్రంగం, కంచరిపని, కంబళ్ళ నేత శిక్షణ కేంద్రాలను చూచారు. మంత్రిలకు జాతి కోడెలు, దున్నపోతులు చూపబడినవి. ఆ తరువాత మంత్రులు బ్లాకు వారిచే నెలకొల్పబడిన మొక్కల తోటను, కోళ్ళ పెంపకపు కేంద్రాన్ని తనిఖీ చేశారు.

## లేపాక్షి ప్రయాణం

మంత్రిలు లేపాక్షి వెడుతూ మొదుక పల్లి లోని మంచినీటి బావినీ మురుగు నీటి కాలువ ఏర్పాటునూ చూచారు. ఇవి సామాజికాభివృద్ధి కార్యక్రమం క్రింద ప్రజా విరాళంతో ఏర్పాటు చేయ బడ్డవి.

లేపాక్షిలో మంత్రులకు బ్లాకు డెవలప్ మెంట్ కమిటీ ఉపాధ్యక్షులు శ్రీ యల్. వెంకటనారాయణప్ప స్వాగతం చెప్పారు. శ్రీ కల్లూరు సుబ్బారావు గారు మంత్రులకు లేపాక్షి నందిని, శ్రీ వీరభద్ర స్వామి ఆలయాన్ని చూపారు. ఈ ఆలయం 16వ శతాబ్దిలో విజయనగర శిల్ప సంప్రదాయ పద్ధతిలో నిర్మింపబడింది. మంత్రులు లేపాక్షి శిల్పాన్ని కుడ్య చిత్రాలను చూస్తూ దాదాపు గంటసేపు గడిపారు. మంత్రిలు ఆలయాన్ని దర్శించి నందుకు గాను ఆలయంలో ప్రత్యేక పూజ ఏర్పాటు చేయబడింది.

పంచాయతీవారుమంత్రులకుస్వాగతపత్రం సమర్పిస్తూ గ్రామస్తులు ఇదివరకే నగదు రూపంలోను, వస్తు రూపంలోను శ్రమదాన రూపంలోను రూ॥30,000లు విరాళంగా ఇచ్చి ఉన్నత పాఠశాల, ఎలిమెంటరీ పాఠశాల, గ్రామ మందిరం, బాలల ఉద్యానవనం, నీటి సరఫరా పథకాల ఏర్పాటుకు తోడ్పడ్డారనీ, కనుక ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి అవసరమైన దాదాపు రూ॥ 20,000 లకు గాను గ్రామస్తులను దానిలో నాల్గవ వంతు విరాళం ఇవ్వ వలసిందిగా అడగక, మొత్తం డబ్బును ప్రభుత్వమే భరించి ఆరోగ్య కేంద్రాన్ని ఏర్పాటు చేయించ వలసిందనీ, పంటలు నష్టపడి నందు వల్లనే తాము నాల్గోవంతు ఇవ్వజాల మనీ గ్రామస్తులు మంత్రులకు విన్నవించుకున్నారు. శ్రీ యల్. వెంకటనారాయణప్ప ఆ ప్రాంతంలో బావులను లోతు చేయించవలసిన అవసరాన్ని ప్రణాళికల మంత్రికి విన్నవించారు. నీటి కట్టు బావులకు అప్పులు మంజూరు చేయవలసిందిగా మంత్రిగారు బ్లాకు డెవలప్ మెంట్ ఆఫీసరును ఆదేశించారు.

హిందూపురం పురపాలక సంఘం మంత్రిలకు పౌర సన్మాన పత్రం సమర్పించింది. సభకు శ్రీ కల్లూరు సుబ్బారావు అధ్యక్షత వహించారు. పురపాలక సంఘం అధ్యక్షులు శ్రీ కె. ఆర్. కృష్ణయ్య మంత్రులకు సన్మాన పత్రం సమర్పించారు. తాలూకా కాంగ్రెసువారు, బాలానంద సంఘంవారు కూడా మంత్రులకు స్వాగత పత్రాలు సమర్పించారు.

ప్రణాళికల మంత్రి శ్రీ వి. బి. రాజు పౌర సన్మాన పత్రానికి సమాధాన మిస్తూ ఇక మనం గ్రామ ఆర్థిక వ్యవస్థ పునర్నిర్మాణానికి కృషి చేయాలన్నారు. ఎంతో కాలంనుంచి గ్రామాలను చూచేవారు ఎవరూ లేకుండా వుండగా పట్టణాలకే ఇంకా హెచ్చు సదుపాయాలు కావాలని కోరడం న్యాయం కాదన్నారు. మన విద్యా విధానంలో లోపాలున్నవి. మన విద్యా సంస్థలు నిరుద్యోగ పరిస్థితిని ఇంకా తీవ్రతరం చేసేటందుకు అభ్యర్థులను తయారుచేసే కార్ఖానాలుగా తయారయ్యాయి. సామ్యవాద పద్ధతి సమాజ స్థాపనకై ధనికులు మార్గ దర్శకత్వం వహించాలి. ప్రజలు చిన్న మొత్తాల పొదుపు ఉద్యమాన్ని విజయవంతం చెయ్యాలి అని ప్రణాళికల మంత్రి అన్నారు. హిందూపురం నీటి సరఫరా పథకం 1958 ఫిబ్రవరి వరకల్లా పూర్తిచేయబడుతుందని శ్రీ కె. బ్రహ్మానంద రెడ్డి హామీ ఇచ్చారు. శ్రీ కల్లూరు సుబ్బారావు ప్రసంగిస్తూ చిన్న మొత్తాల పొదుపు ఉద్యమాన్ని విజయవంతం చేయడంలో తోడ్పడ వలసిందిగా ప్రజలకు విజ్ఞప్తి చేశారు. శ్రీ కె. లక్ష్మ నారాయణ వందన సమర్పణ చేశారు.

## రోడ్డుకు ప్రారంభోత్సవం

శ్రీ వి. బి. రాజు పెనుకొండ వెడుతూ మార్గమధ్యంలో కొడిగెనహళ్ళి బ్లాకులోని కొల్లకొంటలో శ్రమదానం ద్వారా వేయబడిన రోడ్డుకు ప్రారంభోత్సవం చేశారు. మానసముద్రంగ్రామస్తులు మంత్రిగారికి ఒక విజ్ఞప్తిని సమర్పిస్తూ ఊటుకూరు దగ్గర కాలువపై వంతెన నిర్మాణానికి మంజూరీ ఇవ్వవలసిందిగా మంత్రిగారిని కోరారు.

పెనుకొండ బ్లాకులోని పందిపర్తిలో శ్రమదానం ద్వారా వేయబడనున్న రోడ్డుకు మంత్రి ప్రారంభోత్సవం చేశారు. పెనుకొండ బ్లాకులోని మాగె చెరువు అప్రోచ్ రోడ్డుకు కూడా ప్రారంభోత్సవం చేశారు.

ఈ రోడ్డు నిడివి ఒకమైలు. మంత్రిగారు పెనుకొండ బ్లాకు కార్యాలయంలో బ్లాకు డెవలప్‌మెంట్ కమిటీ సభ్యులను కలుసుకొని వ్యవసాయాన్ని వృద్ధిజేసి ఆహారోత్పత్తిని అధికం చేయడానికై అనుసరించ వలసిన విధానాలను గూర్చి వారితో చర్చించారు. బ్లాకు ప్రధాన కేంద్రంలో మొక్కల తోటను వేయవలసిందిగా బ్లాకు డెవలప్‌మెంట్ ఆఫీసరును ఆదేశించారు.

మంత్రిగారు చెన్నెకొత్తపల్లి గ్రామానికి వెడుతూ ఒకటిన్నర మైళ్ళ దూరంలోవున్న కురుబవండ్లపల్లి అప్రోచ్ రోడ్డును చూచారు. ఆ తరువాత పూరీ గాజుల పరిశ్రమ శిక్షణ కేంద్రానికి వెళ్ళారు. అక్కడ వాణిజ్య పరిశ్రమల శాఖ అసిస్టెంట్ డైరెక్టర్ వారికి స్వాగతం చెప్పి కేంద్రం పనిచేసే విధానాన్ని వివరించారు.

జాతీయ విస్తరణ సేవాకేంద్రం అధ్వర్యాన ప్రజల విరాళంతో నిర్మింపబడిన బాలల ఉద్యాన వనాన్ని, పాఠశాల భవనాన్ని మంత్రిగారు చూచారు. శాసన సభ్యుడు శ్రీ పి. రామాచార్యులు, బ్లాకుడెవలప్‌మెంట్ కమిటీ ఉపాధ్యక్షుడు శ్రీ రామమూర్తి మంత్రిగారికి స్వాగతం చెప్పారు.

మంత్రిగారు బ్లాకు డెవలప్‌మెంట్ కమిటీ సభ్యులతో ఇష్టాగోష్టి సల్పుతూ ఆ ప్రాంతంలో జాతీయ విస్తరణ సేవా కార్యక్రమం వల్ల ఏమైనా ప్రయోజనం కలుగుతున్నదా అని ప్రశ్నించారు. ఈ కార్యక్రమం విషయంలో ప్రచారం హెచ్చుగా వున్నట్లయితే ప్రజలు బాగా సహకరించి తోడ్పడ గలరని సభ్యులు సమాధానం చెప్పారు. ప్రచార బాధ్యతను అనధికార్లు వహించాలని మంత్రిగారు సూచించారు. ఆహారోత్పత్తిని అధికం చెయ్యడానికి గల అవకాశాలను కూడా మంత్రిగారు సభ్యులను అడిగారు.

యర్రగం పల్లిలో మంత్రిగారు రోడ్డు పనినీ, మంచి నీటి బావి పనినీ, పాఠశాల భవనాన్నీ చూచారు. పాయదిండిలో హరిజనులు నివేశన స్థలా లిప్పించ వలసిందిగా మంత్రి గారికి విన్నవించు కున్నారు.

సాయంత్రం మంత్రిగారు ధర్మవరం ప్రభుత్వ ఆసుపత్రిలోని వైద్య—ప్రసూతి విభాగం ప్రారంభోత్సవంలో పాల్గొన్నారు. మంత్రిగారు అక్కడికి రాగానే పంచాయితీ అధ్యక్షుడు వారికి పూలమాల వేశారు. జిల్లాకలెక్టరు, స్థానిక స్వపరి పాలన ఇనస్పెక్టర్ జనరల్, జిల్లా వైద్యాధికారి మంత్రికి స్వాగతం చెప్పారు. వైద్య—ప్రసూతి విభాగానికి మంత్రి శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి ప్రారంభోత్సవం చేశారు.

శ్రీ వి. బి. రాజు ప్రసంగిస్తూ ఈనాడు భారత దేశాన్నెదుర్కొంటున్న ముఖ్య సమస్య ఆహార సమస్య అన్నారు. మన పారిశ్రామికాభివృద్ధివ్యవసాయోత్పత్తితో ముడిపడివుందన్నారు. కొత్తవిభాగంనిర్మాణానికై విరాళాలిచ్చిన వారిని శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి అభినందించారు.

మంత్రిగారు ప్రసంగిస్తూ పన్నులను ప్రస్తావించి రెండవ పంచవర్ష ప్రణాళికకు అయ్యే రూ 175 కోట్ల ఖర్చుకుగాను రాష్ట్ర ప్రభుత్వం వివిధ పన్నులద్వారా రూ. 28 కోట్లు మాత్రమే సేకరించ గలిగిందని అన్నారు. యుద్ధానంతరం జర్మనీ దేశం నష్టాలవల్ల చిన్నా భిన్న స్థితిలోవున్నా ఆ దేశ ప్రజలు సత్వరంగా పునర్నిర్మాణం చేసుకో గలిగారనీ, కనుక మనదేశస్తులు జర్మనీ వారిని చూచి నేర్చుకోవలసిందెంతైనా వున్నదనీ అన్నారు.

సభ సమాప్తమైన వెంటనే మంత్రిగారు కారులో ద్రోణాచలం వెళ్ళి అక్కడినుంచి రైలులో విజయవాడ వెళ్ళారు.

## నాగార్జునసాగర్ డాముకు హోంమంత్రి రాక

ఆంధ్ర ప్రదేశ్ హోంశాఖామంత్రి శ్రీ కె. వి. రంగారెడ్డి 1957 డిసెంబరు 19 వ తేదీ ఉదయం నాగార్జున సాగర్ డాముకు వచ్చారు. వెంటనే చీఫ్ ఇంజనీరు శ్రీ జాఫరలీ వెంటరాగా డాముస్థలం వద్ద అనేక పని విభాగాలను చూచారు. కాంక్రీటు గచ్చు యంత్రాలను, డాము నమూనాను చూచారు.

మంత్రిగారు నిర్మాణంలో వున్న డాముయొక్క కాంక్రీటు, రాతిపని విభాగాలను చూస్తూ కొంతసేపు గడిపారు. పని చురుకుగా జరుగుతున్నందుకు తమసంతసం వెలిబుచ్చారు.

మధ్యాహ్నం మంత్రిగారు నాగార్జున కొండకు వెళ్ళారు. అక్కడ త్రవ్వకాలలో బయల్పడిన క్రీ॥ శ॥ 3 వ శతాబ్దికి చెందిన బంగారు హారాన్ని, బంగారు నాణెములను చూచారు. పూర్వ కాలపు స్నాన ఘట్టాలనూ, అశ్వ మేధయజ్ఞ వాటికనూ, మ్యూజియమును చూచి రెండవేలఏళ్ళ క్రితం ఆ ప్రాంతంలో అంతటి నాగరికత వున్నందుకు తమ ఆనందాన్ని వెలిబుచ్చారు.

రాత్రి మంత్రిగారు హైద్రాబాదు వెళ్ళారు. చీఫ్ ఇంజనీరు శ్రీ జాఫరలీ, ఇతర ప్రాజెక్టు అధికార్లు మంత్రి గారికి వీడ్కోలు చెప్పారు.

## నాగార్జునసాగర్ వద్ద ఉద్యోగ సాధక కేంద్రం

**ఆంధ్రప్రదేశ్ కార్మికసంఘ సంక్షేమ శాఖల మంత్రి శ్రీ డి. సంజీవయ్య 1957 డిశంబరు 18 వ తేదీన మొట్ట మొదటి అభ్యర్థి కార్డును రిజిస్టరు చేయడం ద్వారా నాగార్జున సాగర్ డాము ఎంప్లాయిమెంట్ ఎక్స్చేంజికి ప్రారంభోత్సవం జరిపారు. మంత్రిగారు ఆ సందర్భంలో ప్రసంగిస్తూ డాము వ్యవస్థవారు ఈ ఎక్స్చేంజిని తమకు కావలసిన పనివారల భర్తీ కేంద్రంగా ఉపయోగించు కొనవలెనని చెప్పారు.**

# విస్తరణ సేవాకేంద్రాల అధికారులకు నిర్మాణ కార్యక్రమంలో శిక్షణ

దేశంలో సమాజ వికాస పాలనా వ్యవస్థకు అర్హులైన బ్లాక్ లెవల్ ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్ల ఆవశ్యకత నేడు ఎంతైనా వుంది. ఈ అవసరాన్ని తీర్చడానికై ఖాదీ గ్రామీణ పరిశ్రమల కమీషన్ వారు భారతప్రభుత్వ ఆర్థిక సహాయంతో పంజాబులోని నిలోఖేరిలోను, బొంబాయి రాష్ట్రంలోని నాసిక్, వార్ధాలలోను, మద్రాసు రాష్ట్రంలోని కల్లుపట్టిలోను, నాలుగు ఖాదీ గ్రామోద్యోగ మహా విద్యాలయములను స్థాపించారు. ఈనాలుగు చోట్ల సాంకేతిక శిక్షణకూ, నిర్మాణ కార్యక్రమ శిక్షణకూ తగు సౌకర్యాలున్నవి.

ప్రణాళిక విస్తరించినకొద్దీ దేశంలో జాతీయ వికాస కేంద్రాల సంఖ్యకూడా హెచ్చుతూ వున్నది. అందువల్ల ఎక్కువమంది ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్లు నేడు అవసరం. ఈ అవసరాన్ని తీర్చడానికే కమీషన్ వారు బీహారు రాష్ట్రంలోని పాట్నాలోను, మైసూరు రాష్ట్రంలోని కృష్ణరాజపురంలోను, ఆంధ్రప్రదేశ్‌లోని హైద్రాబాదులోను మరిమూడు మహావిద్యాలయాలను నెలకొల్పారు. హైద్రాబాదులోని మహావిద్యాలయం హైద్రాబాదు ఖాదీ గ్రామీణ పరిశ్రమల బోర్డువారిచే నడుపబడుతున్నది. ఈ బోర్డువారికి ఖాదీ గ్రామీణ పరిశ్రమల కమీషన్‌వారు గ్రాంట్లు ఇస్తున్నారు. ఈ మహావిద్యాలయాలు నిర్మాణ కార్యక్రమ సంస్థలు పని చేయువిధంగా వ్యవహరిస్తాయి. కనుక వీటి శిక్షణ కార్యక్రమంలో శిక్షణ పొందేవారి సామాజిక జీవితం ఒక ముఖ్యభాగంగా వుంటుంది. ఖాదీ గ్రామీణ పరిశ్రమల కార్యక్రమం ఒక ఆదర్శ విధానంపై ఆధారపడి వుంది. శిక్షణపొందే ప్రతి ఎక్స్‌టెన్షన్ ఆఫీసరూ ఆ ఆదర్శాన్ని అర్థం చేసుకోవాలి. దాన్ని బాగా జీర్ణించుకోవాలి. మహా విద్యాలయంలో ఆ విధంగా తర్ఫీదుపొంది వచ్చిన వారు కార్యక్రమం యొక్క ముఖ్యోద్దేశాన్ననుసరించి గ్రామీణ పరిశ్రమల అభివృద్ధికి చక్కగా సేవ చేయగలరని ఆశింప బడుతున్నది.

## ఆశ్రమ జీవితం

మహావిద్యాలయంలో ఇవ్వబడే శిక్షణలో అభ్యర్థుల సామాజిక జీవితానికి హెచ్చు ప్రాధాన్యమివ్వ బడుతుంది. అంతేగాక వారు సర్వోదయ సూత్రాల ప్రకారం తమ జీవన విధానాన్ని రూపొందించు కోవలసి వుంటుంది. ఒక్కమాటలో చెప్పాలంటే మహా విద్యాలయంలో వారికి ఆశ్రమ జీవితం గడుపవలసిందిగాను, నిరాడంబరంగా జీవితం గడుపుతూ,ఉన్నతాదర్శాలనే ఎల్లప్పుడూ కాంక్షించవలసిందిగాను బోధింప బడుతుంది. ఇతర సాధారణ శిక్షణ కేంద్రాలకూ, మహావిద్యాలయాలకు తేడా వుంది. మహా విద్యాలయంలో శిక్షణ పొందేవారికి గాంధేయ సంప్రదాయాల ప్రకారం, తమ జీవన విధానాన్ని రూపొందించు కోవలసిందిగా బోధింప బడుతుంది. మహా విద్యాలయంలో సౌభ్రాతృత్వ వాతావరణం కల్పించ బడుతుంది. శిక్షణ పొందే వారి నిత్య జీవిత విధానం ఇది: ప్రభాత వేళలో ప్రార్థన, ఆ తరువాత అంతా కలసి రాట్నం వడకడం, పరిసరాలను ఊడ్చి శుభ్ర పరచడం, పాకీపని, తోటపని. ఆతరువాత వివిధ వాల్గ్రామిక పనులలో ప్రత్యక్ష శిక్షణ. తరగతి గదిలో ఉపన్యాసాలు, వినోదాలు, ఆటలు వగైరా. చివరకు రాత్రి ప్రార్థ

నలతో వారి నిత్యవిధి ఆఖరవుతుంది. ఆ ప్రార్థనల్లో శిక్షణపొందేవారూ, శిక్షకులూ పాల్గొంటారు. ఈ విధంగా అంతా కలిసి కాయకష్టం చేయడం, ప్రార్థనల్లో పాల్గొనడంవల్ల మహావిద్యాలయ వాసులలో సోదరభావం, సేవాభావం పెంపొందుతవి.

## శిక్షణ కార్యక్రమం

ఖాదీ గ్రామీణ పరిశ్రమలలో ప్రత్యక్ష శిక్షణకు సంబంధించినంతవరకు శిక్షణ పొందేవారికి అసలు ఈపరిశ్రమ లెటువంటివి, గ్రామాలలోని పనివారలు వాటిని ఎలా చేస్తారు, వాటి సాంకేతిక పద్ధతులేమిటి, దేశ గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో వాటికిగల స్థానమేమిటి మొదలైన విషయాలన్నీ స్పష్టంగా తెలియజేయ బడుతవి. అంతే ఈ పరిశ్రమల పూర్వరంగము, వాటిని మేలురకం పద్ధతుల ప్రకారం అభివృద్ధి పరచవలసిన విధానమూ బోధింపబడుతాయి. ఇది ఈనాడు చాలా అవసరం. ఈ ఆవశ్యకతను దృష్టిలో పెట్టుకొనే మహావిద్యాలయాలలో సాధ్యమైనన్ని ఎక్కువ గ్రామీణ పరిశ్రమలను నెలకొల్పి, వాటిని మేలురకంపనిముట్లతో నడిపించ వలసిన విధానం చూపెట్ట బడుతున్నది. శిక్షణ పొందేవారికి ఈ పరిశ్రమల ఆర్థిక వ్యవహారాలనేగాక, తయారీ పద్ధతులలోని సాంకేతిక మెలకువలను కూడా బోధించడ మవుతుంది. శిక్షణ పొందే ప్రతి అభ్యర్థికీ నువ్వింత ఉత్పత్తిని సాధించాలని ఒక లక్ష్యం చెప్పబడుతుంది. ఆ ఉత్పత్తి నూలుకావచ్చు, బట్టలనేత కావచ్చు, నూనెతీయడం, సబ్బులు, కుండలుచేయడం, అగ్గిపెట్టెలపని, దంపుడు బియ్యం—ఏదైనా కావచ్చు. పరిశ్రమల ఎక్స్టెన్షన్ ఆఫీసర్లు శిక్షణ పూర్తిచేసుకొన్న తరువాత ప్రాజెక్టు ప్రాంతాలలోను, విస్తరణ కేంద్రాలలోను ఇతర కార్యక్రమాలకు సమన్వయంగా గ్రామ పరిశ్రమల అభివృద్ధికి పనిచేసి, గ్రామీణ ఆర్థిక వ్యవస్థను పటిష్ఠం చేయవలసి వుంటుంది.

తగువిధంగా శిక్షణపొందిన ఎక్స్టెన్షన్ ఆఫీసర్లు పేదరికంలో వున్న పల్లె ప్రజలకు సేవచేయాలనే అభిలాషను పెంపొందించు కోవాలి. అలాంటి అభిలాష తమకున్నట్లుగా స్వచ్ఛందంగా క్రమశిక్షణను అలవరచుకొని, ఆ క్రమశిక్షణ ప్రకారం రాట్నం వడికి నూలుతీయడం, ఖాదీనేత, కాయకష్టం మొదలగు పనులను ఎట్టి అరమరలు లేక చేయాలి.

మహావిద్యాలయంలో అభ్యర్థులకు ఈ క్రింది గ్రామీణ పరిశ్రమలలో విస్తృతంగా ప్రత్యక్ష శిక్షణ గరపబడుతుంది.

1. ఖాదీ నూలువడకడం, నేతపని.
2. ఆహారేతర తైలములతో సబ్బులు చేయడం.
3. మేలురకం గానుగులలో నూనెతీయడం.
4. అగ్గిపెట్టెల పరిశ్రమ.
5. కుండలు, మట్టిపాత్రలు తయారు చేయడం.
6. దంపుడు బియ్యం.

ఇంకా దేశీ కాగితం తయారుచేయడం, తేనె పట్టులను పెంచడం వంటి పరిశ్రమలను నెలకొల్పడానికి కూడా చర్యలు గైకొన బడుతున్నవి. ఈ పరిశ్రమలలో గరపబడే ప్రత్యక్ష శిక్షణవల్ల అభ్యర్థులు అనేక పరిశ్రమలలో ప్రావీణ్యం పొంది, సాంకేతిక నిపుణులుగాకూడా ఉపకరించ గలుగుతారు. అటువంటి శిక్షణను పొంది వుండడంవల్ల ఎక్స్టెన్షన్ ఆఫీసర్లు తమకు బ్లాకు ప్రాంతాలలో బాగా పేరు ప్రతిష్టలతో సేవ చేయగలగడమేగాక గ్రామ చేతి పరిశ్రమల వారిలో ఆత్మ విశ్వాసాన్ని, ఉత్సాహాన్ని ప్రవేశపెంచ గలుగుతారు. ఇతరులుకూడా వీరిని చూచి ఎంతైనా నేర్చుకోగల అవకాశముంటుంది. మహా విద్యాలయంలో కొన్ని రకాల పరిశ్రమలు స్థాపించ బడకపోవచ్చు. అట్టి పరిశ్రమలలో శిక్షణ నిమిత్తమై అభ్యర్థులను ఇతర కేంద్రాలకు తీసుకువెళ్ళి ప్రత్యక్షంగా శిక్షణ గరపడ మవుతుంది.

అభ్యర్థులకు గ్రామీణ పరిశ్రమలతో సంబంధంగల విషయాలనుగూర్చి, ఈ పరిశ్రమ లెదురొన్నే

(మిగతా 44 వ పేజీలో)

# ఉత్పత్తి దారునికీ వినిమయదారునికీ లాభం కలుగజేసే గిడ్డంగుల పద్ధతి

దేశమంతటా ముఖ్యమైన కేంద్రాలలో సరుకులను నిలవచేసే గిడ్డంగులను ఏర్పాటు చేయడానికై ప్రభుత్వం పూనుకున్నది. ఇందువల్ల ఉత్పత్తిదారునికీ, వినిమయదారునికీ, వ్యాపారస్తునికీ లాభం కలుగుతుంది. దేశంలో ప్రస్తుతం అమలులోవున్న నిలవ పద్ధతులు అంత బాగాలేవు. వాటివల్ల సరుకుకు ఎంతో నష్టం కలుగుతున్నది. శాస్త్రీయ పద్ధతుల ప్రకారం గిడ్డంగులను ఏర్పాటు చేయడంవల్ల అటువంటి నష్టం కలుగదు. పైగా సరుకుల క్రియ విక్రియాలు సక్రమంగా జరుగుతవి. అంతేగాక ఉత్పత్తిదార్లకు తక్కువ వడ్డీపై అప్పులు దొరకడానికి కూడా అవకాశాలేర్పడుతవి. ఇటువంటి వీళ్ళన్నీ కలుగజేయడానికే గిడ్డంగుల పథకం తలపెట్టబడింది. ఈ పథకం యొక్క ముఖ్యోద్దేశాలను ఉత్పత్తిదారులూ వ్యాపారస్తులూ సరిగా అర్థం చేసుకొని, వారు పూర్తి సహకారమిచ్చినట్లయితే ఇది విజయవంతంగా అమలు జరుగుతుందనడంలో సందేహమేమీ లేదు.

వ్యవసాయోత్పత్తులను సాధారణంగా పొలంలో గాని లేక ఇండ్లలో మట్టితోనో, వెదురు బద్దలతోనో చాపలతోనో, గోతాలతోనో నిర్మించిన ధాన్య కోశములలో, ధాన్యాగారాలలో నిలువచేస్తూ వుంటారు. మధ్య మార్కెట్లలోనూ, అడంగు మార్కెట్లలోనూ గిడ్డంగులలో లేదా ఖట్టీలు అనబడే భూగర్భ గిడ్డంగులలో నిలువ చేస్తారు. మరి కొన్ని చోట్ల పాతర్లలో వేస్తారు. అయితే వ్యవసాయోత్పత్తుల నిలువకు యీ ఏర్పాట్లు అంత సంతృప్తి కరమైనవి కావు. ఇవి ధాన్యమును, ఇతర సరుకులను క్రిమి కీట కాదుల నుండి గాని, ఎలుకల నుండి గాని రక్షించ లేవు. వాతావరణపు విపర్యయాల నుండి చెరుపుల నుండి సరుకు నిల్వకు ఇంతకంటె ఉత్తమమైన ఏర్పాట్లను గనుక చేసినట్లయితే ప్రతి యేటా దాదాపు 30 లక్షల టన్నుల ఆహార ధాన్యాలను చెడకుండా కాపాడ వచ్చునని అంచెనాలు తెలుపుతున్నవి.

పండిన ధాన్యమును లేదా సరుకును భారతదేశ రైతు ఎక్కువ కాలం అట్టిపెట్టు కోజాలడు. అందుకు అనేక కారణాలున్నవి. అందుచేతనే కోతలైన వెంటనే ఏ ధర వస్తే అంతకు అమ్మేస్తూ వుంటాడు. కుటుంబ ఖర్చులకో, లేదా అప్పులు తీర్చుకోవ డానికో, విత్తనాలు ఎరువులు కొనడానికో రైతుకు అప్పటి కప్పుడు నగదు డబ్బు కావాలి. ఆ డబ్బు దగ్గర లేకపోవడం చేతనే కోతలైన వెంటనే రైతు తన పంటను అమ్మి వేయవలసి వస్తున్నది. అది సాధారణంగా మార్కెట్లు నిండా సరుకు వచ్చి పడే తరుణం. ధరలు చాలా తక్కువగా వుంటాయి. అయితేనేం నిలువ చేసుకోవడానికి తగు ఏర్పాట్లు వుండవు కనుక అక్కరలను తీర్చుకోవడానికై అతడు వెంటనే ఏకాడికైనా పంటను అమ్మి సొమ్ము చేసుకోవలసి వస్తున్నది.

కనుక ఉత్పత్తి దారుల శ్రేయస్సును దృష్టియందుంచుకొని, సరుకు నిలువకు శాస్త్రీయమైన నిలువ ఏర్పాట్లు చేసే ఉద్దేశంతోనూ, రైతుకు డబ్బు దొరికే ఆధారాలను సమకూర్చవలెనన్న ఆశయంతోనూ భారత ప్రభుత్వ ఆహార వ్యవసాయ మంత్రిత్వ శాఖ విస్తృతమైన పథక మొకదానిని అమలు జరుప

వలెనని తలపెట్టింది. ఆ పథకము ననుసరించి దేశ మంతటా సరుకుల కొట్లు, గిడ్డంగులు నెలకొల్ప బడుతాయి.

ఈ కార్యక్రమంలో ఒక భాగంగా 1956 సంవత్సరపు వ్యవసాయోత్పత్తి (అభివృద్ధి, గిడ్డంగుల ఏర్పాటు) కార్పొరేషనుల చట్టము ననుసరించి 1957 మార్చి నెలలో 20 కోట్ల రూపాయల అనుమతింప బడ్డ మూల ధనంతో సెంట్రల్ వేర్ హౌసింగ్ కార్పొరేషన్ (కేంద్ర గిడ్డంగుల స్థాపక సంస్థ) ఏర్పాటు చేయబడింది. ప్రస్తుతానికి ఆ మొత్తంలో సగం ధనం మాత్రమే జారీ చేయబడింది. ఈ కార్పొరేషను కొత్త గిడ్డంగులను నిర్మింప జేస్తుంది. ఇదివరకే వున్న వాటిని తన పరం చేసుకుంటుంది. మొత్తం మీద వ్యవసాయోత్పత్తులను, విత్తనాలను, ఎరువులను, వ్యవసాయ పనిముట్లను నిలువ చేయడానికి, వసతి కలిగించడానికి గిడ్డంగులను సరుకు కొట్లను తన ఆజమాయిషీ క్రింద నడిపిస్తూ వుంటుంది.

పంట కోతలు జరిగిన వెంటనే వ్యవసాయోత్పత్తులను ఒక ప్రత్యేక పద్ధతి ప్రకారం నిలువ చేసి వుంచి, అవసర మైనప్పుడు ఆ సరుకును మంచి స్థితిలో లభింప జేయడమే గిడ్డంగుల పద్ధతి లక్ష్యం. ఇలా చేయడం వల్ల అటు ఉత్పత్తి దారునికీ, ఇటు వినిమయ దారునికీ కూడా లాభం కలుగుతుంది. దీనివల్ల ఉత్పత్తి దారులు మార్కెటు ఆవరణంలోనో, లేదా మార్కెటుకు దగ్గరగానో లైసెన్సు పొందిన, శాస్త్రీయమైన గిడ్డం గులలో తమ సరుకును నిలువ జేసుకో గలుగుతారు. అంతేగాక సరుకుకు నష్టం కలుగకుండా, సరుకు చెడి పోకుండా ఈ గిడ్డంగుల పద్ధతిలో తగు జాగ్రత్త వహింప బడుతుంది.

## గిడ్డంగి రసీదు

గిడ్డంగుల పద్ధతిలో అన్నిటికంటె ముఖ్యమైన విషయం రసీదు. దీనినే వేర్ హౌస్ రసీట్ అంటారు. అసంతృప్తికరంగా, లైసెన్సు లేకుండా వున్నట్టి గిడ్డంగులలో, సరుకుకొట్లలో వ్యవసాయోత్పత్తిని నిలువచేస్తే అది చెల్లుబడి గాని సరుకు. కాని అలా కాక లైసెన్సు పొందిన ఇట్టి గిడ్డంగులలో నిల్వచేసి వేర్ హౌస్ రసీదును గనుక పొందినట్లయితే ఆ సరుకుకు ఎప్పుడూ నగదు విలువ వుంటుంది. సరుకును గిడ్డంగి లోనే వుంచి లాభసాటిగా వ్యాపారం చేయవచ్చు. క్రమ పద్ధతి ప్రకారం మార్కెటింగ్ చేయవచ్చు. వేర్ హౌస్ రసీదును బ్యాంకువారు తీసుకొని, దానిని డిపాజిటు చేసిన వారికి సరుకును ప్రత్యక్షంగా స్వాధీనం చేయ నవసరం లేకుండానే తక్కువ వడ్డీ రేట్లకు అప్పులిస్తారు. వేర్ హౌస్ రసీదు అంటే విలువగల పత్రమన్న మాట. గిడ్డంగి అధికార్ల మద్దతు, పర్యవేక్షణ దానికి వుంటాయి. రాష్ట్ర గిడ్డంగి శాసనము ననుసరించి రాష్ట్ర ప్రభుత్వాలు ఆ రసీదులను క్రమ పద్ధతిలో పెడుతూ వాటిపై పర్యవేక్షణ జరుపుతూ వుంటాయి. ఇంతటి విలువ గల పత్రం గనుకనే వేర్ హౌస్ రసీదును హామీగా పెట్టుకొని బ్యాంకులు అప్పు ఇవ్వడానికి సిద్ధపడుతూ వుంటాయి. అలాంటి అప్పులకు బ్యాంకులు తీసుకొనే వడ్డీ రేటు, సరకును తాకట్టు పెట్టి తీసుకొనే అప్పులకు వేసే వడ్డీ కంటే చాలా తక్కువగా వుంటుంది. ఇలా తీసుకొన్న అప్పు సొమ్ముతో ఉత్పత్తి దారుడు లేదా రైతు తన వ్యవసాయ అవసరాలను తీర్చుకోవచ్చు. గిడ్డంగిలో వున్న తన సరుకును మంచి ధర రాగానే దాన్ని అమ్ము దలచుకొంటే వేర్ హౌస్ రసీదును కొనే వారి పేర మార్పు చేసి సరుకును అమ్ముకో వచ్చు. ఇలా అమ్మడం చాలా సులభమైన పద్ధతి. మరొక విశేష మేమంటే ఈ పద్ధతిలో ఒక డిపాజిటరుకూ మరో డిపాజిటరుకూ మధ్య విచక్షణ చూపబడదు. అందరినీ సమానంగానే చూడడం జరుగుతుంది. ఉత్పత్తి దారుడికీ, సహకార సంఘాలకూ, వ్యాపారస్థుడికీ తేడా లేదు. అంతా ఈ గిడ్డంగులలో సరుకు నిల్వ చేయవచ్చు. అయితే కొన్ని దశల్లో సహకారోద్యమాభివృద్ధికి దోహదంచేసే నిమిత్తం ఏమైనా ప్రత్యేక ప్రాధాన్యం చూపబడితే చూపబడవచ్చు. అలాంటప్పుడు ఇతరుల కంటె సహకార సంఘాలకు గిడ్డంగి చార్జీల విషయంలో కొద్దిగా రాయితీ చూపడం జరుగవచ్చు.

ఈ విధంగా గిడ్డంగుల పద్ధతివల్ల సరుకు నష్టపడదు. సరుకు చెడిపోదు. రైతు తన అక్కరల నిమిత్తం త్వరపడి అమ్ముకోవలసిన అగత్యం వుండదు. అతడు సరసమైన వడ్డీ రేట్లకు అప్పులు పొందవచ్చు. మంచిధరలు వచ్చినప్పుడు సరుకు అమ్మేసి తన కష్టానికి తగిన ప్రతిఫలం పొందవచ్చు, మరొక లాభంకూడా వుంది. ఈ గిడ్డంగులు తమవాడకం దార్లకు అప్పుడప్పుడు సరుకుల మార్కెట్ ధరలను తెలియజేస్తూ వుంటాయి. అలాంటిసమాచారం తెలుస్తూ వుంటే తన సరుకును ఎప్పుడు అమ్ముకోవాలో నిర్ణ యించుకొని లాభం పొందే అవకాశం ఉత్పత్తి దారుడికి కలుగుతుంది

## తరుగు పోదు

గిడ్డంగుల పద్ధతిలో ఎవరి పేర రసీదువుంటే సరుకుకు వారే యజమాని అని నిర్ణయ మవుతుంది. ఆ రసీదు పై

హక్కును, సరుకును ప్రత్యేకంగా మార్పిడి చేయ నక్కర లేకుండానే ఇతరుల పేరిట మార్చవచ్చు. ఈ సౌకర్యం వల్ల సరుకును తరచు మార్కెట్టుకు తీసుకు వెళ్లవలసి వచ్చుటచేతను, అటూ ఇటూ కదిల్చి తూకములు కొలతలు కొలవవలసి వచ్చుట చేతను పోయే తరుగు పోకుండా వుంటుంది. రవాణా చార్జీలు చెల్లించవలసిన అగత్యం వుండదు. పైగా అగ్ని ప్రమాదం, వరదలు, చోరీలు మొదలగు వాటివల్ల సరుకు నష్టపడకుండా భీమా ఏర్పాటు కూడా వుంటుంది. వివిధ సరుకులకు గ్రేడులను, పరిమాణాలను నిర్ణయించడానికీ, తద్వారా వ్యాపారాన్ని సుకరం చేయడానికీ ఈ పద్ధతి వల్ల వీలున్నది. ఏదేని లావాదేవీలు జరుగునప్పుడు సరుకును కొనేవారు స్వయంగా గిడ్డంగికి వెళ్లి శ్రమపడి సరుకు చూడనక్కర లేదు. అంతేగాక నమూనా ఒకటి చూపి, సరుకు మరొకటి సప్లయిచేసే లాంటి వ్యాపారాలలో వుండేటువంటి చిక్కులు, నష్టాలు యీ గిడ్డంగీల పద్ధతిలో వుండవు.

గిడ్డంగీల పద్ధతివల్ల సీజన్ల ప్రకారం జరిగే ఉత్పత్తుల హెచ్చు తగ్గులను నివారించి, సంవత్సర మంతటా, సమంగా సరుకుల వినిమయాన్ని జరిగేట్టు చెయడానికి వీలుంటుంది. దీనివల్ల మార్కెట్లలో సరుకులు కుప్పతిప్పలుగా వచ్చిపడడమో, లేదా అసలురాకుండా వుండడమో జరుగక ఒక క్రమ పద్ధతి ప్రకారం సరుకులు వచ్చే అవకాశ మేర్పడుతుంది. అలాంటి అవకాశంవల్ల అటు ఉత్పత్తి దారుడికి మొత్తంమీద మంచి ధర లభిస్తుంది. ఇటు వినిమయదారుడికి కూడా మరీ అంత విపరీతమైన ధర పడదు. ఉభయులకూ దీనివల్ల లాభమున్నది.

గిడ్డంగీల ఏర్పాటువల్ల మేలురకం విత్తనాలు, రసాయనిక ఎరువులు, వ్యవసాయ పనిముట్లు మొదలైనవి ఎప్పుడూ రైతులకు లభిస్తూ వుంటాయి. అలా లభిస్తే అధికోత్పత్తి సాధ్యమవుతుంది. అధికోత్పత్తి జరిగినప్పుడు జాతీయ ఆర్థిక వ్యవస్థకూడా బాగు పడుతుంది.

## కేంద్ర గిడ్డంగుల కార్పొరేషన్

కేంద్ర గిడ్డంగీల కార్పొరేషను రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో అఖిలభారత ప్రాముఖ్యంగల వ్యాపార కేంద్రాలలో దాదాపు నూరు గిడ్డంగీలను ఏర్పాటు చేయవలెనని తలపెట్టింది. వీటిలో ఒక్కొక్క దానిలో 20,000 టన్నుల సరుకును నిలువచేయడానికి వీలుంటుంది. 1957-58 లో డజను గిడ్డంగులు ఏర్పాటు చేయబడుతాయి. అంతేగాక కేంద్ర కార్పొరేషను 13 రాష్ట్ర కార్పొరేషనులకు (జమ్మూ-కాశ్మీరు రాష్ట్రం మినహా మిగిలిన రాష్ట్రాలలో ఒక్కొక్కదానిలో ఒకటి చొప్పున) రాష్ట్ర ప్రాముఖ్యంగల వ్యాపార కేంద్రాలలో 250 గిడ్డంగులను నెలకొల్పడంలో సహాయపడుతుంది. అవి ఒక్కొక్కటి 10,000 టన్నుల పరిమాణంగల వై వుంటాయి. దీనితోపాటుగా ఈ కార్పొరేషన్ గిడ్డంగులు లేని సబ్‌డివిజనల్ స్థాయి కేంద్రాలలో గిడ్డంగీలను, సరుకు కొట్లను ఏర్పాటు చేయడానికై ప్రభుత్వం సహకార సంఘాలకు సహాయం చేస్తుంది. ఈ విధంగా గిడ్డంగీ సౌకర్యాలు దేశవ్యాప్తంగా ఏర్పడతాయి.

కేంద్ర, రాష్ట్రీయ గిడ్డంగులపైన పెట్టబడే పెట్టుబడులవల్ల రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో అదనంగా దాదాపు 30 లక్షల టన్నుల ప్రమాణంగల నిలువ వసతి లభించగలదని ఆశింపబడుతున్నది.

## నిలువచేయబడు సరుకులు

మొదట ఆహారధాన్యాలు, ఆహార పదార్థములకు పనికి వచ్చు నూనె గింజలు, పశుగ్రాసం, నూనెపిట్టు, ఇతర తైలపదార్థములు, ముడిప్రత్తి (గింజతీసినది, తీయనిది) ప్రత్తి విత్తులు, ముడి జనుము, శాకతైలములు గిడ్డంగులలో నిలవ చేయుటకు స్వీకరింపబడుతాయి. ఆ తరువాత అనుభవాన్ని బట్టి, లభించేస్థల వసతినిబట్టీ, ఇతర సరుకులు కూడా తీసుకోబడగలవు.

గిడ్డంగీల నిర్వహణకై శిక్షణపొందిన సాంకేతికోద్యోగులు నియమింపబడుతారు. ప్రతి గిడ్డంగీకి ఒక మేనేజరు వుంటాడు. అతనితోపాటు ఒక సాంకేతిక సహాయకుడు కూడా వుంటాడు. తెగుళ్లు పురుగులు పడకుండా సరుకులను పరీక్షిస్తూ, సరుకు నిలువవున్న కాలంలో అది చెడకుండా చూడడం సాంకేతిక సహాయకుని విధి. సరుకులను గ్రేడింగు (తరగతుల వారీ విభజించడం) చేయడం కూడా సాంకేతిక సహాయకుని విధి. ప్రతి గిడ్డంగీకి చిన్న ప్రయోగశాల వుంటుంది.

ఈ పథకం సమర్థవంతంగా పనిచేసేట్టు చేయడానికై ప్రతి గిడ్డంగీకి స్థానిక సలహా సంఘము ఒకటి దానిని ఏర్పాటు చేయవలెనని తలపెట్టబడింది. ఆ సంఘంలో రెగులేటెడ్ మార్కెట్ కమిటీ, కో ఆపరేటివ్ మార్కెటింగ్ సొసైటీల ప్రతినిధులు, వాణిజ్య వ్యవసాయ వర్గాల ప్రతినిధులు, స్టేట్ బ్యాంకు, ఇతర పెట్టుబడి సంస్థల ప్రతినిధులు సభ్యులుగా వుంటారు.

గిడ్డంగీలలో ప్రవేశించే సరుకుల విషయంలో ఆచరణ సాధ్యమైన గ్రేడు ప్రమాణాలు రూపొందించబడుతున్నవి.

ఈ గ్రేడ్లు దేశంలో బాగా వ్యాప్తిలోకి వచ్చినప్పుడు ఉత్పత్తి దారుడికి మంచి ధరలు లభించడమేగాక వ్యాపారం నాఫీగా సాగుతుంది. కారణమేమంటే అప్పుడు సరుకులను ప్రత్యక్షంగా చూడనక్కరలేదు. నమూనాలుచూపి వ్యాపారంచేయనవసరంలేదు. సరుకు ఏ గ్రేడుకు సంబంధించిందో చెబితేచాలు, కొనేవ్యక్తి తాను ఏ రకం సరుకుకు ఆ ధర పెడుతున్నదీ చప్పున తెలుసుకుంటాడు.

ఈ నాడు గ్రామాలలో నవచైతన్యం కన్పిస్తున్నది. గ్రామసీమలలో సామాజికాభివృద్ధి బ్లాకులు, జాతీయ విస్తరణ సేవాకేంద్రాలు ఏర్పడి ప్రజలలో ఉత్తమ జీవితంపట్ల ఆసక్తిని కలుగజేస్తూ వున్నవి. వ్యవసాయదారుని ఆశయాలు నెరవేరాలంటే అందుకుతగు ఆధారాలనుకూడా చూపాలి. అతని ఆర్థిక స్థితిని శాశ్వతంగా అభివృద్ధి చెయ్యాలి. ఈ విషయంలో గిడ్డంగీల పద్ధతి ముఖ్యమైన పాత్ర వహిస్తుంది. ఈ పద్ధతివల్ల మార్కెటింగు క్రమబద్ధమవుతుంది. దుబారా, వృథా అంటూ వుండవు. రైతుకు తక్కువ వడ్డీకి అప్పు లభిస్తుంది.

---

# విస్తరణ సేవా కేంద్రాల అధికారులకు నిర్మాణ కార్యక్రమంలో శిక్షణ

(40 వ పేజీ తరువాయి)

సమస్యలనుగూర్చి ఉపన్యాసాలివ్వబడుతవి. విషయములు ఇవి:-

(అ) గ్రామాలలో స్థితిగతులు, గ్రామాల సమస్యలు. గ్రామీణ పరిశ్రమలపై ఆ స్థితిగతుల ప్రభావం.

(ఆ) నిర్మాణ కార్యక్రమం-గ్రామపరిస్థితులపై ఆ కార్యక్రమం ప్రభావం.

(ఇ) గ్రామీణ పరిశ్రమల ఆర్థిక విషయాలు.

(ఈ) మార్కెటింగ్, సహకారం.

(ఉ) ఖాదీ, గ్రామీణ పరిశ్రమల కమీషన్, ఆ కమీషన్ కార్యకలాపాలు.

(ఊ) సామాజికాభివృద్ధి కార్యక్రమం, విస్తరణ కార్యక్రమ పద్ధతులు.

ఈ విధంగా మహా విద్యాలయం అభ్యర్థులకు నిర్మాణ కార్యక్రమంలో శిక్షణ ఇవ్వడమేగాక గ్రామీణ పరిశ్రమలలో ప్రత్యక్షంగాను, సిద్ధాంత రీత్యానూ కొంత శిక్షణ ఇస్తుంది. ఈ విధంగా శిక్షణపొందిన ఆఫీసర్లు అభివృద్ధి కేంద్రాలలో అత్యంత శ్రద్ధాసక్తులతో, ఉత్సాహంతో వివిధ అభివృద్ధి కార్యక్రమాలను అమలు జరుప గలుగుతారు.

రెండవ పంచవర్ష ప్రణాళికకు రెండు ముఖ్య లక్ష్యాలున్నవి. ఒకటి గ్రామీణప్రజలలో నిరుద్యోగ స్థితిని తొలగించడం, రెండవది గ్రామాలలో భూములపై రైతు వత్తిడిని తగ్గించడం. ఈదృష్ట్యా ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్లు మహా విద్యాలయంలో వుండగా తగు పరిజ్ఞానం పొంది, ఆదర్శాలను తెలుసు కొన్నట్లయితే వారు గ్రామీణ పరిశ్రమల విస్తృతీకరణ ద్వారా పనులు లేకుండావున్న వారికీ, చేతినిండా పనిలేకున్న వారికీ వృత్తులు చూపగలుగుతారు. మహా విద్యాలయంలో గరపబడే నిర్మాణ కార్యక్రమ శిక్షణవల్ల అభ్యర్థులకు ప్రజా సహకారాన్ని పొందగల వ్యక్తిగత యోగ్యత సంక్రమిస్తుంది. ఆ సహకారంతో వారు తమ కార్యక్రమాలను విజయవంతంగా నెరవేర్చి, వారికప్పగించబడిన ప్రాంతాలలో గ్రామీణ పరిశ్రమల ద్వారా ఆర్థిక స్థిరత్వాన్ని సాధించ గలుగుతారు.

*గేయం :*

# పొదుపు పత్రాలు

—శ్రీ సుదర్శనరాజు

1. పెద్దలారా పిన్నలారా
భారతీయ సోదరులారా
పొదుపు చేయండీ మీరు పొదుపు చేయండీ
పొదుపులోనే బ్రతుకు అంతా యిమిడి వుందండీ
    పొదుపుగా వుండండీ, పొదుపు చేయండి
    పొదుపు పత్రాలను కొనరండీ, మీరు మీ పొదుపు పత్రాలను కొనరండీ.

2. పొదుపుగా వుండాలి పొదుపుగా బ్రతకాలి
చిన్న పెద్దలైనా పొదుపు చేయాలి
పొదుపు పత్రాలను కొనివేసి మనమంత
దేశపు పథకాల సాధించి తీరాలి
    పొదుపుగా వుండండి, పొదుపు చేయండి
    పొదుపు పత్రాలనూ కొనరండి, మీరు, పొదుపు పత్రాలనూ కొనరండి

3. కట్టుగా మనమంత కలిసి పనిచేయాలి
పట్టుగా మనమెంతో పొదుపు చేయాలి
పొదుపు చేసి మనము ఆదుకోనిననుగాని
దేశమ్ము ముందడుగు వేయుగా లేదు
మన పథకమ్ము యిక ముందు సాగగాలేదు ...పొదుపు.

4. ధనధాన్యంబుల లోటు పూడ్చుటకు
కూడుగుడ్డల కొరత దీర్చుటకు
పొదుపు పత్రాలను కొనివేసి తీరాలి
క్షామ దేవతనూ పారద్రోలాలి ...పొదుపు.

5. యేదేశమేగినా యెవరినడిగిననూ
యిసుమంతయునైన సాయంబురాదు
కాబట్టి మనమంత కట్టుగా బనిచేసి
పొదుపెంతో చేయాలి పరువు నిలబెట్టాలి ...పొదుపు.

6. రెండో ప్రణాళికకు గండంబు దప్పింప
దండు దండులుగాను బయలుదేరండి
కుప్ప తిప్పలుగాను కూడవేయండి
కష్టపడి చెమటోడ్చి పొదుపు చేయండి ...పొదుపు.



*24-12-1957 తేదీన కృష్ణా బ్యారేజీ ప్రారంభోత్సవం.*





ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీకి రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.





రాష్ట్ర సమాచార శాఖ మంత్రి శ్రీ పి. వి. రాజు సమాచార పౌరసంబంధముల శాఖ కార్యాలయంలో స్థానిక పత్రికా సంపాదకులను కలుసుకొని మాట్లాడారు.

